# ఆంధ్రప్రదేశ్ ను గురించి...

| | |
|---|---|
| విస్తీర్ణం .. .. .. .. .. | 1,06,286 చ. మై. |
| జిల్లాలు .. ... .. .. .. | 20 |
| తాలూకాలు .. .. .. .. .. | 189 |
| గ్రామాలు .. .. .. .. .. | 28,997 |
| పట్టణాలు, నగరాలు .. .. .. .. | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) .. .. .. | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) .. .. .. .. | 339 చ. మై. కి. |
| అక్షరాస్యులు (1961) .. .. .. .. | 76.27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) .. .. .. | 49.74 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961) .. .. .. | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు .. .. .. .. | 3,928 |
| విశ్వవిద్యాలయాలు .. .. .. .. | 4 |
| పంచాయతీలు .. .. .. .. | 15,266 |
| పంచాయతీ సమితులు .. .. .. .. | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు .. .. .. | 61 |
| విధానసభ సభ్యులు .. .. .. .. | 288 |
| శాసనమండలి సభ్యులు .. .. .. .. | 90 |

# ఆంధ్ర ప్రదేశ్

19374

సంపుటి 12 ] నవంబరు — 1967 [ సంచిక: 1

కార్తీక — ఆగ్రహాయన — 1889 శా.శ

ప్రధాన సంపాదకులు
బి. యన్. రామన్, ఐ. ఎ. యస్.

సంపాదకులు
ఎన్. వి. గోపాలశాస్త్రి

ఈ సంచికలో...

పేజీ



మొదటి అట్ట: మనం భారతీయులం

రెండవ అట్ట: ఆంధ్రప్రదేశ్ గురించి

మూడవ అట్ట: కొత్తగూడెం థర్మల్ కేంద్రం

నాలుగవ అట్ట: మన పంటసీమలు

* *
*

ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు. సం॥

# మీ సుఖమయ జీవితానికి శుభాకాంక్షలు

దీపాల తోరణాలు ఇంటింటా వెలుగుతాయి. కాని కొందరిళ్లలో దీపాలు మరింత కాంతివంతంగా వుంటాయి. ఈ వింత కాంతికి కారణం పిల్లలూ, పెద్దలూ ఆనందంగా వుండటమే. కొద్దిమంది పిల్లలుంటే వారి ఆలనపాలన బాగా జరుగుతుంది. ఇంట్లో సుఖశాంతులుంటాయి.

మీ కుటుంబాన్ని పరిమితం చేసుకోండి. మీ ప్రాంతంలోవున్న కుటుంబ నియంత్రణ కేంద్రంలో ఉచిత సలహాలు, సహాయము పొందండి. మరువకండి: ఎఱ్ఱ త్రికోణము కుటుంబ నియంత్రణ కేంద్రానికి గుర్తు.



పరిమిత కుటుంబం
సుఖానికి మూలం.
ఇద్దరు పిల్లలు చాలు.

# 'దేశమును ప్రేమించుమన్నా'

గురజాడ

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్.

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండి కలిగితె కండ కలదోయ్
కండకలవాడేను మనిషోయ్!

ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్.

అన్నిదేశాల్ క్రమ్మవలెనోయ్
దేశిసరుకుల నమ్మవలెనోయ్!
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయ్.

వెనకచూసిన కార్యమేమోయ్?
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనక పడితే వెనకేనోయ్!

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్!

దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్;
పూనియేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్!

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చెసెనోయ్,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్!

పరులకలిమికి పొర్లియేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయ్!
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్!

స్వంతలాభం కొంత మానుకు
పొరుగువారికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!

చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడువవలెనోయ్,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్

మతం వేరైతేను యేమోయ్?
మనసులొకటై మనుషులుంటే
జాతియన్నది లేచిపెరిగి
లోకమున రాణించునోయ్!

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరుల చెమటను తడిసిమూలం
ధనం పంటలు పండవలెనోయ్

ఆకులందున అణగి మణగీ
కవిత కోవిల పలకవలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్!!

# ముఖపత్రం

# మనం భారతీయులం

భారత స్వాతంత్ర్యసమరంలో వందలాది జాతీయనాయకులు వేలాది కార్యకర్తలు, లక్షలాది సామాన్యప్రజలు చేసిన మహోజ్వల త్యాగాల ఫలితంగా మనకు 1947 ఆగష్టు 15 వ తేదీన స్వాతంత్ర్యం లభించింది. మన సంపూర్ణ లక్ష్యాన్ని సాధించుకున్నాం. 1950 జనవరి 26 వ తేదీన రాజ్యాంగచట్టం అమల్లోకి వచ్చింది. దానితో భారత దేశం సర్వసత్తాక ప్రజా స్వామిక రిపబ్లిక్‌గా రూపొందింది పౌరులందరికీ ప్రాథమిక హక్కులు సంక్రమించినవి.

పౌరులందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం కలిగించడానికీ, భావప్రకటనా స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం ప్రసాదించడానికీ, సమానావకాశాలు కల్పించడానికీ రాజ్యాంగం ఉద్దేశిస్తున్నది. స్వతంత్ర ప్రతిపత్తిగల శాసన నిర్మాణ, పరిపాలనా నిర్వహణ న్యాయపాలనా విభాగాలతో కూడిన పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థను ఏర్పరుస్తూ, వ్యక్తిగత గౌరవం, జాతి ఐక్యతలను కాపాడుతూ ప్రజలమధ్య సోదర భావాన్ని పెంపొందించాలని కూడ రాజ్యాంగం నిర్దేశిస్తున్నది.

భారత ప్రజల అభీష్టానుసారంగా 1956 నవంబరు 1 వ తేదీ నుండి దేశంలో సక్రమమైన పద్ధతిలో రాష్ట్రాల పునర్విభజన కార్యక్రమం అమలు జరిగింది. సాధ్యమైనంతవరకు ఒకే భాష మాట్లాడే ప్రజలు అధిక సంఖ్యాకులుగాగల కలిసివున్న ప్రాంతాలన్నింటినీ ఒకే రాష్ట్రంగా ఏర్పాటుచేయడం జరిగింది. ఆనాడే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కూడా అవతరించింది. తరువాత క్రమంగా మహారాష్ట్ర, గుజరాత్, పంజాబ్, హరయానా రాష్ట్రాలు ఆవిర్భవించాయి

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిననాటి నుండి, ఎన్ని అడ్డంకులు వచ్చినా ఎదుర్కొంటూ, అన్ని రంగాలలోనూ అప్రతిహతంగా మనం పురోగమిస్తున్నాం. చైనా దండయాత్ర సమయంలోనూ, పాకిస్తాన్ దాడి సందర్భంగానూ భారతదేశ ప్రాంతీయ సమగ్రతను సంరక్షించుకోడానికి ప్రజలెంత దృఢ నిశ్చయులై వున్నారో లోకానికి విదితమైంది. రాష్ట్ర విభజన కార్యక్రమం ప్రధానంగా భాషా ప్రాతిపదికపై జరిగినప్పటికీ పరదేశాలు దాడిచేసినప్పుడు విజృంభించిన భారత జాతీయ సమైక్యతాభావము సర్వప్రపంచ ప్రజలను విస్మితులను చేసింది. అంతకుముందు అక్కడక్కడజరిగిన కొన్నికొన్ని దురదృష్టకర సంఘటనలూ, అప్పుడప్పుడు రేగిన చిన్న చిన్న తగాదాలూ తాత్కాలిక మైనవేననీ, వాటికి ప్రజల దృష్టిలో అంత ప్రాధాన్యంలేదనీ, జాతీయ సమైక్యతాభావ చేతన్యం భారత ప్రజలందరిలో సర్వవ్యాప్తమై వున్నదనీ స్పష్టమయ్యేసరికి ప్రపంచమంతా ఒక్కసారి మనవైపు ఆశ్చర్యంతో చూసింది. ప్రజాజీవితంలో ఎల్లప్పుడూ యీ సమైక్యతా చైతన్యం ప్రతిఫలిస్తూనేవుంది. జాతీయఉత్సవాలన్నింటిలో ప్రజలందరూ దీనిని ప్రదర్శిస్తున్నారు. ఎవరైనా కొద్దిమంది పౌరులలో యీచైతన్యం తగినంత లేనియెడల నిర్మాణాత్మక వైఖరి అవలంబించి, వారిలో దీనిని ఉద్దీపింపచేయడం ఎంతో అవసరం.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఎల్లప్పుడూ విశాల దృక్పథం గలవారు. వారెప్పుడూ మొదట తాము భారతీయులమని, ఆ తరువాతనే ఆంధ్రులమని భావిస్తారు. ఆంధ్రులు తమకు ఒక స్వంత రాష్ట్రం కావాలని కోరినప్పుడు కూడా ప్రత్యేకతా ధోరణులను ప్రదర్శించలేదు. సమైక్యతా విచ్ఛిత్తి దృక్పథాన్ని అనుసరించలేదు. వారు భాషా ప్రాతిపదిక మీద తమకొక స్వంత రాష్ట్రాన్ని కోరడం కూడా స్వాతంత్ర్యానికి జరిపిన జాతీయ పోరాటంలో అంతర్భాగంమాత్రమే. రాష్ట్రపాలనలో సామాన్యునికి అవకాశాన్నివ్వాలన్నదే ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటులోని అంతరార్థం. దేశాన్ని భాషాప్రాతిపదిక రాష్ట్రాలుగా విభజించినప్పుడే అది సాధ్యం కాగలదు. ఆంధ్రోద్యమం లోని ఈ మూలసూత్రాన్ని జాతిపిత అవగాహనచేసుకున్నారు. వారిపై తమ ఆశీః కృపారసాన్ని చిలకరించారు. భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలను ఏర్పాటు చేయడం వల్ల మొత్తం దేశంలోని అన్ని ప్రాంతాలూ అభివృద్ధి చెందగలవని నాయకులు గుర్తించారు.

ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకు అన్ని వివిధ రంగాల్లోనూ పౌరులందరూ సమానహక్కులు అనుభవిస్తున్నారు దేశంలో జాతీయ సమైక్యతా వాతావరణానికి చిహ్నంగా మన రాష్ట్రం పెంపొందుతూ వుండడం మనకు నిజంగా గర్వకారణం.

మన రాష్ట్రం ఏర్పడిన నాటినుండి ఎన్ని అడ్డంకులు వచ్చినా వాటిని తొలగించుకుంటూ, వివిధ రంగాలలో మనం చెప్పుకోదగిన ప్రగతి సాధించుకోగలిగాం. ఇంత పెద్ద రాష్ట్రం గనుక ఎక్కడో, ఏమూలో ఏదో ఒక చిన్న సంఘటనజరిగి వుండవచ్చు. ఏదో కొంత అసంతృప్తి కలిగివుండవచ్చుకాని మొత్తంమీద చూస్తే, యింత విశాలమైన రాష్ట్రంలో గత పదకొండు సంవత్సరాల కాలంలో మనం సాధించిన వృద్ధి గణనీయమైనదే. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతము దేశవిచ్ఛిత్తికి దారితీయలేదనే విషయంకూడా దీనివల్ల స్పష్టంగా ఋజువయింది పైగా ఈ విభజన వల్ల అనేక విధాలుగా జాతీయ సమైక్యతాభావం బలపడింది. ప్రజల మనసుల్లోనూ వ్యాప్తిచెందింది,

# ఆంధ్రప్రదేశ్ ప్రగతి

సి. వి. హెచ్. రావు



రాష్ట్రావతరణోత్సవం

ఆంధ్రప్రదేశ్ పదకొండువసంతాల్ని దాటి పన్నెండో యేట అడుగు పెడుతున్నది. ఈ సందర్భంలో సోదర ఆంధ్ర ప్రజానీకానికి శుభాకాంక్షల్ని అందజేస్తున్నాను. జాతీయ ఆర్థిక వ్యవస్థను పటుతరంచేసి, జాతీయ సమైక్యతను దృఢపరిచే విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రముఖ పాత్ర వహించే విధంగా ఆర్థిక, సాంఘిక రంగాలలో ప్రగతి గమనాన్ని మరింత శీఘ్రవంతం చేయడంలో రాష్ట్రంలోని అన్ని వర్గాలవారూ నిరంతర కృషి కొనసాగించగలరన్న ఆశాభావాన్ని వ్యక్తంచేస్తూ ఈ వ్యాసాన్ని ప్రారంభిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన ఈ పదకొండేళ్ళలోనూ, రాష్ట్రం అనేక క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంది. అనేక అనుభవాల్ని సంతరించుకుంది. పన్నెండోయేట అడుగుపెడుతున్న ఈ సందర్భంలో "మనం ఎక్కడున్నాం?" అని మనల్ని మనం ప్రశ్నించుకుంటే మన రాష్ట్రం "కదలకుండా, స్తబ్దంగాలేదు"— అని దీనికి సమాధానం చెప్పుకోవలసి వస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రగతివైపు ప్రయాణిస్తున్నది. అయితే యీ ప్రగతిగమనం మనం ఆశించినంత శీఘ్రంగా లేకపోయినప్పటికీ, రాష్ట్రం అభివృద్ధి దిశగానే అడుగులు వేస్తున్నది.

గతంలోకన్న యిప్పుడు ఈ ప్రగతియాత్ర మరింత శీఘ్రంగా కొనసాగవచ్చు. ఈ ద్వాదశ వత్సరం అందుకు శుభారంభం పలకవచ్చు. దురదృష్టవశాత్తు గడచిన రెండేళ్ళలోను అభివృద్ధి కుంటుపడింది. క్రమానుగతంగా మనం నిర్మిస్తూ వస్తోన్న అభివృద్ధి బహుశా కొంత కుంటుపడినప్పటికీ యిదొక స్థితిగా భావిద్దాం. అరుణరేఖలతో లోకం కాంతిమయం కావడానికి ముందు ముసురుకున్న చీకట్లుగా భావిద్దాం. ఈ రాత్రిని నెట్టివేస్తూ ఉదయం వస్తుంది. తెల్లటి కాంతి అంతటా పరచుకుంటుంది.

తొలి తొమ్మిదేళ్లు రాష్ట్రం మెల్లమెల్లగా, తడబడకుండా, అభివృద్ధిపథంలో అడుగులు వేస్తూ నడక సాగించింది. తృతీయ ప్రణాళిక మధ్యలో చైనా, పాకిస్తాను దురాక్రమణల్ని దేశం ఎదుర్కోవలసి రావడంవల్ల అభివృద్ధి మందగించినప్పటికీ ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలను విజయవంతంగానే అమలు జరుపుకున్నాం. చైనా, పాకిస్తాను దురాక్రమణలవల్ల ఉత్పన్నమైన పరిస్థితుల్నించి త్వరగానే కోలుకొన్నాం. నిజానికి ఈ దురాక్రమణలవల్ల జాతియావత్తూ జాగృతమైంది. కీడుకన్న మేలే ఎక్కువ జరిగింది. ఒకవైపు ఆర్థికాభివృద్ధి కృషి, మరొకవైపు దేశరక్షణ కృషి అటు జాతీయస్థాయిలోనూ, యిటు రాష్ట్రస్థాయిలోనూ విస్తృతంగా జరిగింది. దురాక్రమణ ఫలితాలనుంచి కోలుకోవడానికి యితోధికంగా ప్రయత్నాలు కొనసాగాయి.

గడచిన రెండేళ్ళలోనూ—అంటే 1965–66, 1966–67 లోనూ – ప్రగతి గమనం మరీ కుంటుపడింది. ఇందుకు ప్రకృతి వైపరీత్యమే ప్రధానకారణం. ఈ మాంద్యం ఒక్క ఆంధ్రప్రదేశ్ లోనేకాదు, యావద్భారతంలోనూ ఏర్పడింది. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు జీవాధారమైన వ్యవసాయోత్పత్తి బాగా దెబ్బతింది. దానికితోడు, యిప్పుడిప్పుడే మనం మెల్లమెల్లగా నిర్మించుకుంటున్న పారిశ్రామిక రంగంకూడా కుంటుపడింది. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థపై వీనిప్రభావం పడింది. అస్థిరమైన ఆర్థిక వనరుల కారణంగానూ, మొదటి ప్రణాళిక కేటాయింపును అనేకసార్లు తగ్గిస్తూ వచ్చినందువల్లనూ రాష్ట్ర చతుర్థ ప్రణాళికను రూపొందించడంలో అంతరాయం ఏర్పడింది. ఇప్పటికీ అంతరాయంగానే వుంది. నీటి పారుదల, విద్యుచ్ఛక్తివంటి రంగాలలోని అభివృద్ధి కార్యక్రమాలవల్ల నేరుగా ఆర్థికవ్యవస్థలోని లోటును భర్తీచేయవచ్చు. అందువల్ల అటువంటి రంగాలలో మినహా యితర అన్నిరంగాలలోని ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలనూ శీఘ్రంగా పునర్వ్యవస్థీకరించాలి.

## ఆర్థిక రంగం

1962 వ సం. పు అదనపు భూమిశిస్తు చట్టం చెల్ల నేరదని సుప్రీంకోర్టు తీర్పు యిచ్చింది. వ్యవసాయోత్పత్తి, ముఖ్యంగా ఆహార ధాన్యాల ఉత్పత్తి, తగినంతగాలేక వస్తువుల ధరలూ, జీవన ప్రమాణమూ విపరీతంగా పెరిగిపోయాయి. భూమిశిస్తు తదితర పన్నుల వసూళ్ళు తగినంతగాలేవు. దానికితోడు రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకూ, సిబ్బందికీ ప్రభుత్వం కరువు భత్యాన్ని, తదితర భత్యాలను చెల్లించవలసి వచ్చింది. వీటన్నిటి వల్లా రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ మబ్బుపట్టినట్టయ్యింది. పారిశ్రామిక రంగం కుంటుపడడంవల్ల పరిశ్రమలలో పెట్టుబడులు తగ్గాయి. నిరుద్యోగ సమస్య ఎక్కువయింది. అందువల్ల కార్మికుల్లో అసంతృప్తి వ్యాపించింది. సాంఘికంగా అసంతృప్తి నెల కొన్నది.

## మళ్ళీ కోలుకోగలం

చాలావరకు ఈ ఆటంకాలను, అడ్డులను మెల్లమెల్లగా అధిగమిస్తూ వస్తున్నాం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వ్యావసాయక రాష్ట్రంకదా. అలాంటి వ్యావసాయక రాష్ట్రంలోని ఆర్థిక వ్యవస్థ స్వరూపం ఎప్పుడూ వ్యవసాయరంగంలో సాధించిన అభివృద్ధిమీదే ఆధారపడి వుంటుంది. ఈ వ్యవసాయాభివృద్ధి అనేది అనుకూల వాతావరణ పరిస్థితులమీద అధారపడి వుంటుంది. ఆంధ్రప్రదేశ్‌లో, రానున్న పంట కాలం బావుండేటట్టు వున్నది. వ్యవసాయరంగం మళ్ళీ పుంజు కోవడంతో గత రెండేళ్లు ఏర్పడ్డ కరువు కాటకాలనుండి, వాటి ఫలితాలనుండి కోలుకోగలమన్న ఆశాభావం కని పిస్తున్నది.

గత మూడేళ్లుగా విద్యుత్పత్తికి అధిక ప్రాధాన్యతను యిచ్చి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. 1966-67 ప్రణాళిక లోను, 1967-68 సం. పు ప్రణాళికలోనూ విద్యుత్పత్తి పథకాలు చాలా పురోగమించాయి. నాగార్జునసాగర్ మన సుందర భవిష్యత్తుకు సోపానం. అలాంటి నాగార్జునసాగర్ యీ ఏడాదినుండి వాస్తవ ఫలితాన్ని ఇవ్వడం ప్రారంభిం చింది. తగినంత పంటభూమికి సేద్యపు నీటిని అందిస్తున్నది. ఈ ఏడాది పంటకూడా చాలా బావుంది. అందువల్ల వర్తమాన సంవత్సరంలో 10 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను సేక రించాలన్న ప్రభుత్వ లక్ష్యం నెరవేరగలదు. బహిరంగ మార్కెట్లలో తేలిగ్గా ఆహార ధాన్యాలను సేకరించే అవకాశం వుంటుంది. అందువల్ల ధరలు తగ్గవచ్చు. భూమిశిస్తు హెచ్చింపు చట్టాన్ని గత శాసనసభ సమావేశంలో అనుమ తించడంవల్ల రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో తరుగును భర్తీ చేయ డానికి అవకాశం ఏర్పడింది. పైపెచ్చు అభివృద్ధికి అవసరమైన వనరులను పెంచడానికి కూడా మార్గం ఏర్పడింది. రానున్న పంటకాలం బావుండేటట్టు వున్నందువల్ల రైతులకు చక్కటి ప్రతిఫలం లభించవచ్చు. అందువల్ల, వారు లోగడ బకాయి పడిన భూమిశిస్తు, తదితర పన్నులను యిప్పుడు వసూలుచేసే అవకాశం వుంది. రాష్ట్రం యింకా పూర్తిగా క్లిష్టపరిస్థితిని అధిగమించలేదు. అయితే అధిగమించడానికి వీలయిన వాతా వరణం మాత్రం ఏర్పడింది.

కేంద్రానికి చేసిన వాగ్దానం మేరకు, రాంలో్ష్ర ని చట్టబద్ధమైన లేపను ఉన్న ప్రాంతాల అవసరాల మేరకు ఆంధ్రప్రదేశ్ సేకరించవలసిన 10 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను సేకరించినపిదప, ఆహార ధాన్యాలను సమానంగా పంపిణీ చేయడానికి తగుచర్యల్ని రాష్ట్ర ప్రభుత్వం తీసుకుంది. అందువల్ల ప్రజలు తమ ఆహారావసరాలను తీర్చుకునేందుకు యిబ్బంది పడవలసిన అవసరం వుండదు. అయితే వ్యవసాయ దారులు చేయవలసిన పని ఒకటివుంది. వివిధ రకాల ధాన్యం, తదితర కాయధాన్యాలను లాభసాటిగా, ప్రకటించిన ధరలకు వాటిని ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాకు గాని, మిల్లర్లకు గాని తమవద్దవున్న మిగులు నిలవలను రైతులు యివ్వవలసి వుంటుంది. ఆ విధంగా చేస్తే ఒక జాతీయ ఆహార విధానాన్ని రూపొందించడంలో ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రంగా ఒక ప్రముఖ పాత్ర వహించగలదు.

## వ్యవసాయోత్పత్తులు

గత పదకొండేళ్ళలోనూ రాష్ట్రం వ్యవసాయోత్పత్తు లలో క్రమంగా అభివృద్ధిని సాధిస్తూ వస్తున్నది. గడచిన రెండే ళ్ళలోనూ ఆహారోత్పత్తిలో ఏర్పడిన మాంద్యాన్ని పక్కకు నెట్టి చూస్తే ఒక విషయం అవగత మౌతుంది. 1956-57 లో ఆహారోత్పత్తి 50 లక్షల టన్నులుంది. 1966-67లో ఉత్పత్తి 61 లక్షల టన్నులకు తగ్గినా 1964-65లో అది 77 లక్షల టన్ను లకు పెరిగింది. ఈ అధిక ఆహారోత్పత్తికి కారణాలు అనేకం వున్నాయి. ముఖ్యంగా చెప్పుకోదగ్గది సేద్యపు నీటి సౌకర్యం. అనేక చిన్న సేద్యపు నీటి ప్రాజెక్టులను, పథకాలను అమలు పరచడం ద్వారా సాగు నీటిసౌకర్యం విస్తృత పరచబడింది. రసాయనిక ఎరువుల సరఫరాలు పెద్ద మొత్తాలలో అంద జేయడంవల్లా, భూసార పరిరక్షణ చర్యలను తీవ్రతరం చేయ డం వల్లా ఉత్పత్తులు పెరిగాయని చెప్పవచ్చు. పైపెచ్చు వ్యవసాయ విస్తరణ ఏజన్సీలు కూడా చాలా తోడ్పడ్డాయి. రైతులకు ఆధునిక, శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులను తెలియ జేసి బహుళ ప్రచారం చేశాయవి. వ్యవసాయ పరిశోధక సంస్థలు కూడా యిందుకు కొంత దోహదం చేశాయి. ఇవి అధిక దిగుబడినిచ్చే మేలురకం వరి వంగడాలని, మొక్కజొన్న, జొన్న వంటి తదితర కాయధాన్యాలలో హైబ్రిడ్ రకాలను, మేలుజాతి విత్తనాలను రూపొందించి, తద్వారా అధికోత్పత్తికి దోహదకారులయ్యాయి. ఇదిగాక వ్యవసాయాభివృద్ధి కార్య క్రమం క్రింద, సాంద్ర వ్యవసాయ పథకంక్రింద సేద్యపు నేలను బాగా విస్తరింప జేయడం జరిగింది. పశ్చిమ గోదావరి జిల్లా, అధిక దిగుబడి వంగడాల క్రిందగల ప్రాంతాలు మినహా సాంద్ర వ్యవసాయ పథకాన్ని మొత్తం 117 సమితి బ్లాకులలో

ప్రవేశపెట్టారు. అందువల్ల గత రెండేళ్ళలోనూ 10 లక్షల ఎక రాలకు అధిక దిగుబడి వంగడాలను విస్తరింప జేసినట్లయ్యింది.



నాగార్జునసాగర్ కుడికాలువ గుండా నీటి విడుదలకు ప్రారంభోత్సవం.

భారీ ఎత్తున సేద్యపు నీటి పారుదలకు అవకాశాలు కలుగజేసిన ప్రాజెక్టులలో తుంగభద్ర ఎగువ కాలువ, నాగార్జునసాగర్ ప్రాజెక్టు ముఖ్యమైనవి. నాగార్జునసాగర్ ప్రాజెక్టు క్రింద ఇప్పటివరకు ఆరు లక్షల ఎకరాలకు నీటి పారుదల చేయడానికి అవకాశాలు వున్నాయి. అయితే ప్రాజెక్టు ఆయకట్టులో భూములను సేద్యయోగ్యం చేయడంలో విలంబన ఏర్పడడంవల్ల ప్రస్తుతానికి ఈ విస్తీర్ణంలో సగం మేరకు మాత్రమే లాభిస్తుంది. 1968 వ సంవత్సరారంభం నాటికి ఈ పరిస్థితిలో మార్పు వస్తుంది. అప్పటివరకు సుమారు 3 లక్షల ఎకరాలకు తక్కువ వ్యవధిలో పండే పైర్లు వేసే నిమిత్తం నీరు సరఫరా చేయడం జరగవచ్చు. నాగార్జున సాగర్ జలాశయంనుంచి ఈ యేడాది ఖరీఫ్ పైరుకు మొదటి సారిగా నీటిని విడుదల చేయడంతో, సాగర్ ఆనకట్టనూ, కాలువలనూ, తత్సంబంధిత కార్యక్రమాలనూ పూర్తిచేయడానికై గత దశాబ్ద కాలంగా నిరంతరాయంగా సాగిన కృషి ఫలించింది.

## క్రెస్ట్ గేట్లు

ఆనకట్ట పనులకు ఇప్పటివరకు సుమారు రూ. 135 కోట్లు ఖర్చయ్యాయి. అంచనాల మేరకు 22 లక్షల ఆయకట్టును అభివృద్ధిపరచి దానినుంచి పూర్తి ప్రయోజనాలను పొందడానికి పూర్వం మరో రూ. 30 కోట్లు ఖర్చుకాగల పనులు అమలు జరగవలసి వున్నవి. రాష్ట్ర ప్రయోజనం కంటె అధికంగా జాతీయ ప్రయోజనం దృష్ట్యా ఈ ప్రాజెక్టుకు సంబంధించిన మిగతా దశల పనులకు, క్రెస్ట్‌గేట్ల స్థాపన విషయంలో తలెత్తిన నిష్ప్రయోజనమైన, అనవసరమైన వివాదంవల్లకానీ, కృష్ణానది జలాల కేటాయింపు విషయంలో ఏర్పడిన దీర్ఘకాల వివాదంవల్లకానీ ప్రతిష్టంభన ఏర్పడకూడదని ఆశించాలి. ప్రస్తుతం రాష్ట్రం ఆర్థికంగా గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటున్నందువల్ల, ప్రభుత్వం కొద్ది మొత్తాలను కేటాయించిన కారణంగా పోచంపాడు ప్రాజెక్టు పనులు కొంచెం మందగొడిగా సాగుతున్నాయి.

పైన పేర్కొన్న భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులుకాక నీటి కొరతవున్న రాయలసీమ జిల్లాలలోనూ, తెలంగాణా ప్రాంతంలోనూ చెరువులు, లిఫ్టు ఇరిగేషన్ వనరుల వంటి అనేక చిన్న తరహా ఇరిగేషన్ పథకాలను చేపట్టారు. కొత్తగా భూములను సేద్యం క్రిందికి తేవడానికి ఈ వనరులు తోడ్పడుతున్నాయి. గోదావరి బ్యారేజ్ నిర్మాణం పూర్తయినప్పుడు గోదావరి డెల్టాలో ఆహారోత్పత్తి బాగా పెంపొందుతుంది. దీని నిర్మాణం ముగియడానికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. ఈ పథకానికి అవసరమయ్యే ధనంలో అధిక మొత్తం ఈ డెల్టా ప్రాంతంలోని వ్యవసాయదార్ల నుంచి స్వచ్ఛంద విరాళాల ద్వారా సమకూర్చబడే అవకాశం వుంది.

## విద్యుచ్ఛక్తి అభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ సాధిస్తున్న అభివృద్ధిని అంచనా వేయడంలో విద్యుత్పత్తిని అధికం చేయడానికై ఇటీవలి సంవత్సరాలలో రాష్ట్రం తనకుగల అపారమైన బొగ్గు, నీటి వనరులను వినియోగించడంలో సాధిస్తున్న పురోగతిని ప్రధానంగా గణ్యతలోనికి తీసుకొన వలసి వుంటుంది. ఆధునిక యుగంలో విద్యుచ్ఛక్తి ప్రగతికి చిహ్నంకాగా ఇది లభించడం అట్టి ప్రగతికి ప్రాతిపదిక ఏర్పడడమన్నమాట. వ్యావసాయిక, పారిశ్రామిక అభ్యున్నతికి ఇది మూలాధారం. రాష్ట్రం యొక్క సాంఘికాభివృద్ధి కూడా దీనిపైన ఆధారపడివుంది. మూడవ ప్రణాళిక ఉత్తరార్థంలోనూ, వర్తమాన సంవత్సరానికీ, గత సంవత్సరానికీ సంబంధించిన రాష్ట్ర వార్షిక ప్రణాళికల (వీటికి కేటాయించిన పూర్తి మొత్తాలు వరుసగా రూ. 74.87 కోట్లు, రూ. 70.26 కోట్లు) లోనూ విద్యుత్పత్తికి అధిక మొత్తాలు (ప్రతి సంవత్సరం రూ. 32 కోట్లు) ప్రత్యేకించడం జరిగింది. క్రిందటి రెండు సంవత్సరాలలో సాధించిన స్థాపిత విద్యుత్పత్తి శక్తి గత ఆరు సంవత్సరాలలో సాధించినదానికి ఇంచుమించు సమానంగావుంది. స్థాపిత విద్యుత్పత్తి శక్తి 1961 వ సంవత్సరంలో 213 మెగావాట్లు మాత్రమే వుండగా 1966 నాటికి ఇది 282 మెగావాట్లకు పెరిగింది. గడచిన ఆగష్టులో కొత్తగూడెం థర్మల్ కేంద్రంలో మూడవ, నాలుగవ యూనిట్లను వినియోగంలోనికి తేవడంతో స్థాపిత శక్తి 513 మెగావాట్లకు పెరిగింది. అయితే పటిష్ఠమైన శక్తి 480 మెగావాట్ల వరకు వున్నట్లు అంచనా. ఈ రంగంలో పురోగతి ఇప్పటి నుంచి మరింత వేగంగా వుండాలి. ఎందుచేతనంటే 1971 ముగింపు నాటికి 982 మెగావాట్లు విద్యుత్పత్తి ప్రమాణాన్ని చేరుకోవాలని లక్ష్యంగా మనం పెట్టుకొన్నాం

ఇప్పుడు నిర్మాణపు తుదిఘట్టంలోనున్న కొత్తగూడెం 3వ దశ పనులు, దిగువ సీలేరు ప్రాజెక్టు మొదలైన హైడల్ థర్మల్



జవహర్ కాలువ (కుడి కాల్వ) దృశ్యం

ప్రాజెక్టులన్నీ నిర్ణీత కార్యక్రమం ప్రకారం పూర్తయినట్లయితే లక్ష్యం సులభంగా సిద్ధిస్తుంది.

విద్యుదుత్పత్తిలోనూ స్థాపిత శక్తిలోనూ పెరుగుదల ఏర్పడిన ఫలితంగా పరిశ్రమలకూ, పంపుసెట్లకూ, గ్రామీణ విద్యుదీకరణకూ, గొట్టపు బావులకూ, లిఫ్ట్ ఇరిగేషన్ పనులకూ ఇతోధికంగా విద్యుచ్ఛక్తి లభిస్తున్నది. (రాష్ట్రం మొత్తంమీద 68,000 పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి లభింప చేయవలసి వుందనీ,



శ్రీశైలం ప్రాజెక్టు ప్రారంభోత్సవం

6000 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించవలసి వుందనీ అంచనా.) వ్యవసాయం ప్రాతిపదికగాగల గ్రామీణ పరిశ్రమలను విరివిగా నెలకొల్పే కార్యక్రమం అద్యతన భావిలో ముందంజ వేసినట్లయితే విద్యుచ్ఛక్తి సరఫరా పరిస్థితి క్లిష్టదశకు చేరుకుంటుంది. రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు విద్యుత్పత్తి శక్తిని పెంపొందించడంతోపాటు ట్రాన్స్‌మిషన్ లైన్లు వేయడంలోనూ, విద్యుచ్ఛక్తి పంపిణీ వ్యవస్థను మెరుగు పరచడంలోనూ నిమగ్నమై వున్నది.

## సాంఘిక అభివృద్ధి

అభివృద్ధి చెందిన ఇతర రాష్ట్రాల స్థాయికి చేరుకోవడానికై వివిధరంగాలలో పురోభివృద్ధి సాధించవలసి వున్న ఆంధ్రప్రదేశ్ వంటి అభివృద్ధి చెందుతున్న రాష్ట్రం అవసరాలు అనేకం. రాష్ట్ర ఆదాయాన్నీ, తలసరి సగటు ఆదాయాన్నీ పెంపొందించడానికి ఉద్దేశించిన ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలు రాష్ట్రప్రణాళికా ప్రాధాన్యతల జాబితాలో సాంఘికాభివృద్ధి, సాంఘిక సేవా కార్యక్రమాలతోనూ, సాంఘిక, ఆర్థిక అసమానతలను తొలగించి సాంఘిక న్యాయాన్ని పెంపొందించడానికి సంబంధించిన కార్యక్రమాలతోనూ పోటీపడతాయి. ఈ రెండు రంగాలలోను అభివృద్ధి సమానంగా జరగటం తప్పనిసరి. అయితే మొదటితరహా కార్యక్రమాలపై వుండే ప్రభావం దృగ్గోచరమైనదీనూ, మదింపు చేయదగినదీ. కాని రెండవరకం కార్యక్రమాలపై వుండే ప్రభావం ఇలాంటిది కాదు. ఇది అగోచరమైనది. అంచనాలకు అందనిది. ఏమైనప్పటికీ ఈ రెండింటికీ మధ్య సమానతను సాధించవలసిన ఆవశ్యకతను నిర్లక్ష్యం చేయరాదు.

వివిధ కార్యక్రమాలకు అందుబాటులోనున్న పరిమిత నిధులను కేటాయించడంలో ప్రాధాన్యతను పరిశీలించే సందర్భంలోనూ, మదింపు చేసే సందర్భంలోనూ రాష్ట్ర ప్రభుత్వం సాంఘికాభివృద్ధి విషయాలకు సముచితమైన ప్రాముఖ్యం ఇస్తున్నదని చెప్పక తప్పదు. రాష్ట్ర నాలుగవ ప్రణాళిక పెట్టుబడిని రూ. 523 కోట్లకు స్థిరపరచారు. కాగా తొలుత ప్రతిపాదించిన పెట్టుబడి రూ. 700 కోట్లు. ఈ పెట్టుబడి మొత్తంలో రూ. 280 కోట్ల వరకు కేంద్రం నుంచి సహాయంగా లభిస్తుంది. మిగతా మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వం స్వంత వనరుల నుంచి సమకూర్చుకోన వలసివుంది. ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో అభివృద్ధి పథకాలకు రూ. 145 కోట్లు మాత్రమే ఖర్చవుతాయి కనుక పరిమితమైన ఆర్థిక, సాంఘికాభివృద్ధి లక్ష్యాలను సైతం చేరుకోవడానికి మిగిలిన మూడు సంవత్సరాల కాలంలో ఖర్చుపెట్టడానికి పెట్టుబడిలో దాదాపు మూడింట రెండు వంతుల మొత్తం మిగిలి వుంటుంది.

## వనరుల సమీకరణ

అభివృద్ధి, ఆదాయ వనరుల సమీకరణకు మధ్య జరుగుతున్న పందెంలో రెండవది తప్పనిసరిగా వెనుకంజవేస్తున్నది. ఈ పరిస్థితిని అన్ని రంగాలలోనూ అధికంగా ఉత్పత్తులను సాధించడం ద్వారాను, పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువగా పొదుపు చేయడం ద్వారానూ, ఆదాయం చేకూర్చే కార్యక్రమాలకు ఇతోధికంగా పెట్టుబడి పెట్టడం ద్వారానూ,

ధరల తగ్గింపు. నిలకడలను సాధించడం ద్వారానూ, వీటికి తోడుగా సూక్ష్మంగా పరిశీలించి నిర్ణయించిన అదనపుపన్నులు, సర్ ఛార్జీల ద్వారానూ పెద్ద ఎత్తున ఆదాయపు వనరులను రాష్ట్రంలో సమకూర్చవలసిన అవసరాన్ని నొక్కి-చెబుతున్నది. వివిధ వర్గాల ప్రజల సహకారంతో ఆదాయపు వనరులను పెంపొందించు కోవడంలో రాష్ట్ర ప్రభుత్వం విజయం సాధించడంపైననే, వ్యవసాయం, రాకపోకలు, రవాణా సౌకర్యాలు, విద్య మొదలయిన సాంఘిక సేవా రంగాలలోని లక్ష్యాలను నెరవేర్చడం ఆధారపడి వుంటుంది.

అదృష్టవశాత్తు 1967—68వ సంవత్సరంలో ఈ ప్రయత్నాలకు నాంది (లేక పునరుద్ధరణ) జరిగింది. వ్యతిరేకత వచ్చినప్పటికీ స్టాంపు డ్యూటీల మార్పు, భూమిశిస్తు పెంచింపు చట్టం వంటి అదనపు పన్ను విధింపు చర్యలు తీసుకొనబడినవి. ధరల పెరుగుదల వల్ల ఇబ్బందులు పడుతూ, వివిధ వ్యవస్థ (జాతీయ, రాష్ట్ర, మునిసిపల్, స్థానిక) లచే విభిన్న స్థాయిలలో విధించబడే పన్నుల వల్ల అధిక భారం పడుతున్నదని ప్రజలు యిప్పటికే భావిస్తున్నందువల్ల వారిపై ఇంకా అదనపు



పోచంపాడు ప్రాజెక్టు ప్రారంభోత్సవం

పన్నులు వేయడం సహజంగానే వాంఛనీయం కాదు. అయితే వ్యవసాయం, పరిశ్రమలు తదితర ఉత్పత్తి రంగాలలో మాంద్యం ఏర్పడకుండా అభివృద్ధిని సాధించడానికి కృషి జరిగినట్లయితే, అభివృద్ధి కార్యక్రమాలపై చేస్తున్న భారీ మొత్తాల ఖర్చు, సమర్ధవంతమైన ఆచరణ విధానాల ద్వారా, లభించిన భౌతిక ఫలితాలను చేకూరుస్తున్నాయని ప్రత్యక్షంగా చూపించగలిగినట్లయితే దీనికి ఉపశమనం కలిగించినట్లవుతుంది.

## కొత్త రైల్వే మండలం

మనం ఆశించిన రీతిగా గతకొన్ని సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ సత్వరాభివృద్ధికి దోహదం కల్పించే ప్రత్యేకంగా పేర్కొనదగిన కొన్ని అభివృద్ధికరమైన సంఘటనలు జరిగినాయి. ఇందులో దక్షిణ మధ్యరైల్వే మండలంఏర్పాటు ప్రథమంగా పేర్కొనవచ్చు. దీనిఫలితంగా రాష్ట్రంలోను, అంతర్ రాష్ట్రీయంగాను వాణిజ్య, రవాణా రంగాలలో మన అవసరాలను తీర్చేందుకు అవకాశం ఏర్పడతుంది. ఈ మండలం ఏర్పాటు ద్వారా కలిగే ఫలితాలు వెంటనే మనకు లభించక పోయినా వచ్చేకొన్ని సంవత్సరాలలో యీ ప్రయోజనాలు పొందగలమని ఆశించవచ్చు. నాగార్జున ప్రాజెక్టు మార్గంగా ఒంగోలు-హైదరాబాదుల మధ్య నేరుగా రైల్వేలైన్ వేయాలనే ఆంధ్రప్రదేశ్ ప్రజల కోర్కెను రైల్వే అధికారులు సానుభూతితో జాగ్రత్తగా పరిశీలించాలి. దీనివల్ల నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద ఎక్కువ పరిమాణంలో ఉత్పత్తి అయ్యే వ్యవసాయ ఉత్పత్తులకు విస్తృత ప్రాంతాలపై రవాణా సౌకర్యాలు కల్పించే అవకాశం ఏర్పడుతుంది. రాష్ట్రంలో ఈశాన్యప్రాంతంలోని ఏజన్సీ ప్రాంతాలను బొగ్గుగనుల ప్రాంతాలను కోస్తాప్రాంతాలు, శేషప్రాంతాలతో కలుపుతూ రైల్వేలైను వేసే ప్రతిపాదనను కూడ పరిశీలించాలి.

వాణిజ్య ఎగుమతుల ప్రోత్సాహక శాఖను రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేయడం రెండవ సంఘటన. ఆంధ్రప్రదేశ్‌లోని వ్యవసాయ, పారిశ్రామిక ఖనిజ ఉత్పత్తులకు, ఇంజినీరింగ్ వస్తువుల ఎగుమతికిగల అవకాశాలను పరిశీలించి, ప్రోత్సహించడంలో యీ శాఖ తోడ్పడుతుంది. వీటికితోడు చేతిపరిశ్రమలకు చెందిన వస్తువులను కూడ ఎగుమతికి వినియోగిస్తే సగటు జాతీయ ఆదాయం, రాష్ట్ర ఆదాయం పెంపొందడానికి అపార అవకాశాలు ఏర్పడుతాయి. దీని ఫలితాంగా యితోధికంగా ఉపాధి సౌకర్యాలు కల్పించవచ్చు. ఈ విషయంలో యింతవరకు తగిన చర్యలు తీసుకోవడం జరగలేదు. కొత్తగా ఏర్పాటు చేయబడిన యీ శాఖ యీ రంగంలో తగిన కృషిచేస్తూ భారతీయ విదేశవాణిజ్య సంస్థ రాష్ట్రప్రభుత్వం నిమిత్తం తయారుచేసిన సర్వేనివేదికలోని సిఫార్సులను అమలు జరపాలి.

ఇటీవల యూరప్ దేశాలలో పర్యటించిన రాష్ట్ర ప్రణాళికా శాఖా మంత్రి కొత్త ఆలోచనలు, సూచనలు, అభిప్రాయాలతో దేశానికి తిరిగి వచ్చారు. ఈ దేశాలకు వ్యవసాయ ఉత్పత్తులు, అడవుల ఉత్పత్తులు, వివిధ పారిశ్రామిక ఉత్పత్తుల ఎగుమతులకు అపారమైన అవకాశాలు ఉన్నాయని ఆయన కనుగొన్నారు. ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్‌లో నిక్షిప్తమయి ఉన్న అమూల్యమైన ఖనిజసంపదను వెలికితీయడానికి ఉద్దేశించి కేంద్ర ఉక్కు-శాఖ అమలు జరిపిన 'ఖనిజ సంపద అన్వేషణ' కార్యక్రమం హర్షనీయమైన విషయం. దీని ఫలితంగా లభించే ఖనిజాలద్వారా విదేశీ మారకద్రవ్యం సంపాదించవచ్చు.

## వ్యవసాయ-పారిశ్రామిక కార్పొరేషన్

రాష్ట్రంలో వ్యవసాయ-పారిశ్రామిక కార్పొరేషన్ ఏర్పాటు చేయడం మూడవ సంఘటన గ్రామీణ ప్రాంతాలలో పట్టణ పరిసర ప్రాంతాలలో, మధ్యతరహా, చిన్న తరహా పరిశ్రమలను నెలకొల్పడం, యీ విషయంలో యితరులను ప్రోత్సహించడం వంటి కార్యక్రమాలను యీ కార్పొరేషన్ నిర్వహిస్తుంది. ముడి వ్యవసాయోత్పత్తులు, యితర ముడి సరకులను విని

యోగించే చిన్న పరిశ్రమలను నెలకొల్పడంతో పాటు కోళ్ళ కేంద్రాలు, మత్స్యపరిశ్రమ కేంద్రాలు మొదలైనవి ప్రారంభించడాన్ని ప్రోత్సహిస్తుంది. ఈ పథకం వివరాలు పూర్తిగా తెలియలేదు. అయితే యింతవరకు పేర్కొన్న కొన్ని కార్యక్రమాలను అమలు జరపడంతోపాటు రైతులకు సహాయపడుతుందని ఆశించబడుతున్నది. నిర్దేశితలక్ష్యాలను యీ కార్పొరేషన్ సాధించినప్పుడు గ్రామీణ ప్రాంతాలలో యితోధికంగా ఉపాధిసౌకర్యాలు కల్పించబడడమే గాక రాష్ట్రంలో వ్యవసాయరంగంలో ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టే అవకాశం ఏర్పడుతుంది.



దక్షిణ-కేంద్ర రైల్వే మండలం కార్యాలయ భవనానికి శంఖుస్థాపన

## కుటుంబ నియంత్రణ

నాలుగవ విషయం-కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను క్రమబద్ధంగా అమలుజరపడంలో తీవ్రంగా కృషిచేస్తున్నారు. ఆర్థిక సామాజికాభివృద్ధికి, జనాభాపెరుగుదల నిరోధానికి మధ్యగల సన్నిహిత సంబంధాన్ని యిప్పుడు పూర్తిగా గుర్తించడం జరిగింది. తత్ఫలితంగానే జనాభా పెరుగుదల నిరోధానికి తీవ్రతరమైన కృషిని ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్‌లో అద్యతన భావిలో యీ కార్యక్రమం అమలులో తీవ్రకృషి జరుగుతుందని ఆశించబడుతున్నది. దేశజనాభా పెరుగుదల రేటుతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో జనాభా పెరుగుదల రేటు తక్కువగానే ఉందని తెలుస్తున్నది. అంతమాత్రాన యీ విషయంలో ఉదాసీనంగా వ్యవహరించడం ప్రయోజనకరంకాదు. కుటుంబ నియంత్రణ ప్రయోజనాలను ప్రజలకు వివరంగా తెలియజేయడం, కుటుంబ నియంత్రణను పాటించదలచిన వారికి తగిన సౌకర్యాలు కలుగజేయడంలో విస్తృత ప్రాతిపదికపై ఏర్పాట్లు చేయడానికి కృషి చేస్తున్నారు. ఆశించిన ఫలితాలు సిద్ధించినప్పుడు ఆర్థిక అభివృద్ధి, జీవన ప్రమాణాలు పెరుగుదలలపై దీని ప్రభావం ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సంబంధించిన యీ సమీక్షను ముగించడానికిముందు, ఆర్థిక సాంఘిక అభివృద్ధిని సాధించే లక్ష్యంతో రాష్ట్రంలో జరుగుతున్న తీవ్రమైన కృషి యికముందు కూడ యిదే స్థాయిలో కొనసాగుతుందని ఆశించడానికి గల కారణాలనుగూర్చి పేర్కొనడం చాలా అవసరం. ఇతర రాష్ట్రాలలో అనిశ్చిత పరిస్థితులమాదిరిగా గాక ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయ సుస్థిరత నెలకొనిఉండడం ముఖ్యమైన కారణంగా చెప్పవచ్చు. ప్రజాస్వామిక వ్యవస్థలో రాజకీయ సుస్థిరత-ప్రయోజనాత్మకమైన ఆర్థిక, సాంఘిక విధానాలను రూపొందించి, అమలు జరపడాలనుధ్య సన్నిహిత సంబంధం ఉంటుంది.

## సుస్థిర ప్రభుత్వం

ఒక విధంగా పరిశీలించినప్పుడు రాష్ట్రంలో గత 11 సంవత్సరాలలోకన్నా యీనాడు రాజకీయ సుస్థిరత మరింత పటిష్ఠవంతంగా ఉన్నదని చెప్పవచ్చు. నాలుగవ సాధారణ ఎన్నికల తర్వాత అనేక రాష్ట్రాలలో ఏ ఒక్క పార్టీ స్వయంగా అధికారాన్ని చేపట్టే బలాన్ని సంపాదించలేని పరిస్థితులు ఏర్పడినాయి. ప్రభుత్వాన్ని ఏర్పరచ గలిగిన సంఖ్యాబలంతో నెగ్గిన పార్టీ ఉన్నచోట తాను రూపొందించిన కార్యక్రమాలను, విధానాలను సమర్థవంతంగా అమలు జరుపగలుగుతుంది. అటువంటి పరిస్థితి నేడు నెలకొనడం హర్షదాయకమైన విషయం.

అంతర్‌రాష్ట్రీయంగా, కేంద్ర, రాష్ట్రాలమధ్య పరిష్కారం కావాల్సిన సమస్యలు నిస్సందేహంగా చాలా తక్కువగా ఉన్నాయి. అంత మాత్రాన, ఉన్న సమస్యలన్నీ త్వరితంగా పరిష్కరించవచ్చునని భావించడానికి వీలులేదు. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమల అభివృద్ధి నిమిత్తం ఎక్కువ మొత్తాలలో ఆర్థిక సహాయం ప్రత్యేకంగా నాగార్జునసాగర్, పోచంపాడు, శ్రీశైలం ప్రాజెక్టుల నిర్మాణం నిమిత్తం కేంద్రం అదనపు ఆర్థిక సహాయం-గూర్చిన సమస్యలు ఉన్నాయి. దీనికితోడు రాష్ట్రంలో కేంద్ర పరంగా పబ్లిక్‌రంగంలో ఎక్కువ పరిశ్రమలను ప్రత్యేకంగా అయిదవ ఉక్కు పరిశ్రమను నెలకొల్పడం వంటి సమస్యలుకూడ ఉన్నాయి. అంతర్ రాష్ట్రీయ సమస్యలకు సంబంధించి, కృష్ణానదీ జలాల పంపిణీ సమస్య పరిష్కరించవలసి ఉన్నది. ఈ సమస్య విషయంలో పరిస్థితి ఆంధ్రప్రదేశ్‌కు అనుకూలంగానే ఉన్నది. ఈ సందర్భంలో రాష్ట్ర ముఖ్యమంత్రి దృఢమైన ఖరి వహించినందుకు ఆయనకు కృతజ్ఞతలు తెల్పాలి. నదిలోని వివిధ ప్రాంతాలలో లభించే నీటి పరిమాణాలవివరాలను తిరిగి సేకరించేవరకు యిప్పుడు వారికి కేటాయించిన కోటాను ఆయారాష్ట్రాలు వాడుకుంటూ యథాతథస్థితిని కొనసాగించాలని మూడు రాష్ట్రాలవారు స్థూలంగా అంగీకరించారు.

కనుచూపు మేరలో పరిష్కార మార్గాలు కనిపించనంత మాత్రాన సమస్యలు అంతటితో అంతమైనట్టుగా భావించరాదు. ఉదాహరణకు ఉక్కుఫ్యాక్టరీ విషయం పేర్కొనవచ్చు. ఆర్థిక పరిస్థితులు మెరుగుపడి నాలుగవ ప్రణాళికలోని వివిధ పథకాలకు వనరులు లభించే పరిస్థితులు స్పష్టంగా తెలిసినప్పుడు ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణంలో ఆంధ్రప్రదేశ్ కోర్కెను తిరస్కరించడం జరగదు. ఈ ఆశాభావంతో ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక వెలువడని యీ మూడు నెలల కాలంలో రాష్ట్రంలో అనేక ముఖ్య సంఘటనలు జరిగాయి. నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడి, ఎడమ కాలువలలో నీటి విడుదల కార్యక్రమానికి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ ప్రారంభోత్సవం జరపడం చరిత్రాత్మకమైన సంఘటన. అదే విధంగా ఆంధ్రప్రదేశ్ భూమి శిస్తు (పెంపుదల) చట్టం రాష్ట్ర ఆర్థిక వ్యవస్థపై తీవ్ర ప్రభావం కలిగిస్తుంది. అదే కాలంలో రాష్ట్రపతి డా॥ జాకిర్ హుస్సేన్ దక్షిణాది హెడ్‌క్వార్టర్స్‌లో మూడు వారాల పాటు హైద్రాబాద్‌లో గడిపారు. నగరానికి 18 మైళ్ళ దూరంలో డిండిగల్‌లో వైమానిక దళం అకాడమీకి రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు. 'గగన మండల సంరక్షణకు' చెందిన అభివృద్ధికి యిది ఎంతో దోహదం చేస్తుంది.



వైమానికదళ అకాడమీకి శంకుస్థాపనచేస్తున్న రాష్ట్రపతి

ఈ మూడు నెలలలో జరిగిన సంఘటనల ప్రాధాన్యకమాన్ని, వాటి ప్రభావాన్ని గూర్చి వివరించడం కష్టమే. నాల్గవ సాధారణ ఎన్నికలు జరిగిన తర్వాత ఏర్పడిన కొత్త ప్రభుత్వం మారదృష్టితో, పట్టుదలతో పనిచేస్తున్నది. పైర్ల పరిస్థితి ఆశావహంగా ఉండడం వల్ల ఆర్థిక పరిస్థితులు మెరుగైనాయి. రాష్ట్ర శాసన సభలోని అధికార పక్షంలో సభ్యుల సంఖ్య పెరిగిన ఫలితముగా రాష్ట్రంలో రాజకీయ సుస్థిరత ఏర్పడింది.

## అభివృద్ధి పథంలో మైలురాయి

నాగార్జునసాగర్ కుడి, ఎడమ కాలువలలోకి నీరు వదలడం రాష్ట్ర వ్యవసాయాభివృద్ధి రంగంలో అపూర్వమైన ఘట్టం. అదే విధంగా భూమి శిస్తు చట్టం కూడా. ప్రారంభ దశ నుండి నాగార్జున సాగర్ చరిత్ర సృష్టించింది. దాని నిర్మాణం అతి క్లిష్టమైంది. అడుగడుగునా ఎన్నో ఇబ్బందులను, ఆటంకాలను ఎదుర్కొంటున్నారు. అయితే ప్రభుత్వం, ప్రజల నిర్విరామ కృషి, దృఢ సంకల్పం ఫలితంగా అన్ని అడ్డంకులను అధిగమించడం జరిగింది. క్రెస్టుగేట్లను నెలకొల్పడం విషయంలో మహారాష్ట్ర, మైసూరు



లాల్‌బహదూర్ కాలువ — నాగార్జునసాగర్

రాష్ట్రాలు యిటీవల అభ్యంతరం వ్యక్తం చేశాయి. తాను స్వయముగా ప్రాజెక్టును చూచి, ప్రయోజనాలను మదింపు వేసుకున్న శ్రీమతి గాంధీ క్రెస్టుగేట్లు నెలకొల్పే విషయంలో సుముఖత వెల్లడించినట్లు తెలుస్తున్నది. వేదమంత్ర పఠన ధ్వనులతో శ్రీమతి గాంధీ, నీటి విడుదలకు ప్రారంభోత్సవం చేశారు. ఆ తర్వాత తన తండ్రి విగ్రహాన్ని ఆవిష్కరించారు. 1955లో శ్రీ నెహ్రూ యీ ప్రాజెక్టు నిర్మాణానికి శంకుస్థాపన చేస్తూ, దీనిని "మానవతా దేవాలయం"గా వర్ణించారు. నదులు విచ్ఛిత్తికి గాక ఐక్యతకు చిహ్నంగా ఉండాలని ప్రధాన మంత్రి ఉద్బోధించారు.

## పారిశ్రామిక పథంలో ప్రవేశం

2000 సంవత్సరాల నాటి బౌద్ధుల గురుపీఠమైన విజయపురి ఔన్నత్యాన్ని ఇక్ష్వాకుల రాజుల వైభవాన్ని నాగార్జునసాగర్ మనకు గుర్తుకు తెస్తుంది. ఈ ప్రాజెక్టు పూర్తిగా నిర్మించబడినప్పుడు యీ ప్రాంతమంతా సస్యశ్యామలమై సంపత్సమృద్ధికి నిలయమవుతుంది. ప్రాంత వాసులకు నూతన శకం ఆరంభమవుతుంది. 36.6 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం కలిగి రు. 100 కోట్ల విలువగల 12 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 50,000 టన్నుల చక్కెర ఉత్పత్తి అవుతాయి. ఆగస్టు ఆరంభంలో శ్రీమతి గాంధీ హైదరాబాదులో హిందుస్థాన్ యంత్ర పరికరాల యూనిటుకు ప్రారంభోత్సవం చేయడం ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పారిశ్రామిక పథంలో ప్రవేశించింది.

పౌర నిర్మాణ కార్యక్రమాల అమలు సందర్భంలో హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ సంప్రదాయాలు ప్రశంసనీయమైనవి. అదే విధంగా మేయరు పదవి, పౌరుని సేవానిరతికి గుర్తింపు మాత్రమేనని పౌరులు గుర్తించే విధంగా చేయడం కూడా అవసరం. కార్పొరేషన్ మేయరు, డిప్యూటీ మేయర్లను ఎన్నుకున్నది. రాష్ట్రపతి పదవి స్వీకరించిన తర్వాత మొదటి సారిగా హైదరాబాదు వచ్చిన డా॥ జాకిర్ హుస్సేన్‌కు పౌర సన్మానం చేశారు. నగరంలోని డా॥ హుస్సేన్ జన్మించిన గృహాన్ని జాతీయ మ్యూజియంగా అభివృద్ధి చేయాలని ప్రతిపాదించారు

ఆగస్టు నెల, జాతీయ జీవనంలో ఎన్నో ప్రముఖ సంఘటనలను మనకు గుర్తుకు తెస్తుంది— 'క్విట్ ఇండియా ఉద్యమం' స్వాతంత్ర్య దినోత్సవమైన ఆగస్టు 15— ఈ సంవత్సరం ఇదే నెలలో ప్రముఖ వాగ్గేయకారులు త్యాగరాజ ద్విశతాబ్ది ఉత్సవాలు జరగడం మరో విశేషం. ఈ ఉత్సవాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేస్తూ, త్యాగరాజస్వామి అన్ని కాలాలకు చెందినవాడనీ, చిరంజీవియని కొనియాడారు "ఆయన కృతులు తెలుగులో ఉండడం వల్ల త్యాగరాజుపై ఆంధ్రులకు ప్రత్యేక అభిమానం ఉంటుంది. అయితే ఆయన యావద్భారత దేశానికి చెందినవాడు" అని ప్రధాన మంత్రి తన సందేశంలో ప్రస్తుతించారు. భక్తిరసం, సాహిత్యం, సంగీతంతో మిళితమైన ఆయన కృతులకు ఎందరో జోహార్లు అర్పించారు. సంగీత ప్రపంచంలో ఆయన రవిగా ప్రకాశించాడని విమర్శకులు స్తుతించారు.

హైదరాబాదు చరిత్రలో సెప్టెంబరు నెల భయావహమైందనీ, వరదల బీభత్సానికి ఆ నెల వరవడి పెడుతుందనే నానుడి ప్రచారంలో ఉంది. 1908 లో జరిగిన మూసీనది వరదలనుండి యిది ప్రారంభమైంది. అయితే యీ సంవత్సరం తద్భిన్నంగా జరిగింది.

రాష్ట్రపతి, నాగార్జునసాగర్ ప్రాజెక్టును సందర్శించి ముగ్ధులైనారు. యీ ప్రాజెక్టును దర్శించిన ప్రథమ రాష్ట్రపతి ఆయనే. శతాబ్దాల తరబడి విజ్ఞాన చంద్రికలను వెదజల్లిన నాగార్జునసాగర్ యిప్పుడు, మానవతా దేవాలయంగా రూపొంది, ఆధునిక భారతదేశంలో నవీన యాత్రాస్థలంగా మారింది. ఈ ప్రాజెక్టు నిర్మాణం దూరదృష్టితో రూపొందించబడి దేశవాసులు గర్వపడే విధంగా ఎంతో నైపుణ్యంతో నిర్మించబడిందని ఆయన ఉభిభాషించారు.

## హైదరాబాదులో అఖిలభారత పత్రికా సంపాదకుల సమావేశం

రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేసిన అఖిలభారత పత్రికా సంపాదకుల సమావేశం సెప్టెంబరులో జరిగిన మరో ముఖ్య సంఘటనగా పేర్కొనవచ్చు. మన దేశంలో ప్రజాస్వామ్యం వర్ధిల్లడానికి అవసరమైన ప్రజాభిప్రాయాన్ని సక్రమపద్ధతిలో పెంపొందించడంలో పలుకుబడి గలిగిన స్వతంత్ర ప్రతిపత్తిగల భారతీయ భాషా పత్రికలు ప్రముఖ పాత్ర వహించ గలుగుతాయని రాష్ట్రపతి అన్నారు. ఆర్థిక, శాస్త్ర విజ్ఞాన విషయాలకు పత్రికలు ఎక్కువ ప్రాధాన్యం యివ్వాలని ఆయన సూచించారు. అదే నెలలో ఇండియా ప్రెస్ కౌన్సిల్ సమావేశం నాగార్జున సాగర్‌లో జరిగింది.

రాష్ట్రపతి వెళ్ళిన కొద్దిరోజులకే ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి హైదరాబాదు వచ్చారు. ఉపరాష్ట్రపతి పదవి స్వీకరించిన తర్వాత ఆయన హైదరాబాదు రావడం యిదే ప్రథమ పర్యాయం. అఖిలభారత వెనుకబడిన తరగతుల సమావేశానికి ప్రారంభోత్సవం చేయడంతో పాటు ఆయన అనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. కులం ప్రాతిపదికపై ఆర్థిక, రాజకీయ అధికారాలు కేంద్రీకృతం కావడం, కులం ప్రాతిపదికపై రాజకీయ పార్టీలు ఏర్పడే ధోరణి ప్రబలడం మన ప్రజాస్వామ్యానికి ప్రమాదకరమని ఆయన హెచ్చరించారు. వెనుకబడినతనాన్ని కేవలం కులం ప్రాతిపదికపై నిర్ణయించరాదనీ కులానికి ప్రాధాన్యం యిచ్చినప్పుడు దానిలో యిమిడిఉన్న ప్రమాదకరమైన వేర్పాటు ధోరణులు తల ఎత్తుతాయనీ అన్నారు. కేంద్ర రక్షణ ఉత్పత్తుల శాఖా మంత్రి, శ్రీ బి. ఆర్. భగత్‌కూడ యీ సమావేశంలో ప్రసంగించారు.

## ఇద్దరు ప్రముఖ నాయకుల మరణం

సెప్టెంబరునెల విస్తృత ప్రాతిపదికపై వరదల ఉపద్రవాన్ని కలిగించకపోయినా డా॥ బి. రామకృష్ణారావు, శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగార్ల మృతితో అంతకుమించిన నష్టం వాటిల్లజేసింది. డా॥ బూర్గుల హైదరాబాదు రాష్ట్రంలో బహుజనాదరణ పొందిన ప్రథమ ముఖ్యమంత్రి. కేరళ, యు. పి. లలో గవర్నరు పదవి నధిష్ఠించినవారు. బహు భాషావేత్త, పండితుడుఅయిన డా॥ రావు, ఉన్నత సంస్కృతిగలిగి బహుళ ప్రజాదరణ పొందినవారు. అనేక రంగాలలో ఆయన సాధించిన విజయాలను గూర్చి ప్రశంసిస్తూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాతగా వర్ణిస్తూ, రాష్ట్ర శాసనసభ ఆయనకు జోహార్లు అర్పించడం ఆయన రాజనీతిజ్ఞతకు, దూరదృష్టికీ నిదర్శనం.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ప్రజాభిమానం చూరగొన్న ప్రముఖ రాజకీయవేత్త. పన్నెండేండ్లకు పైగా నెల్లూరు పురపాలక సంఘం అధ్యక్ష పదవి నిర్వహించి అపూర్వ చరిత్ర సృష్టించినవారు. 1960 లో ప్రథమంగా మంత్రి అయ్యారు. ఆ తర్వాత కొద్దికాలానికే రాజకీయ కారణాలపై ఆ పదవికి రాజీనామా యిచ్చారు. 1961 లో సంజీవరెడ్డి మంత్రివర్గంలో తిరిగి ప్రవేశించి, సాధారణ ఎన్నికలు జరిగేవరకు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో ఉన్నారు. కొత్త మంత్రివర్గం ఏర్పడిన కొద్దికాలానికే తిరిగి మంత్రివర్గంలో చేరారు సీటీ పౌరుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు, హోం శాఖలను నిర్వహించారు మిత్రులు, శత్రువులు కూడ ఆయనను ఒకే విధంగా గౌరవించారు. ఆయన సహృదయుడు. స్నేహశీలి ఆయనచుట్టు ఎప్పుడూ పదిమంది

పోగ్గె ఉండేవారు ఎంతటి విషాదకర పరిస్థితులలోను ఆయన వదనంపై చిరునవ్వులు మాసిపోయేవికావు. జీవితాంతం పోరాటం సల్పిన ఆయన, తనకు సోకిన భయంకరమైన వ్యాధితో కూడ చివరివరకు వీరోచితంగా పోరాడి అసువులు కోల్పోయారు. ఆయన మరణంతో ఆంధ్ర రాజకీయరంగం ఒక అసాధారణ మేధాశక్తిని కోల్పోయింది. ఈ విధంగా రాష్ట్రం యిద్దరు ప్రముఖ నాయకులను కోల్పోయింది. వారులేని వెలితిని పూరించడం కష్టం.

శాసనసభ సమావేశాలలో రెండు ప్రధాన సంఘటనలు జరిగాయి. భూమిశిస్తు బిల్లు ఆమోదించబడింది. తీవ్ర చర్చల తర్వాత పెద్ద మెజారిటీతో అవిశ్వాస తీర్మానం వీగిపోయింది.

## ధాన్య సేకరణ కొత్త విధానం

శాసనమండలిలో రెవిన్యూ, పౌరసరఫరాలశాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రకటించిన ధాన్యసేకరణ కొత్త విధానం ఆహారరంగంలో అతి ప్రధానమైనది. భారత ఆహార కర్పొరేషన్ పూర్వక్రయ హక్కులతో బహిరంగ మార్కెటులో వరిధాన్యం కొనుగోలు చేయడం, మిల్లు యజమానులపై శాతం ప్రాతిపదికపై లెవీవిధించడం, ఒకహెక్టారు పరిమితికి పైబడి సిల్వలుగల పెద్ద భూస్వాములపై క్రమానుగత ఉత్పత్తిలెవీ విధించడం యీ విధానంలోని మూడు ముఖ్యాంశాలు. మొదటి పంట ద్వారా 7 లక్షల టన్నులు, రెండవ పంటద్వారా 3 లక్షల టన్నులు—మొత్తం 10 లక్షల టన్నుల బియ్యం సేకరించాలని నిర్దేశించారు. 5 లక్షల టన్నులు ఎగుమతిచేస్తారు. మిగతావాటిని హైదరాబాదు, విశాఖపట్టణంలోని చట్టబద్ధమైన రేషనింగ్ ప్రాంతాలు, తరుగు ప్రాంతాల అవసరాలనిమిత్తం వినియోగిస్తారు. రాష్ట్రంలోని 20 జిల్లాలను 8 మండలాలుగా పునర్విభజించారు. ప్రతి మండలం పరిధిలో స్వేచ్ఛారవాణాసౌకర్యం కల్పించబడింది. ధరలు పెరగకుండా, రాష్ట్రం మొత్తంలో ఒక కనీస ధర అమలులో ఉంటుంది. నవంబరు 1వ తేదీనుండి అమలులోకి వచ్చేవిధంగా ప్రకటించబడిన సేకరణధర గత సంవత్సరం ధరకన్నా ఎక్కువగా ఉంది. ధరలు, సూపర్ ఫైన్: క్వింటాల్, రు. 70_00, మేలిరకం, రు. 55/_, ముతకరకం, 46.00. గోనెసంచిధర, పన్నులు అదనం.

## రైతులకు కానుక

హైదరాబాదు కౌలుదారీ చట్టంలోని 38వ సెక్షన్ తెలంగాణా జిల్లాలన్నింటికీ వర్తింపజేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించడం రైతులకు 11 వ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ కానుకగా భావించవచ్చు. దీని ఫలితంగా 3 లక్షల మంది రక్షిత కౌలుదారులు భూస్వాములవుతారు. వారి ఆధీనంలో 21.45 లక్షల ఎకరాలభూమి ఉంది. ఖమ్మంజిల్లాలోను, వరంగల్లు జిల్లా ములుగు తాలుకాలోను యీ చట్టం యిదివరకే అమలులో ఉంది. కౌలుదారు, రక్షితకౌలుక్రింద తన ఆధీనంలోని భూమికి అదనంగా చుట్టుప్రక్కల ఉన్నభూమిని కుటుంబ భూకమతానికి మించకుండా కొనుగోలు చేయవచ్చు. మాగాణి విషయంలో కనీసం 6 ఎకరాలు, గరిష్ఠం 9 ఎకరాలు, మెట్టవిషయంలో కనీసం 36 ఎకరాలు, గరిష్ఠం 54 ఎకరాలు కుటుంబ భూకమతంగా నిర్ణయించారు. మెట్టభూమి ధర, భూమిశిస్తుకు 60 రెట్లు, మాగాణికి భూమిశిస్తుకు 24 రెట్లు నిర్ణయించారు.

రెండు సంవత్సరాలలో మెదక్ జిల్లా దిండిగల్ లో నిరుపయోగంగా ఉన్న 5,000 ఎకరాల భూమిని సద్వినియోగంచేస్తారు. అక్కడ రు. 14 కోట్ల ఖర్చుతో నిర్మిస్తున్న వైమానికదళం ఎకాడమీకి రాష్ట్రపతి శంకుస్థాపనచేశారు. ఈ సందర్భంగా జరిగిన వైమానిక ప్రదర్శనలను వేలాది పల్లె ప్రజలు తిలకించారు. ఈ అకాడమీ నిమిత్తం రాష్ట్రప్రభుత్వం 1700 ఎకరాలభూమిని ఉచితంగా యిచ్చింది. "మన గగన సీమలను రక్షించేవారి నర్సరీ" గా ఏర్ మార్షల్ అర్జున్ సింగ్ యీ అకాడమీని వర్ణించారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 11 వ అవతరణ దినోత్సవం ఘనంగా జరుపుకోవడం రాష్ట్ర అభివృద్ధి పథంలో మరో మైలురాయి.

'పరిశీలకుడు'

---

### దుబారా చెయ్యకండి

సరుకు నిలువచేయడంలో చెడు పద్ధతులవలంబించి రైతులు, వర్తకులు, గృహిణులు దుబారా చెయ్యడం తగదు. మనుషుల శరీర పోషణకు అవసరమయ్యే అమూల్యమైన ఆహార పదార్థాలను వృధా చేయడంగానీ, ఎలుకలు పందికొక్కుల పాలుచేయడం గానీ న్యాయంకాదు. జాతి క్షేమం దృష్ట్యా ప్రజలందరూ అనుసరించవలసిన కనీస ధర్మం యిది.

## పరిపాలనా విషయాలు

### ముఖ్యమంత్రికి హోంశాఖ

ముఖ్యమంత్రికి, హోం, పోలీసు, ఆయుధాల చట్టం, సినిమాటోగ్రఫీ, ప్యాసుపోర్టు, వాణిజ్య పన్నుల శాఖలను గవర్నరు కేటాయించారు. ఈ శాఖలను లోగడ కీ. శే॥ ఎ. సి. సుబ్బారెడ్డి నిర్వహించారు. ముఖ్యమంత్రి యిదివరకే సాధారణ పరిపాలన, సర్వీసులు, ఎన్నికలు, శాంతిభద్రతలు, భారీపరిశ్రమలు విద్యుచ్ఛక్తి, నీటిపారుదల (మధ్యతరహా, చిన్నతరహా నీటి వనరులు మినహా) రవాణా, ఆర్థిక, గిరిజన సంక్షేమశాఖలను నిర్వహిస్తున్నారు.

అక్టోబరు 6వ తేదీనుండి ఉన్నత విద్యాశాఖ, విద్యాశాఖలను విలీనం చేశారు.

దీనికి సంబంధించిన జి. ఒ. పూర్తి పాఠం దిగువ యివ్వడం జరిగింది.—

"సాధారణ పరిపాలన (స్పెషల్–ఎ) శాఖ 1–10–65 తేదీన జారీచేసిన జి. ఒ. ద్వారా విద్యాశాఖను విభజించి ప్రత్యేక ఉన్నత విద్యాశాఖ డైరెక్టొరేటును ఏర్పాటు చేయడం జరిగింది. ఆతర్వాత విభాగించిన డైరెక్టొరేట్ల కార్య నిర్వహణను ప్రభుత్వం పరిశీలించి దిగువ నిర్ణయాలకు వచ్చింది.

(అ) విద్యావిషయాలు నిరంతర కార్యక్రమం. ఒక దశలో ఏర్పాటు చేయడం విద్యావిషయిక పరిపాలనా పటిష్ఠతకు అనుకూలం కాదని అనుభవం ద్వారా తెలుస్తున్నది.

(ఆ) ప్రభుత్వం నిర్ణయించిన విధంగా ఒక సంవత్సరం హయ్యర్ సెకండరీ కోర్సును రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ కాలేజి కోర్సుకు మార్చడానికి సెకండరీ స్థాయినుండి హయ్యర్ సెకండరీ కాలేజి స్థాయివరకు ఒకే పరిపాలనా యంత్రాంగం ఉండడం అవసరం.

(ఇ) ఇటీవల ప్రభుత్వం నిర్ణయించిన రీతిగా 1969 జూన్ నుండి విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగును బోధనా భాషగా చేయడానికి సెకండరీ, హయ్యర్ సెకండరీ, విశ్వవిద్యాలయాల దశలలో ఒకే పరిభాషను ఉపయోగించడం చాలా అవసరం. విద్యాశాఖ డైరెక్టొరేటు, ఉన్నత విద్యాశాఖ డైరెక్టొరేటు, విశ్వవిద్యాలయం – యీ మూడు స్వతంత్ర సంస్థలమధ్య సమర్థనీయమైన సమన్వయం సాధించడానికి అన్ని దశలలో విద్యా విషయాలకు ఒకేశాఖ ఉండడం అవసరమని అనుభవం ద్వారా తెలుస్తున్నది.

అంతేగాక సాధ్యమైనంతవరకు రెండు మూడు శాఖలను కలిపి ఒక శాఖగా పునర్నిర్మించాలని పరిపాలనా సంస్కరణల సంఘం తమ నివేదికలో సూచించింది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితులు క్లిష్టంగా ఉన్న దృష్ట్యా ప్రభుత్వ ఖర్చులలో పొదుపును పాటించడం చాలా అవసరం.

పైన పేర్కొన్న కారణాల దృష్ట్యానూ, రెండు ప్రత్యేక డైరెక్టొరేట్ల నిర్వహణ వాటి కార్యక్రమాలలో తగిన సమన్వయం లేకపోవడం దృష్ట్యానూ, విద్యాశాఖ డైరెక్టొరేటును, ఉన్నత విద్యాశాఖ డైరెక్టొరేటును వెంటనే విలీనం చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. తదనుగుణంగా ఉన్నత విద్యాశాఖ డైరెక్టరు పదవిని రద్దుచేస్తూ, విద్యాశాఖ డైరెక్టొరేటు, ఉన్నత విద్యాశాఖ డైరెక్టొరేట్లను వెంటనే విలీనం చేయాలని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.''

### ధాన్య సేకరణకు జిల్లాల పునఃసమీకరణ :

వచ్చే 12 నెలలలో 10 లక్షల టన్నుల బియ్యం సేకరించడానికి వీలుగా జిల్లాలను ఆరు మండలాలుగా పునః సమీకరించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రతి మండలం పరిధిలో స్వేచ్ఛగా ధాన్యం రవాణా చేయవచ్చు. రాష్ట్రమంతటా ఉత్పత్తిదారుకు కనీస సహాయకధర లభిస్తుంది. ఈ కొత్త విధానంలో దిగువ తెల్పిన మూడు అంశాలు మార్గదర్శకంగా ఉంటాయి (1) భారత ఆహార కార్పొరేషన్ పూర్వక్రయ హక్కులతో స్వేచ్ఛగా వరిధాన్యం కొనుగోలు చేయడం (2) రైసు మిల్లులపై నిర్ణయించబడిన శాతం మేరకు లెవీ వసూలు, మినహాయింపు పరిమితికి పైబడి మిగులుగల పెద్దరైతులందరిపై క్రమపద్ధతిలో ఉత్పత్తి లెవీ.

1వ మండలం : విశాఖపట్నం జిల్లా (2) శ్రీకాకుళం జిల్లా.

2వ మండలం : తూర్పు గోదావరి జిల్లా (2) పశ్చిమ గోదావరి జిల్లా. (3) కృష్ణాజిల్లా.

3వ మండలం : గుంటూరు జిల్లా. (2) నెల్లూరు జిల్లా

4వ మండలం : చిత్తూరు జిల్లా (2) కడప జిల్లా (3) అనంతపురం జిల్లా (4) కర్నూలు జిల్లా.

5వ మండలం : మహబూబునగర్ జిల్లా (2) హైదరాబాదు జిల్లా (3) నల్లగొండ జిల్లా, (4) ఖమ్మం జిల్లా (5) వరంగల్లు జిల్లా (6) కరీంనగర్ జిల్లా (7) మెదక్ జిల్లా (8) ఆదిలాబాదుజిల్లా.

6వ మండలం : నిజామాబాదు జిల్లా.

ప్రభుత్వం, చర్మకార పరిశ్రమ సలహా మండలిని పునర్నిర్మించింది. మండలి అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా శాసనసభ్యులు శ్రీయుతులు వి. రామారావు, కె. సోమేశ్వరరావుగారలు నాయకులు అయ్యారు.

## ఇండియన్ ఇంజనీరింగ్ సర్వీసు

ఇండియన్ ఇంజనీరింగ్ సర్వీసు అనే పేరుతో ఇంజనీర్లకు అఖిలభారత సర్వీసు ఏర్పాటు చేయాలనే కేంద్ర ప్రభుత్వ ప్రతిపాదనను, ఆగస్టు 26వ తేదీన జరిగిన రాష్ట్ర మంత్రి వర్గ సమావేశం ఆమోదించింది.

## ఎరువుల ఫ్యాక్టరీకి ప్రభుత్వ హామీ

కోరమాండల్ ఎరువుల సంస్థకు ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ రు 12.56 లక్షల విలువగల డిబెంచర్ల జారీకి హామీ ఉండడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

తమ రెండవ యూనిటును నెలకొల్పడానికి వీలుగా మౌలాలీ సమీపంలో చీపులపల్లిలో 400 ఎకరాల భూమిని హిందుస్థాన్ కేబిల్స్ సంస్థకు బహుమతిగా మంజూరు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది.

## ఆరోగ్య, వైద్యశాఖల విలీనీకరణ

ఈ సంవత్సరం జులై 1వ తేదీనుండి అమలులోకి వచ్చిన ఆరోగ్య, వైద్యశాఖల డైరెక్టొరేట్ల విలీనీకరణను మంత్రి వర్గం ధృవీకరించింది.

## ఆంధ్రప్రదేశ్ భూమిశిస్తు (హెచ్చింపు)చట్టం, 1967

ఈ చట్టం భూముల విషయంలో 1-7-1962 వ తేదీకి పూర్వం చెల్లించవలసిన ప్రామాణికమైన శిస్తులను (ఇవి ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు సంబంధించిన ప్రమాణీకరణ చట్టాల క్రింద ప్రమాణీకరించ బడిన విధంగా క్రిందటి రీసెటిల్మెంట్ల సమయంలో స్థిరీకరించబడినవి) రాష్ట్రం మొత్తంమీద మెట్ట భూముల విషయంలో అయితే 75 శాతం మేరకూ, ఆంధ్ర ప్రాంతంలోని పల్లం భూముల విషయంలో అయితే 100 శాతం మేరకూ తెలంగాణా ప్రాంతంలో, పల్లంభూముల విషయంలో అయితే 30 శాతం మేరకూ 1-7-62 తేదీ నుంచి హెచ్చించ డానికి ఉద్దేశించబడింది.

ఆంధ్రప్రదేశ్ భూమిశిస్తు సంస్కరణల కమిటీ ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో మెట్టశిస్తు పరిమాణం దాదాపు ఒకటిగానే వున్నట్లూ, పల్లం శిస్తు తెలంగాణాలో ఆంధ్రలో కంటే ఎక్కువగా వున్నట్లూ అభిప్రాయపడింది. ఈ కారణాలవల్ల, మెట్టశిస్తు హెచ్చింపు శాతం ఈ రెండు ప్రాంతాలలోనూ ఒకేవిధంగా వుంటుంది. తెలంగాణా ప్రాంతంలో మాత్రం పల్లం శిస్తు హెచ్చింపు 30 శాతం వరకు పరిమితం చేయబడింది.

బావులు, ఊట కాలువలు, పర్రె కాలవలు, నదీ కాలువలు, వాగు కాలువలు, కొసమాలు, సోనాలు, బొందలు, దొరువులు, బురికీలు, కోల్లూలు, అడుకట్టలు వంటి శ్రమతోను, ఖర్చుతోను కూడిన సేద్యపునీటి వనరులక్రింద సాగయ్యే పల్లపు భూములకు 1-7-1962 ముందు చెల్లించే స్టాండర్డ్ ఎసెస్ మెంట్ తీరున 1-7-1967 వరకు పన్ను విధించడం జరుగుతుంది. మరొక విధంగా చెప్పాలంటే 1-7-1967 వరకు వాటిమీద అదనపు భూమి శిస్తు చెల్లించవలసిన పనిలేదు. 1-7-1967 నుండి ఈ పల్లపు భూములు మెట్ట భూములుగా పరిగణింపబడి రూ 10 గాని, అంతకు తక్కువగాని శిస్తు, అదనపు భూమిశిస్తు చెల్లించే పట్టాదార్లకు పూర్తి శిస్తు మినహాయింపు సౌకర్యం కల్పించ బడుతుంది. రాష్ట్రంలోని తెలంగాణా, రాయలసీమ జిల్లాలలో ఆ రకం భూములు మొత్తం 1,40,000 ఎకరాలు వున్నాయి. వీటికి ఈ చట్టం క్రింద ఈ పన్ను మినహాయింపు ప్రయోజనం సిద్ధిస్తుంది.

వర్షాలమీద ఆధారపడి తదనుగుణంగా అస్థిరమైన ఆదాయాలు గల చిన్న చిన్న మెట్టభూముల పట్టాదార్లకు ఈ చట్టం క్రింద ప్రధానంగా అధిక రాయితీ సౌకర్యం లభిస్తుంది. ఈ చట్టంలోని ఆరవ సెక్షన్ క్రింద, మొత్తం రాష్ట్రంలోని సుమారు 67 లక్షల పట్టాదార్లలోనూ 10 రూపాయలూ, అంతకు తక్కువ శిస్తు చెల్లిస్తున్న సుమారు 36 లక్షల పట్టాదార్లను వారి మెట్ట భూములమీద ఏ విధమైన పన్ను విధించకుండా మినహాయించడము జరిగింది.

చట్టం క్రింద చెల్లించబడవలసిన అదనపు భూమిశిస్తును నిర్ణయించేందుకు ఒక యంత్రాంగం ఏర్పాటు చేయబడింది. పట్టాదార్లకు తెలియజేసిన పిమ్మట తాసిల్దారు శిస్తు విధిస్తారు. ఆ శిస్తు ఉత్తర్వులను రెవెన్యూ డివిజనల్ ఆఫీసరుకు నివేదించుకోవచ్చు. జిల్లాకలెక్టరుకుగాని రెవెన్యూబోర్డుకుగాని పునః పరిశీలనకు పంపుకోవచ్చు. పట్టాదార్లకు తమ కమతాలపై హక్కులను క్రమపరచుకోవడానికి దీనివల్ల ఒక అవకాశం ఏర్పడుతుంది.

పంట పూర్తిగాగాని, కొంత మేరకుగాని పాడైపోయిన సందర్భాలలో ఈ చట్టం క్రింద భూమిశిస్తు అదనపు భూమిశిస్తుల నుండి మినహాయింపు మంజూరు చేయడానికి అవకాశం వుంది.

ఈ చట్టాన్ని అమలుపరచడంలో అనుచితమైన శ్రమను తొలగించడానికి సంబంధించి ఈ చట్టంలోని 16 సెక్షన్ కొత్తగా అవకాశం కల్పిస్తున్నది. భూముల వర్గీకరణలో పొరపాటు వల్లగాని, లేదా సేద్యపునీటి వనరుల వర్గీకరణలో పొరపాటు వల్లగాని, లేదా సేద్యపునీటి వనరులు తగినంతగా లేమువల్లగాని; లేదా మరి ఏయితరములైన సరైన కారణములవల్లగాని ఏతరహా పట్టాదారునికైనా, ఏతరహా భూమి విషయంలోనైనా అనుచితమైన శ్రమ కలగకుండా శిస్తు చెల్లింపునుంచి మినహాయింపును మంజూరుచేసే అధికారం, శిస్తు తగ్గించే అధికారం, లేదా భూమి శిస్తు, అదనపుభూమి శిస్తుల విషయంలో శిస్తురేటు హెచ్చించకుండా ఉత్తర్వులను సవరణ చేసే అధికారాలు ప్రభుత్వానికి ఉంటాయి.

ఈవిషయమై బహుళ సంఖ్యలోవున్న శాసనాలను పరిమితం చేయడానికి వీలుగా 1957 సం॥ పు వాణిజ్యపంటల పన్నుచట్టం, 1956 సం॥పు మాగాణిభూములశిస్తు మదింపుచట్టం, 1957వ సంవత్సరపు సర్ చార్జ్ చట్టాలను తొలగించడం జరిగింది. సమర్థవంతమైన భూమిశిస్తు విధింపు పద్ధతివిషయంలో విశాల దృక్పథంతో ప్రభుత్వం వ్యవహరిస్తుందని శాసనసభలో ప్రకటించడం జరిగింది.

తదనుగుణంగా తొలిచర్యగా ప్రభుత్వం రూ. 10 గాని, అంతకు తక్కువగాని శిస్తుచెల్లించే చిన్నపట్టాదార్లను శిస్తువిధింపు నుండి మినహాయించారు.

ఈ బిల్లుకు ఉభయ శాసన సభల అనుమతి లభించింది.

# న్యాయపాలన

## ఆంధ్రప్రదేశ్ హైకోర్టు
## నూతన న్యాయమూర్తులు

1. న్యాయమూర్తి శ్రీ ఎ. సాంబశివరావు
2. న్యాయమూర్తి శ్రీ పి. కె. వైద్య
3. న్యాయమూర్తి శ్రీ సి. కొండయ్య
4. న్యాయమూర్తి శ్రీ ఎ. కుప్పుస్వామి
5. న్యాయమూర్తి శ్రీ ఒ. చిన్నప్పరెడ్డి
6. న్యాయమూర్తి శ్రీ వై. వెంకటేశ్వరరావు
7. న్యాయమూర్తి శ్రీ ఎ. డి. వి. రెడ్డి

### ఆంధ్రప్రదేశ్

తన మీద యివ్వబడిన డిక్రీని నిలుపుచేసుకునే లక్ష్యంతో రిట్‌పిటిషను పెట్టుకోవడం, రాజ్యాంగంలోని 226 వ సూత్రం క్రింద అధికార పరిధిని పూర్తిగా దుర్వినియోగం చేయడమే అవుతుంది.

(రి. పి. నెం. 174_67)

### కేరళ

వ్యవసాయం అంటే భూమినుంచి పోషక పదార్థాన్ని స్వీకరించే, ఉపయుక్తమైన, విలువైన సరుకులను పండించడం అని అర్థం. దీనికి నేలను సాగుచేసే కళ లేక శాస్త్రం అని వెబ్‌స్టర్ నిర్వచన. మానవ కృషినైపుణ్యాలను, శ్రమను వినియోగించడం దీని ముఖ్యలక్షణం. వ్యవసాయ దారుడంటే తాను స్వయంగా కానీ లేక తన సేవకుల వల్ల కానీ తన జీవనోపాధిని వ్యవసాయం ద్వారా పూర్తిగానైనా లేక ప్రధానంగానైనా ఆర్జించేవాడన్నమాట ఇటువంటి పనిచేయడం వృత్తి పని చేయడం కాదనడం సహేతుకం కాదు.

*　　*　　(ఓ. పి. నెం. 397_65)

# విద్యుచ్ఛక్తి



ఉపప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్ జులై 15వ తేదీన కొత్తగూడెం థర్మల్ స్టేషన్ రెండవదశ పథకానికి ప్రారంభోత్సవం చేశారు విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో స్వయం సమృద్ధి సాధించడానికై మనం చేస్తున్న కృషిలో యిదొక ప్రధానమైన ఘట్టం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం త్వరితగతిలో సర్వతో ముఖాభివృద్ధి సాధించాలంటే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అభివృద్ధి కావడం అత్యావసరం.

ఈ రెండవ దశ పథకంలో ఒక్కొక్కటి 60 మె. వా. ఉత్పత్తి శక్తిగల రెండు యంత్ర విభాగాలు వుంటాయి. దీనికై ఖర్చు అంచనా రు 13.33 కోట్లు.

గడచిన సంవత్సరం చివరలో యీ పథకం మొదటిదశకు సంబంధించిన ఉత్పత్తి ప్రారంభమైంది. ఆ దశలోకూడా ఒక్కొక్కటి 60 మె. వా. శక్తిగల రెండు యంత్ర విభాగాలు ఏర్పాటు చేయబడినవి. ఆ రెండు యంత్ర విభాగాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ప్రారంభమైన ఫలితంగా రాష్ట్రంలోని మెట్టప్రాంతాలలో అనేక గొట్టపు బావులకూ, బోరింగులకూ విద్యుచ్ఛక్తి లభించింది. మొదటి దశ పథకంమీద ఖర్చు అంచనా రు. 12.39 కోట్లు. అంతర్జాతీయ అభివృద్ధి సంస్థవారు యీ పథకానికి ద్రవ్య సహాయం చేశారు.

ఇప్పటి రెండవదశ పథకం అమలు జరగడంవల్ల యీ థర్మల్ కేంద్రంయొక్క విద్యుత్పత్తి శక్తి వెయ్యి మె. వాట్లకు పెరుగుతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రపు విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చుకోడానికి యిది ఎంతో ఉపయోగకరంగా వుంటుంది.



# మన పంటసీమలు

## సహకార సేద్యం

కృష్ణా జిల్లాలోని దివిసీమ బృహత్పథకానికి 1967 సెప్టెంబరు లోన రాష్ట్ర ముఖ్యమంత్రి అవనిగడ్డలో ప్రారంభోత్సవం చేశారు. దేశంలోని సహకార సేద్యానికి సంబంధించిన ప్రాజెక్టుల్లో యిదే పెద్దది. శ్రీకాకుళం జిల్లాలోని కళింగ పట్నంలో కూడా మత్స్య పరిశ్రమాభివృద్ధికై ఒక పథకాన్ని ప్రవేశపెట్టే విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు ముఖ్యమంత్రి తెలియజేశారు.

ఈ దివిసీమ పథకం క్రింద, ప్రభుత్వానికి చెందిన సుమారు 30,000 ఎకరాల భూమిని భూముల్లేని 10,887 కుటుంబాలకు పంపిణీ చేస్తారు. వీరు ఇక్కడ 400 సహకార సేద్యపు సంఘాలను నెలకొల్పుకుంటారు. ప్రతిసంఘానికీ, ఆ భూమిని అభివృద్ధి పరచుకునే. నిమిత్తం పంపుసెట్లు తదితర పనులకుగాను రూ 22,000లు లభిస్తాయి. పంపిణీ అయిన యీ భూమిలో సుమారు రూ 87 లక్షలు విలువచేసే 30,000 టన్నుల ఆహారపు పంటల్ని పండించవచ్చని అంచనావేశారు. ఈ పథకానికి రూ. 1.6 కోట్లు ఖర్చు అవుతుంది. ముందు ముందు ఈ పథకంవల్ల భూముల్లేని బీద ప్రజానీకానికి ఉపాధి లభిస్తుంది. వ్యవసాయోత్పత్తి అధికమవుతుంది.

## కొత్తరకం మొక్కజొన్న 'అంబర్ కాంపోజిట్'

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం 'అంబర్ కాంపోజిట్' అనే ఒక కొత్తరకం మొక్కజొన్నను రూపొందించింది. పదకొండు మొక్కజొన్న రకాలను తగువిధంగా ఒకదానితో ఒకటి సంకరపరచి ఈ క్రొత్తరకాన్ని రూపొందించారు.

హైబ్రిడ్ మొక్కజొన్న విషయంలోవలే ప్రత్యేకమైన పద్ధతులను అనుసరించనక్కర లేకుండానే ఈ కొత్తరకం విత్తనాన్ని ఎక్కువ చేయవచ్చు. అయితే వీటిని దూరం దూరంగా నాటాలి.

ఈ కొత్తరకం 115 దినాలలోనే కోతకు సిద్ధమవుతుంది. ఈ రకం యిక్కడి మార్కెటుకు కూడా పీలైనది. గింజచుట్టూ పొట్టు బాగావుండి, పక్షులనుంచి గింజకు రక్షణను కల్పిస్తూ వుంటుంది. ఈ రకం, ముంపులకు కూడా తట్టుకోగలదు. పైపెచ్చు తెగుళ్ళ చీడలనుంచికూడా యిది బాగా తట్టుకుని నిలబడగలదు. ఎకరాకు 5840 పౌనుల దిగుబడినిస్తుంది. అంటే 38 బస్తాలు అవుతాయన్న మాట.

## నాగార్జునసాగర్ వద్ద వేగంగా కోతకువచ్చే గోధుమ

నాగార్జునసాగర్ ఆయకట్టులోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ప్రయోగాత్మకంగా వేసిన గోధుమ మామూలుగా కన్నా నెలరోజులు ముందుగా కోతకువచ్చింది.

సాధారణంగా ఉత్తర భారత దేశంలో వేసే రకాలకన్నా యిది ముప్పయ్ రోజులు ముందుగానే కోతకు సిద్ధమైంది.

దక్షిణాదిలో అతి వేడి ప్రదేశమైన గుంటూరుజిల్లా వాతావరణం బహుశా దీనికి పరోక్షంగా సహాయకారి అయింది. ఎందుకంటే గింజ త్వరగా ఎదిగి రావడానికి అవసరమైనంత ఎక్కువ సూర్యరస్మి యిక్కడ లభించి వుండవచ్చు. పైగా యిక్కడ ఎరువులు, సేద్యపు నీటి సౌకర్యం, సస్యరక్షణ మొదలైనవిగూడా సంతృప్తికరంగా వుండడంవల్ల పంట తొందరగా కోతకొచ్చిందని చెప్పవచ్చు.

ఇంతకుముందు అమరావతిలోని వ్యవసాయ పరిశోధక కేంద్రంలో జరిపిన పరిశోధనలవల్ల నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆయకట్టు క్రింద గోధుమను బాగా పండించవచ్చని తేలింది. ఎన్. పి. 710 గోధుమ రకాన్ని నవంబరు తొలి వారంలోగా నాటితే ఎకరాకు 973 కిలోల దిగుబడి లభించింది. అదేగాక ఎస్_216 రకం. ఎస్_215 రకాలు కూడా బాగానే దిగుబడి యిస్తున్నట్లు తేలింది. అధిక దిగుబడిని యిచ్చే మెక్సికన్ రకాన్ని ఈ ప్రాజెక్టు ఆయకట్టు ప్రాంతంలో ఎక్కువగా వాడాలని ఉద్దేశించారు. దక్షిణాదిలో కూడా మొక్కజొన్నను ఎక్కువగా పండించేందుకుగల అవకాశాలను వినియోగించుకునే ఉద్దేశంతో ఎస్_227 వంటి కొత్త కొత్త గోధుమ రకాలనుకూడా ఈ ఆయకట్టు ప్రాంతంలో వాడాలని సూచించారు.

## రుద్రూరులోని వ్యవసాయ పరిశోధక కేంద్రం

నిజామాబాదు జిల్లాలోని రుద్రూరువద్ద 1931లో ప్రాంతీయ వ్యవసాయ పరిశోధక కేంద్రం నెలకొల్పబడినప్పటినుంచి అది తెలంగాణాలోని రైతులకు అనేక విధాలుగా సహాయ, సహకారాలను అందజేస్తున్నది. వారికి అభివృద్ధి మార్గాలను నిర్దేశించి మార్గదర్శకంగా వుంటున్నది.

తెలంగాణా ప్రాంతం అంతా కోస్తా తీరాలకు బాగా దూరంగావున్న ప్రదేశం. ఇక్కడ వర్షపాతమూ ఎక్కువే. చలీ ఎక్కువే. వేసవి ఎండలుకూడా ఎక్కువే. ఈ మూడూ యిక్కడ హెచ్చు మోతాదుల్లోనే వుంటాయి. ఇందువల్ల యీ ప్రాంతానికి వ్యావసాయికంగా ఒకానొక ప్రత్యేకత వచ్చింది. ఇక్కడి రైతుల అవసరాలను తీర్చుతూ వారికి

ప్రయోజనకరంగా వుండేందుకై అక్కడక్కడ వ్యవసాయ పరిశోధక కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. రుద్రూరులోని పరిశోధక కేంద్రం అలాంటి వాటిలో ఒకటి. ప్రాంతీయ పరిశోధక కేంద్రంగా యిది పని చేస్తున్నది ఇక్కడ చెరకు, వరి, వేరుశెనగ, గొబ్బరి, ప్రత్తి పంటలలో కొత్త కొత్త పరిశోధనలు, ప్రయోగాలు జరుగుతుంటాయి భూసార పరిశోధన, పంటల స్థితిగతులలో కూడా నూతన పరిశోధనలు ప్రయోగాలు యిక్కడ జరుపుతుంటారు.

నిజామాబాదు జిల్లాలో చెరకు పంట బాగా డబ్బు చేసుకునే పంట కావడంవల్ల రుద్రూర్ కేంద్రంలో ప్రత్యేకంగా చెరకు నిపుణుడు 1964 నుంచి పని చేస్తున్నాడు. పరిశోధనకు కావలసిన ప్రత్యేక సిబ్బంది కూడా యీయన క్రింద వున్నది. ఇంతవరకు యిది పరిశోధనలలో ఆరురకాల చెరకుల్ని విడుదల చేసింది. రైతులు తీసుకోవలసిన వివిధ సస్యరక్షణ చర్యల్నికూడా యీ కేంద్రం తెలియజేస్తుంది. చీడలు, తెగుళ్ళను నివారించేందుకు పటిష్ఠమైన పద్ధతులను రూపొందించే విషయంలోకూడా యీ కేంద్రం గట్టిగా కృషి చేస్తున్నది.

ఇక్కడ సుమారు 3,20,000 ఎకరాలు వరిపంటక్రిందకు వస్తుంది. దీనిలో సగం ప్రాంతం జలసమృద్ధి పుష్కలంగాగల నిజాంసాగర్ కాలువల క్రిందనే వుంటుంది. ఇక్కడి పరిశోధక కేంద్రం, ప్రాంతీయ వరి రకాలపై పరిశోధనలు జరిపి మూడు మేలు జాతి రకాలను రూపొందించి రైతులకు అందజేసింది.

ఈ పరిశోధక కేంద్రం 1966 జూలై 1 నుంచి ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ పరిధిక్రిందకు వచ్చింది.

## మధ్యతరహా సేద్యపునీటి ప్రాజెక్టులు

హైదరాబాదు జిల్లాలో 1967 సెప్టెంబరు నెలలో రెండు మధ్యతరహా సేద్యపునీటి ప్రాజెక్టులకు ప్రారంభోత్సవాలు జరిగాయి. పరిగి తాలూకాలోని లక్నాపూర్ ప్రాజెక్టుకు వ్యవసాయ శాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రారంభోత్సవం చేశారు. రెండవది కోటెపల్లి ప్రాజెక్టు. ఇది వికారాబాదు తాలూకాలో వుంది. దీనికి కేంద్ర ఉక్కు, గనులు, లోహాల శాఖా మంత్రి డా॥ ఎం. చెన్నారెడ్డి ప్రారంభోత్సవం జరిపారు.

## విశాఖపట్నంలో శిక్షణక్షేత్రం

విశాఖలోని ఉత్సాహవంతులైన యువక రైతాంగానికి ప్రయోజనాన్ని కల్పించేందుకై ప్రదర్శన-శిక్షణ క్షేత్రాన్నొక దానిని ఏర్పాటు చేసే విషయమై భారత ప్రభుత్వానికి, ఐక్యరాజ్యసమితి ఆహార, వ్యవసాయ సంస్థకు మధ్య ఒప్పందం కుదిరింది. ఈ క్షేత్రంలో రానున్న మూడేళ్ళలోనూ సుమారు 600 మంది యువ రైతాంగానికి శిక్షణయిస్తారు. మొత్తం 120,000 డాలర్ల విలువ మేరకు పరికరాలు, భవనాలు, తదితర సరఫరాలను ఆస్ట్రేలియా రైతులు ప్రపంచ ఆహారసంస్థద్వారా అందజేస్తారు. అప్రతివ్యయం కూడా ఈ మొత్తంలో చేరివుంటుంది.

## జహీరాబాదులో చెరకు అభివృద్ధి

జహీరాబాదు తాలూకాలో నేల ఎర్రయిటిక మట్టినేల. వాతావరణంలో తేమతక్కువ. అందువల్ల యీ నేల చెరకుపంటకు బాగా అనువైనది. కనుకనే యిక్కడ చెరకుపంటను వృద్ధిపరిచే అవకాశం వుంది. ఇప్పటికే యీ తాలూకాలో 5000 ఎకరాలలో చెరకు పంట పండిస్తున్నారు. ఇక్కడి చెరకు ఉత్పత్తిదార్లు మంచి రకం బెల్లాన్ని తయారు చేయడంలో రాష్ట్రంలో పేరుపొందారు. కొత్త కొత్త చెరకు రకాల్ని పండించేందుకు వీరు ఆధునిక శాస్త్రీయ పద్ధతులను కూడా ఉపయోగిస్తుంటారు.

దిగ్వాల్ గ్రామంలోని ప్రగతిశీలియైన రైతు ఒకరు తాను అనుసరించిన ఆధునిక వ్యవసాయ పద్ధతులద్వారా, Co-683, Co-737 వంటి కొత్త చెరకు రకాలను వాడడంద్వారా ఎకరాకు తొలిరకంవల్ల 60 టన్నులు, రెండో రకంవల్ల 67 టన్నులు ఏ విధంగా దిగుబడిని సాధించగలిగాడో తెలియజేశాడు. సాంప్రదాయకంగా వాడుతుండే Co-419 రకంవల్ల లోగడ ఎకరాకు 58 టన్నులు మాత్రమే చెరకు దిగుబడి అయింది. బావుల త్రవ్వకానికి, పంపుసెట్ల ఏర్పాటుకు, చెరకుపంట నిమిత్తం భూమిని బాగుచేసుకోవడానికి గాను మొత్తం 12 లక్షలరూపాయల ఋణాన్ని సహకార శాఖ పంపిణీ చేసింది అన్ని హంగులతో ఒక చెరకు విషయాల సూపరింటెండెంటును (జిల్లా వ్యవసాయ శాఖాధికారితో సమానమైన హోదాతో) అతనికి అవసరమైన సిబ్బందిని వ్యవసాయశాఖ ఏర్పాటు చేసింది. రైతులు అయిదు అంశాల కార్యక్రమాన్ని అమలు పరిచి తాము పండిస్తున్న చెరకు నాణ్యాన్ని మెరుగు పరచుకోవడానికి వీరు తగుసూచనలు, సలహాలు అందజేస్తుంటారు. ఈ అయిదు అంశాల కార్యక్రమంలో మరిన్ని బావుల్ని త్రవ్వడం, నాట్లకుగాను తెగుళ్ళు, చీడలు అంటని చెరకు ముక్కల్ని సరఫరా చేయడం, ఆధునిక వ్యవసాయ పద్ధతులను చేపట్టడం, వేసవిలో చెరకు పంటకు తగినంత నీటి సౌకర్యాన్ని అందించడం, రసాయనిక ఎరువులు, పచ్చి ఎరువులను తగు సమయంలో తగినంత మోతాదులో ఉపయోగించడం వంటి సహాయక కార్యక్రమాలు యిమిడివున్నాయి.

## పంపా రిజర్వాయరు ప్రాజెక్టు

పంపారిజర్వాయరు నిర్మాణం పూర్తయింది. దీనికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. పంపానది ఒక కొండ వాగు. దీనిని అనేక పేర్లతో పిలుస్తుంటారు. ఇది ప్రవహించే ప్రాంతాన్ని బట్టి ఒకొక్కచోట ఒకొక్కపేరు స్థిరపడింది. ఇది లోదెడ్డి రిజర్వు అడవిలో పుట్టింది. పార్లంక అడవిలో పుట్టిన బండకాల్వ ఈ వాగుకు శంకవరంలో వొచ్చి కలుస్తుంది. ఇక్కడినుంచి దిగువ ప్రవాహమంతా పంపానదిగానే పరిగణింపబడుతున్నది. ఈ నది అన్నవరం వద్ద శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి వారి దేవాలయం ప్రక్కగానే ప్రవహిస్తున్నది. అన్నవరానికి ఆరు ఫర్లాంగులు దిగువ ప్రవాహంవద్ద ఈనది రెండుగా చీలుతుంది. ఎడమది

[illegible]
పరిసర గ్రామాలలోని చెరువులకు నీటిని అందజేస్తూ యీ రెండు యేరులు పోయిపోయి బంగాళాఖాతంలో కలుస్తున్నాయి.

ఈ చెరువుల క్రిందే రైతులు తమ భూములను సాగుచేస్తున్నారు. పీటి అరగాణి ప్రాంతాలనుండి సరఫరాలు తగినంతగా లేనప్పుడు పంపానదినుండి కాలువలద్వారా యీ చెరువులకు నీటిని అందజేస్తుంటాయి. 1956లో వీటి క్రింద 4,074 ఎకరాలు సాగవుతుండేది. 1965లో 15,004 ఎకరాలు సాగయ్యింది. గడచిన పదేళ్ళలో ఎనిమిదేళ్ళు రెమిషను మంజూరు చేశారు. దీనినిబట్టి యిక్కడ సేద్యం అనేది ఎంతటి క్లిష్టమైనదో ఊహించవచ్చు. ఇలాంటి ఈ ప్రాంతానికి పంపారిజర్వాయరు నిజంగా ఒక వర ప్రసాదమే అనాలి. ఇక్కడి రిజిష్టరయిన 9567 ఎకరాల ఆయకట్టుకు సేద్యపు నీటిని అందించడమే ఈ రిజర్వాయరు ప్రధాన లక్ష్యం. అంతేగాక 1513 ఎకరాల క్రొత్త ఆయకట్టుకు కూడా సేద్యపు నీటిని యిది అందిస్తుంది. దీనివల్ల మొత్తం 12,004 ఎకరాల మెట్ట భూమికి సాగునీరు లభిస్తుంది.

ఈ రిజర్వాయరు సత్యనారాయణకొండను, బిషప్ కొండను కలుపుతుంది. ఈ రెండు కొండలమధ్య వుండే ప్రధానమైన మట్టి ఆనకట్ట పొడవు 1183 అడుగులు, ఎత్తు 48 అడుగులు. కరకట్ట పై భాగాన వెడల్పు 12 అడుగులు వుంటుంది. ఇదేకాక బిషప్ కొండను మరోకొండను కలుపుతూ 2100 అ. పొడవు, 15.5 అ. ఎత్తు, పైన 12 అ. వెడల్పుతో మరొక మట్టికట్ట కూడా వుంటుంది.

అప్పుడే ప్రధానమైన మట్టి ఆనకట్ట నిర్మాణపుపని, కుడి ఎడమలగల తూముల నిర్మాణపుపని తొంభైఅయిదు శాతం పూర్తయ్యాయి. *

# మహాభారతము

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 11

### పాండవులకు రాజ్యప్రాప్తి

ద్రౌపదికి వివాహము పాండవులతో జరిగినదని రాజులందరికి తెలిసెను. దుర్యోధనాదులు తెలిసికొని మిగుల చింతించిరి. లాక్షాగృహములో పాండవులు దహింపబడినా రనుకొని శాంతితో నున్నవారికి ఇది పిడుగువంటివార్త యయ్యెను. పైపెచ్చు వారికి ద్రుపదునిసహాయముగూడ లభించినందుకు ఎక్కువ విచారపడిరి. విదురు డీసంగతిని ధృతరాష్ట్రునకు తెలిపెను. అతడు పాండవులు జీవించి యున్నారనియు, వివాహితులైనారనియు తెలిసి, చాల సంతసించి వారిని సగౌరవముగా తనపట్టణమునకు పిలిపింప దలచెను. విదురుడు ఆనందముతో తనయింటికి పోయెను. తరువాత దుర్యోధనుడు, దుశ్శాసనుడు తండ్రికడకు వచ్చి 'శత్రువుల శ్రేయస్సును కోర దగునా! పాండవుల నెట్లైనను నశింప జేయ వలెను. లేకున్న వారు మమ్ము మ్రింగి వేయుదురు. కనుక సమయమునకై వేచి యుండి వారిని మట్టుపెట్టవలెను.' అని చెప్పిరి. 'నేనుగూడ మీభావముతో నేకీభవించియున్నాను. కాని విదురునకు కొంచెముగూడ నాతలంపు ప్రకటితము కాకుండ నటించితిని. మీరు, కర్ణుడు యోచించి సమయానుకూలముగ ఏది చేయ వలయునో నిర్ణయించి చెప్పుడు. అట్లే చేయుదము.' అని ధృతరాష్ట్రు డనెను. అప్పుడు దుర్యోధనుడు, "పాండవుల నేలాగైనను భేదించ వలెను. ద్రుపదునకు గొప్పధనము నిచ్చి అతనిని అతనిపుత్రులను మనవశము చేసికొని యుధిష్ఠిరుని విడిచి పెట్టునట్లు చేయ వలెను. హస్తినాపురికి తిరిగి వారు వచ్చినచో వారికి క్షేమము లేదనుభావము వారిలో కలిగించ వలెను. ఆ సోదరులలో పరస్పరము భేదభావమైనను కల్పించ వలెను. అనేకపతిక యైన ద్రౌపదికి ఏయొక్కనియందుగూడ సుదృఢమైనయనురాగము ఉండదు. కనుక ఆమెకు వారియెడ భేదభావము కల్పించి వారినుండి ఆమెను విడదీయ వలెను. ఏయుపాయము నైనను పన్ని వారిలో బలవంతుడైన భీమసేనుని చంప వలెను. అతని యనంతరము వారికి బలము తగ్గి తిరిగి రాజ్యముకొరకు యత్నించరు. అతనిసహాయము వీడినచో అర్జునుని జయించుట గూడ సులభ మగును. లేదా, వారి నిక్కడికి రప్పించి మన యాజ్ఞలో నుంచుకొని ఉపాయములతో నశింప జేయుదము. వారికి అందకత్తెలతో సంబంధము కలిగించి ద్రౌపదికి వారియెడల అసహ్యభావమును కలిగింతము. ఇప్పుడు కర్ణుని వారికడకు పంపి వారిని పిలిపించి ఆయాయుపాయములను పన్ని వారిని నశింప జేయుదము. ద్రుపదునకు వారియెడ పూర్తివిశ్వాసము కలుగులోపలనే వారినాశమునకు త్వరగా ప్రయత్నించ వలెను. మంచిదో చెడ్డదో యిది నానిశ్చయము. ఇందుకు కర్ణునిభావము గూడ తెలిసికొందము.

కర్ణుడిట్లు చెప్ప దొడగెను :— "దుర్యోధనా! నీయోచన సరిగా లేదు. నీవు చెప్పిన యేయుపాయములచేతగూడ పాండవులను సాధించుట సాధ్యము కాదు. వారు బాల్యములో మీయండలో నున్నప్పుడే వారిని జయింపలేక పోయితిరి. ఇప్పుడు వారికి అంగబలము అర్థబలము హెచ్చినది. సర్వథా నీకు సాధ్యులు కారు. వారిని దుర్వ్యసనములు అంట జాలవు. ఒక స్త్రీయందు ఆసక్తులైనవారికి పరస్పరద్వేషము కలిగించుట అసాధ్యము. వారు భిక్షాటనము చేయుచు దరిద్రులుగ నున్నప్పుడే వారిని ప్రేమించి సేవించిన ద్రౌపదికి ఇప్పుడు సర్వవిధముల పరిపూర్ణులైనవారిపై వెగటు కలిగించుటగూడ అసాధ్యమే యగును. ఇదిగాక సాధారణముగా లోకములో స్త్రీలకు బహుభర్తృకత్వము ఇష్టమై యుండును. అది దైవికముగా ఆమెకు లభించి ధర్మబద్ధమైనది. కనుక ఆమెను వారినుండి విడదీయుటకు ఎవరికిని సాధ్యము కాదు. ఉత్తమవంశశీలుడైన పాంచాలరాజును ధనలోభముచేత లొంగదీయ లేము. ఇప్పు డొక్కటే ఉపాయము కలదు. వారు బలము చేకూర్చుకొని గట్టిపడకమున్నే వారిని నశింప జేయ వలెను. ద్రుపదుడు ఇప్పుడు మనకన్న బలహీనుడు. అతడు బలాధికుడు కాకమున్నే అతనిని లొంగదీయుట యుక్తము. కనుక ఉపాయాంతరమును ప్రయోగించుట మాని, వారు బలమును కూర్చుకొనులోగా, ద్రుపదుడు సైన్యసమీకరణమును చేసికొనులోగా, కృష్ణుడు యాదవసేనతో వారికి బాసటగా వచ్చులోగా మనము పరాక్రమముచేత పాండవులను అణచ వలెను. ఇంద్రాదులు పరాక్రమముచేతనే త్రైలోక్యరాజ్యము నేలిరి. పాండవులను సామ–దాన–భేదములచేత సాధింప జాలము. కేవలము దండోపాయమే యిప్పుడు మనకు శరణ్యము." ఈమాటలు చెప్పినందుకు కర్ణుని ధృతరాష్ట్రుడు మెచ్చుకొని యీవిషయములో భీష్మ, ద్రోణాదులతోగూడ సంప్రదింపులు జరుపుట యుక్తమని వారిని పిలిపించెను.

భీష్ము డిట్లు చెప్పెను :—'నాకు ధృతరాష్ట్రుడు, పాండు రాజు ఇరువురును సమానులే. పాండవులను రాజ్యభాగమునుండి వంచితులను చేయుట నాకు ఇష్టము లేదు. దుర్యోధనా ! నీకువలెనే వారికిగూడ పైతృక మైనసంపత్తిపై ఆశ ఉండుట సహజముకదా! వారికి రాజ్యము లభించనియెడల నీకుమాత్రము ఎట్లు దొరకును? మంచిమార్గములోనే వారిరాజ్యమును వారికి ఇమ్ము. ఇది నామతము. దీనివలన నీకు అకీర్తి రాదు. అన్నిటికన్న పురుషునకు కీర్తిరక్షణమే ఉత్తమము. కీర్తియే బలము. అది నశించినతరువాత జీవితము వ్యర్థము. కీర్తి ఉన్నంతవరకె మనుష్యుడు జీవించినవారిలో పరిగణింపబడును. అది పోయిన తరువాతవాడు నశించినవారితో సమానుడు. కనుక కురుకులో చిత మైనధర్మమును ఆచరించి పాండవులకు వారిరాజ్యభాగము నిమ్ము. వారు జీవించియుండగా వారిరాజ్యమును తీసికొనుటకు ఇంద్రునకుగూడ శక్యము కాదు. వారిలో ఐకమత్యము, ధర్మము నిండి యున్నవి. ఎక్కడగూడ అధర్మమును అనుమతించరు. నీవు ధర్మమును, నామాటను ఆదరించి నీక్షేమమును కోరి యున్నచో వారికి అర్ధరాజ్య మిమ్ము."

ద్రోణు డిట్లు చెప్పెను :—"ధృతరాష్ట్రా ! మంత్రాలోచన కొరకు హితులైనమమ్ము పిలిపించితివి. కనుక ధర్మయుక్తము అర్థసహితము, కీర్తికరము నైనమాట చెప్పవలెనుకదా ! భీష్ముని తలంపే నాతలంపుగూడ. అదియే ధర్మము. కనుక వెంటనే పరివారమును పంపి సగౌరవముగా పాండుపుత్రులను పిలిపించి రాజ్యము నిమ్ము."

విదురు డిట్లు చెప్పెను :—"రాజా ! హితులు హితము చెప్పుదురు. నీవు వినవు. భీష్ముడు హితము చెప్పెను. ద్రోణుడును మంచిమాట చెప్పెను. నీవు విశ్వసించవు కర్ణుడు నీహితమును కోరి చెప్పలేదు. అతడు నీకు మిత్రుడు కాడు. భీష్మ ద్రోణులు, రామునికన్నను, గయునికన్నను ఎక్కువ ధర్మపరులు. వారు నీమేలు కోరి చెప్పిరి. నీకు దుర్యోధనాదులవలెనే పాండవులుగూడ వారసులు. అర్జునుని ఎవరుగూడ జయించ లేరు. తక్కినపాండవులుగూడ అజేయులు. ధైర్యము, దయ, ఓర్పు, సత్యము, పరాక్రమము ఈమొదలైనగుణములు గలయుధిష్ఠిరుని యుద్ధములో నెవరు జయించ గలరు? వారిపక్షముననే బలరాము డున్నాడు. వారికి కృష్ణుడు మంత్రి. ద్రుపదాదులు మహా వీరులు వారికి బాంధవులై వారిపక్షమున నిలుచున్నారు. అట్టివారిని ఓడించుట సాధ్యమా? వారిని చేర దీసి ఆదరింపుము. కులమును, కీర్తిని రక్షింపుము. వారు జనప్రీతినిగూడ సంపాదించినారు. దుష్టచతుష్టయ మైనదుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులు అధర్మపరులు. వారిమాట విని చెడిపోకుము. దుర్యోధనుని దోషముచేత ప్రజలు నశింతురు. ఇట్టిప్రజాక్షయము నాపుము."

వారిమాట లన్నియు విని ధృతరాష్ట్రుడు విదురునితో "భీష్మద్రోణాదులును నీవును చెప్పినమాటలు ధర్మబద్ధములు. నాకు నాపుత్రు లెంతో పాండుపుత్రులును నంతియే. కనుక నీవు వెంటనే ద్రుపదపురమునకు పోయి వారిని తల్లితోను, ద్రౌపదితోను తోడు కొని రమ్ము." అని చెప్పెను. అతనియాజ్ఞమేరకు విదురుడు ద్రుపదపురికి పోయెను. పాండవులకు కానుకలు సమర్పించెను. అందరిని దర్శించి పెద్దలకు నమస్కరించెను. ద్రుపదుడు కుశల ప్రశ్నపూర్వకముగా విదురుని గౌరవించెను. అక్కడ సన్నిహితుడై యున్నకృష్ణునకు విదురుడు నమస్కరించెను. కుశల ప్రశ్నములు జరిగినతరువాత విదురు డిట్లనెను :—

'రాజా! మీసంబంధమువలన తమకు చాల సంతోషమైన దని భీష్మద్రోణాదులు.' ధృతరాష్ట్రుడు మీకు తెలుప మనెనా వారికి నూతన రాజ్యము లభించునప్పటికంటె మీసంబంధమువలన ఎక్కువ సంతోష మైనది. పాండుపుత్రులను ద్రౌపదిని అక్కడివా రందరును చూచుటకు ఉత్సుకులై యున్నారు. కనుక నీవు వారికి అనుమతి నిమ్ము. వెంటనే తగిన పరివారముతో వారిని హస్తిపురికి పంపుము. '' ఆ మాటలు విని:—

ద్రుప :— విదురా: నాకుగూడ కురువంశముతో సంబంధము చేసి నందుకు చాల సంతోషముగా నున్నది. ధృతరాష్ట్రునియాజ్ఞ ప్రకారము చేయుటకు నాకు అధికారము చాలదు. నే నెట్లు పాండవులను పొమ్మందును. పాండవులు తము యిచ్ఛ వచ్చినచో పోవచ్చును. వారిహితమును గోరుకృష్ణ బలరాములయనుమతిగూడ ఇందులో అవసరము గదా!

యుధి :—ద్రుపదరాజా! మేము నీయధీనులము. మాప్రీతిని గోరు నీవు ఆదేశించునట్లు చేసెదము.

కృష్ణు :—హస్తిపురికి ఇప్పుడు పోవుట నాకు ఇష్టమే అయినను ద్రుపదునియిష్టమే యిందు ముఖ్యము.

ద్రుప :— కృష్ణుడు తలచినప్రకారమే చేయుదము. పాండవులు నా కెంతో కృష్ణునకు గూడ అంతే హితులు. యుధిష్ఠిరునికన్న కృష్ణునకే పాండవులయెడ ప్రీతి అధికము గదా! విదురు డక్కడినుండి కుంతీదేవికడకు పోయి ఆమెకు నమస్కరించెను. ఆమె కుశలప్రశ్న చేసెను. లక్కయింటినుండి తమను కాపాడినవిదురుని మిక్కిలి ఆదరించి కుంతీదేవి కంట తడి పెట్టెను. విదురా! తాబేలు పిల్లలను కని విడిచిన తరువాత వారు ఎక్కడ నున్నను వారిహితమునే చింతించుచు ఉండును. ఆహితచింతయే ఆపిల్లలను సర్వదా కాపాడు చుండును. అలాగే నీవు నీపుత్రు లగుపాండవు లెక్కడ నున్నను వారిహితమునే చింతించు చుందువు. అదియే వారికి పెట్టనికోటగా ఉండి రక్షించు చుండును. కోకిల తన పిల్లలను పారవేసి పోవును. వారిని కాకి కాపాడును. అట్లే నీపిల్లలను నేను కాపాడితిని. అనేక దుఃఖములను అనుభవించితిని. ఈతరువాత. నీయిష్టము ప్రకారమే నడచుకొనెదము. అని చెప్పి మిగులదుఃఖించెను. ఆమెతో:— విదురుడు 'అమ్మా! నీపుత్రులు నశించరు. వారు మహాబలశాలురు. త్వరలోనే తమరాజ్యమును పొంద నున్నారు. దుఃఖించకుము' అని యనెను.

ఆతరువాత పాండవులు, కుంతి ద్రౌపది, కృష్ణుడు, విదురుడు, ద్రుపదాజ్ఞగొని హస్తిపురికి పయనమై పోయిరి. ధృతరాష్ట్రుడు ఆనందపడి వారిని ఎదుర్కొనుటకు కౌరవులను పంపెను. హస్తినాపురము ఆనందసముద్రములో మునిగి యుండెను. పాండవులు రాజభవనమును చేరి పెద్దలకు నమస్కరించి చిన్నలను ఆదరించిరి. ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరుని పిలిచి, 'నాయనా! మీకు తిరిగి కౌరవులతో విరోధము కలుగకుండుటకుగాను మీరు ఖాండవప్రస్థపురమునందు నివసించుచు అర్ధరాజ్యమును ఏలుచుండునట్లు ఏర్పాటు చేసితిని. మీకు ఏలాటి బాధగూడ కలుగదు. నిశ్చింతగాను, క్షేమముగాను అక్కడ ఉండుడు' అని చెప్పెను. తండ్రియాజ్ఞను స్వీకరించి యుధిష్ఠిరుడు తమ్ములతో తండ్రికి నమస్కరించి అడవివలె నున్న ఖాండవప్రస్థమునకు పోయెను. వారు కృష్ణునితో అక్కడికి పోయి దానిని స్వర్గపురితో సమానముగా తీర్చి అలంకరించిరి. దానికి కావలసిన ప్రాకారములు అగడ్తలు చేర్చుకొనిరి. ఇతరపరికరములన్నియు క్రమక్రమముగా సేకరించుకొనిరి. స్వర్గపురముతో సమానముగా చేసినందుచేత దానికి ఇంద్రప్రస్థము అని పేరు వచ్చెను. ఆ పట్టణమును సర్వాంగశోభలతో తీర్పింప జేసి అందులో పాండవులను నిలిపి కృష్ణ బలరాములు ద్వారకాపురికి పోయిరి.

పాండవులు ఖాండవప్రస్థము (ఇంద్రప్రస్థము) నందు నివసించుచు రాజ్యమును ప్రజారంజకముగా నేలుచు సుఖముగ నుండిరి. వారికడకు యదృచ్ఛగా నారదమహాముని వచ్చెను. ఆ మునికి స్వాగతముచెప్పి అర్ఘ్యపాద్యాదులతో పూజ సలిపి యెదురుగా కూర్చుండిరి. నవోఢ యగు ద్రౌపదిచేతగూడ నారదునకు నమస్కారమును చేయించిరి. తరువాత నారదుడామెకు సెలవిచ్చి పంపి పాండవులను చూచి, 'మీరు ఐదుగురును ఒక్క స్త్రీతో అవిరోధముగ కాపురము చేయుటకు ఏదో యొకనీతిని అవలంబించవలెను. లేకున్నచో మీకు స్త్రీనిమిత్తముగా విరోధ మేర్పడవచ్చును. "పూర్వము 'సుందోప సుందులు' అనునిరువురు అసురసోదరులు సర్వదా ఒక్కటిగానే మెలగుచుండిరి. మూడు లోకములలోను వారిని ఎదిరించి చంపువారు లేకుండిరి. ఆ యిరువురకు, రాజ్యము, గృహము, శయ్య, ఆసనము—ఈయన్నియు నొకటిగనే యుండెను. ఇట్లు అన్యోన్యప్రేమతో నుండిన ఆ సోదరులకు 'తిలోత్తమ' కారణముగా ద్వేషము కలిగి పరస్పరము పోరాడుకొని చంపుకొనిరి. కనుక యుధిష్ఠిరా! మీరుగూడ అన్యోన్యసోదరప్రేమను కాపాడుకొనుచు భేదభావము కలుగకుండ మెలగుడు" అని చెప్పెను.

ఆ మాట విని యుధిష్ఠిరుడు, 'సుందుడు, ఉపసుందుడు' అనురాక్షసులు ఎవరికొడుకులు? వారికి భేద మెట్లు కలిగెను? ఎట్లు వారు పరస్పరము చంపుకొనిరి? తిలోత్తమ యెవతె? ఆమె ఎట్లువారికడకు వచ్చెను? ఆకథ నంతయు చెప్పుడు.' అని యడిగెను. ఆమాటకు నారదు డాకథను సవిస్తరముగా నిట్లు చెప్పదొడిగెను:—

'మహారాక్షసుడైన హిరణ్యకశిపుని వంశమునందు 'నికుంభుడు' అనుఅసురేంద్రుడు జన్మించెను. అతడు మహాబలశాలి. అతనికి 'సుందుడు, ఉపసుందుడు' అనుమహాక్రూరు లగునిరువురు పుత్రులు ఉండిరి. వారిరువురిమాట ఒకటే, పని ఒకటే. సమానముగా సుఖదుఃఖములను అనుభవించుచు ఆత్మ ఒకటై శరీరముమాత్రము రెండుగా నుండిరి. ఒకనిని విడిచి మరియొకడు భుజించుటగాని, శయనించుట గాని, మాట్లాడుకొనుటగాని చేయకుండిరి. పరస్పరము మేలు చేసికొనుచు మెలగుచుండిరి. ఒకశరీరమే రెండుగా నైనదా యనునంతతుల్యస్వభావవర్తనములు గలిగి యుండిరి. వారొకనాడు త్రిలోకవిజయార్థులై వింధ్యపర్వతమునకు పోయి దీక్షతో తపస్సు చేయుట కారంభించిరి. చాల కాలము తపస్సు చేయుచు ఆకలిదప్పులచేత పరిశ్రాంతులై, శరీరమంతయు ధూళి క్రమ్మగా, వాయుభక్షణము చేయుచు, తమశరీరమాంసమును ముక్కలు ముక్కలుగా కోయుచు అగ్నిలో హోమము చేయుచు, ఊర్ధ్వబాహువులై కాలిబొటనవ్రేలిపైన నిలుచుకొని, రెప్పపాటు వేయక సర్వదా కన్నులు తెరచికొని యుండి అతిఘోరముగా తపస్సు చేయుచుండిరి. వారితపోగ్నిచేత వింధ్యపర్వతమంతయు ఉడుకెత్తి పొగలు గ్రక్కుచుండెను. వారిఘోరతపస్సునకు దేవతలు భయపడి తపస్సునకు విఘ్నములు చేయ సాగిరి. అనేక రత్నములచేతను, స్త్రీ రత్నములచేతను వారిని ప్రలోభపరచి తపోభంగము చేయ దలచి నిష్ఫలమనోరథులైరి. అనేకయత్నములు దేవతలు చేసినను వారు దృఢవ్రతులై యుండిరి. ఆఘోరమును చూచి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరము కోరు డనెను. అప్పుడు సుందోపసుందులు ఆదేవునకు నమస్కరించి, 'తమకు మరణము లేకుండునట్లును, మాయలలోను, అస్త్రవిద్యలలోను, కామరూపధరణములోను తమకు మించిన వారెవరును లేకుండునట్లును' వరమును వేడిరి. బ్రహ్మదేవుడు, 'మృత్యువు తప్ప, మీరు కోరినవరము లన్నియు నిచ్చితిని. మీరు దేవతలతో సమానులుగా నుండుటకు అనువైనవరము మరి యేదైనను కోరుకొనుడు. మీరు త్రిలోకాధిపత్యమునే కోరి తపస్సు చేసితిరి. కాని అమరత్వమును కోరి చేయలేదు కనుక మీకు ఆవరమును నే నీయను.' అని చెప్పెను. ఆమాటకు సుందోపసుందులు. 'దేవా! మాయిరువురిలో నొకరివలన మరియొకరికి తప్ప మూడులోకములలో మరియెవరివలనగూడ భయము ఉండకుండునట్లు వరమిమ్ము' అని కోరిరి. బ్రహ్మదేవు డావరమును వారికిచ్చి, 'మీ మృత్యువు ఈ విధముగానే జరుగును.' అని చెప్పి వారితపస్సును మాన్పి అంతర్ధానము చెందెను. ఆ వరములను పొంది సుందోపసుందులు తిరిగి తమ యింటికి వచ్చి, 'మేమెవరికిని లోకములో వధ్యులము కాము కదా' యని గర్వించుచుండిరి. వారిమిత్రులు అందరు సంతసించిరి. వారు జటలను తీసి మకుటమును ధరించి, అనేకాభరణములచేత భూషితులై సర్వదా వెన్నెలలు గురియుచుండిరి. మహానందముతో ననేక సంవత్సరములు ఒకదినమువలె గడుపుచుండిరి.

(సశేషము)

# ఆంధ్రప్రదేశ్‌లో ఎరువుల పరిశ్రమ భవిష్యత్తు

కె. వి. నటరాజన్

ఆంధ్రప్రదేశ్‌లో రేవు పట్టణాల విస్తరణతో ఎరువుల ఉత్పత్తి సన్నిహిత సంబంధం కలిగి ఉంది. ప్రస్తుత పరిస్థితుల లో ఎరువుల ఉత్పత్తికిగాక ఎరువుల దిగుమతికి రేవుల విస్తరణ చాలా అవసరం. ఎరువుల ఉత్పత్తి టెక్నాలజీ నాఫ్తా, అమోనియాలపై ఆధారపడి ఉన్న కారణంగా ముఖ్యమైన రేవుల పరిసర ప్రాంతాలలో ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పాల్సిన అవసరం ఉంది. 20 నత్రజని ఎరువుల ఫ్యాక్టరీలలో దాదాపు సగానికి పైగా రేవు పట్టణాల పరిసరాలలోనే నెలకొల్పారు. అదే విధంగా ఫాస్ఫేట్ ఎరువుల ఫ్యాక్టరీలు కూడ చాలా వరకు రేవు పట్టణాల పరిసరాలలోనే నిర్మించారు. ఆంధ్ర ప్రదేశ్‌లో విశాఖపట్నం, కాకినాడ, మచిలీపట్నం ముఖ్యమైన రేవు పట్టణాలు. అందులో విశాఖపట్నం పెద్దది. మిగతా రెండు మధ్య తరహా రేవులు. విశాఖపట్నం రేవుకు ప్రస్తుతం నాఫ్తా ఎరువుల ఫ్యాక్టరీల అవసరాలను మాత్రం తీర్చగల శక్తి ఉంది. తదనుగుణంగా కోరమాండల్ ఎరువుల ఫ్యాక్టరీ అక్కడ నెలకొల్పబడింది. ఈ ఎరువుల ఫ్యాక్టరీకి అవసరమైన ముడి పదార్థాలకు చెందిన ఓడలను నిలిపేటందుకు వీలుగా అదనపు ఎరువుల బెర్తును నిర్మించాలని విశాఖ పట్నం రేవు నిర్వహణ సంస్థ సంకల్పించింది. భారత దేశంలో ఎరువుల వినియోగం చాలా తక్కువగా ఉంది. పశ్చిమ జర్మనీలో సగటున హెక్టరుకు 163 కిలో గ్రాములు, జపానులో 257 కిలో గ్రాములు, తైవాన్‌లో 256 కిలో గ్రాములు వినియోగిస్తుండగా భారతదేశంలో సగటున హెక్టరుకు 4కిలో గ్రాములు మాత్రమే వాడుతున్నారు. 1945-46లో ప్రపంచంలో 70.5 లక్షల టన్నుల ఎరువు వాడబడగా 1966-67లో 360 లక్షల టన్నులకు పెరిగింది. ఇందులో 90 శాతం మేరకు అభివృద్ధి చెందిన దేశాలలోనే వినియోగిస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో వాడకం నామ మాత్రమే. ఇటీవల అంచనాల ప్రకారం, భారత దేశంలో వార్షికంగా 15,00,000 టన్నుల నత్రజని ఎరువులు, 80,000 టన్నుల $P_2O_2$ ఎరువులు అవసర మవుతాయి.

మన వ్యవసాయ రంగంలో అధిక రాలుబడి నిచ్చే వరి, గోధుమ, జొన్న, సజ్జ మొదలైన వాటి వివిధ రకాల విత్తనాల వాడకంపై ఎక్కువ దృష్టిని కేంద్రీకరిస్తున్నారు. ఈ కొత్త విత్తనాలకు ఎక్కువ పరిమాణంలో అంటే గరిష్ఠ రాలుబడికి ఎకరాకు దాదాపు 100-120 టన్నుల నత్రజని ఎరువులు కావాల్సి ఉంటాయి. విస్తృత ప్రాంతాలలో తక్కువ పరిమాణంలోనైనా ఎరువులను ఉపయోగించాలని తలపెట్టినప్పుడు ఉత్పత్తి చేస్తున్న దానికన్నా ఎక్కువ మొత్తంలో ఎరువులు కావాల్సి ఉంటాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రస్తుతం 5 లక్షల టన్నుల అమోనియం సల్ఫేటు, 1.7 లక్షల టన్నుల సూపర్ ఫాస్ఫేటు వినియోగిస్తున్నారు. రాష్ట్రంలో నత్రజని ఎరువు ఉత్పత్తి కావడంలేదు. 3.50 లక్షల టన్నుల సూపర్ ఫాస్ఫేటు తయారు అవుతున్నది. నాలుగవ పంచవర్ష ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో 15 లక్షల టన్నుల అమోనియం సల్ఫేటు, 10 లక్షల టన్నుల సూపర్ ఫాస్ఫేటు ఎరువులు పంపిణీ చేయాలని ప్రతిపాదించారు. ఆంధ్ర ప్రదేశ్‌లో ఎరువుల ఉత్పత్తిలో స్వయం సమృద్ధిని సాధించాలని నిశ్చయించినప్పుడు, అయిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో నెలకొల్ప నుద్దేశించిన ఫ్యాక్టరీల ఉత్పత్తి శక్తి, 50 లక్షల టన్నుల అమోనియం సల్ఫేటు, 25 లక్షల టన్నుల సూపర్ ఫాస్ఫేటులకు ఉండాల్సి ఉంటుంది. ప్రస్తుతం బొగ్గు ప్రాతిపదికగా ఎరువులను ఉత్పత్తిచేసే విధానాన్ని ఎరువుల టెక్నాలజీ ప్రోత్సహించడంలేదు. ఎరువుల టెక్నాలజీలో జరిగిన విప్లవం కారణంగా నేడు రోజుకు 600 నుండి 1500 టన్నుల ఉత్పాదక శక్తిగల ఫ్యాక్టరీలు నెలకొల్ప బడుతున్నాయి. ఐదేళ్ల క్రితం, రోజుకు 300 టన్నుల ఉత్పాదక శక్తిగల ఫ్యాక్టరీలు పెద్దవిగా భావించేవారు. నేటి ఎరువుల ఫ్యాక్టరీలకు నూనెశుద్ధి కర్మాగారాలు ముడిపదార్థాన్ని సరఫరా చేస్తున్నాయి. నూనె శుద్ధి కర్మాగారాలు, ముడిసరుకును దిగుమతి చేసుకునే రేవు పట్టణాలుగల ప్రాంతాలు ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి అనువైన ప్రాంతాలు. భవిష్యత్తులో ఆంధ్ర ప్రదేశ్‌లో ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి రేవు పట్టణాలకే ప్రాధాన్యం యిస్తారు.

## రెండు మధ్య తరహా రేవులు

ఆంధ్ర ప్రదేశ్‌లో ఎరువుల పరిశ్రమ విస్తరణకు అనువైన ప్రాంతాలు గల రెండు మధ్య తరహా రేవు పట్టణాలు కాకినాడ, మచిలీపట్నం ఉన్నాయి. వాటిని అధిక శక్తిగల రేవు పట్టణాలుగా అభివృద్ధి చేయాల్సి ఉంది. ఎరువుల

ఫ్యాక్టరీలకు ముడిపదార్థంగా నాఫ్తాగానీ, అమోనియా ద్రావణి గానీ ఉపయోగించినా యీ రేవులను అభివృద్ధి చేయాల్సి ఉంటుంది.

కాకినాడ రేవులో సగటున వార్షికం 4 లక్షల టన్నులకు ఎగుమతి దిగుమతిలు నిర్వహించ బడుతున్నవి. మచిలీ పట్నం రేవులో దాదాపు 2.5 లక్షల టన్నులకు ఉంటుంది. భవిష్యత్తులో యిక్కడ ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి వీలుగా యీ రేవుల నిర్వహణ శక్తిని ఎక్కువ చేయాల్సి ఉంటుంది. నాలుగవ ప్రణాళికలో దీనికై కాకి నాడ రేవుకు రు 80. 60 లక్షలు, మచిలీపట్నం రేవుకు రు 70.73 లక్షలు కేటాయించారు. నిర్వహణ శక్తిని 11 లక్షల టన్నులకు పెంచాలని ప్రణాళికలో ఉద్దేశించారు. యిందులో ఎరువుల నిర్వహణకు లక్షటన్నులు కే. యించారు. భవిష్య త్తులో నెలకొల్పే ఎరువుల ఫ్యాక్టరీలకు కావలసిన, ముడి పదార్థాలను దిగుమతి చేసుకోవడానికి యీ నిర్వహణశక్తి సరి పోదు. అదే విధంగా మచిలీపట్నం రేవులోకూడ ఎరువుల నిర్వహణ శక్తిని ఒక లక్ష టన్నులుగా నిర్ణయించారు.

ఈ రెండు రేవు పట్టణాల పరిసర ప్రాంతాలలో భవి ష్యత్తులో ఎరువుల ఫ్యాక్టరీలను నెలకొల్పాలని ఉద్దేశించి నప్పుడు యీ రేవుల విస్తరణకు సంబంధించి త్వరలోనే నిర్ణ యాలు తీసుకోవాల్సి ఉంటుంది. ఆంధ్ర ప్రదేశ్లో ఎరువుల పరిశ్రమ విస్తరణ కార్యక్రమం, కాకినాడ' మచిలీపట్నం రేవుల విస్తరణపై ఆధారపడిఉంది.

## మన పరిశ్రమలు

## రాజమండ్రిలో గ్రాఫైట్ మూసల పరిశ్రమ

45 సంవత్సరాల క్రితం తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రిలో ఒకవ్యక్తి మట్టి గ్రాఫైట్ మూసల పరిశ్రమను నెలకొల్పిన విషయం భారత దేశంలోచాలా మందికి తెలియదు. ఈ పరిశ్రమ క్రమంగా అభివృద్ధి చెందుతూ ప్రస్తుతం రాజ మండ్రిలో దాదాపు 30 యూనిట్లు, సామర్లకోటలో మూడు, విజయవాడలో రెండు, విశాఖ పట్నంలో ఒకటి, కాకినాడ సమీపంలో ఒకటి ఉన్నాయి.

ఈ రంగంలో సాంకేతిక పరిజ్ఞానాన్ని మరింతగా పొంది యీ పరిశ్రమాభివృద్ధి క్రమంగా ఉచ్చదశను అందుకుంటూ మొత్తం భారత దేశంలో రాజమండ్రి, మట్టి గ్రాఫైట్ మూసలకు ప్రధాన కేంద్రంగా ప్రఖ్యాతి వహిస్తున్నది.

కుటీర పరిశ్రమగా యిది అభివృద్ధి చెందడం యీ పరి శ్రమ ప్రత్యేకత. చెక్క చట్రాలుగల యిత్తడి పోత వస్తువులో చేతితో ఒత్తి యీ మూసలను తయారు చేస్తారు.

ఈ కుటీర పరిశ్రమకు సాంకేతిక సహాయం అందజేసే దృష్టితో పరిశ్రమల శాఖ, 1958 లో రాజమండ్రిలో గ్రాఫైట్ మూసల యూనిటును ప్రారంభించింది. ఈ యూనిటు వివిధ పరిమాణాలలో గ్రాఫైట్ మూసలను తయారు చేయడం లోను, ప్లాస్టిక్ పోతవస్తువులన వినియోగించి డబుల్ పిల్లర్ జిగ్గర్ జాలీపై వంకీలు గల కొలిమికి ఉపయోగపడే ప్రత్యేక మూసలను తయారు చేయడంలోను ప్రదర్శనలను విజయ వంతంగా నిర్వహించారు. అనేక మంది స్థానిక పరిశ్రమ దారులు కూడ యీ యంత్రాలను నెలకొల్పి యీ యూనిటు సహకారంతో పెద్దసైజు మూసలను తయారు చేస్తున్నారు.

మూసలను కాల్చి, పొడిగా ఉంచడం గ్రాఫైట్ మూసల తయారీలో మరొక ముఖ్యమైన అంశం. ఈ విధంగా ఎలా చేయగలుగుతారనే విషయాన్ని యీ యూనిటు ప్రదర్శన ద్వారా తెలియజేస్తున్నది.

## ఖనిజాల అన్వేషణకు విమానాలద్వారా సర్వే

కేంద్ర ఉక్కు, గనులు, ఖనిజ శాఖల మంత్రి, డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, జులై 19 న హైదరాబాదులో విమానాల ద్వారా ఖనిజాల అన్వేషణకు ప్రారంభోత్సవం చేయడం ద్వారా భారత దేశంలో లభించే ఖనిజాలను క్రమ పద్ధతిలో సక్ర మంగా వినియోగించే కార్యక్రమానికి నాంది పల్కడం జరి గింది. వివిధ రాష్ట్రాలలో విభిన్న ప్రదేశాలలో విస్తరించి ఉన్న ఖనిజసంపద గల ప్రాంతాలలో, తొలిదశ కార్యక్రమం నిమిత్తం "ఎక్కువ ఖనిజాలు" గల ప్రాంతాలు మూడింటిని— ఆంధ్రప్రదేశ్ లో తూర్పు కడప ప్రాంతం, రాజస్థాన్ లో ఆర వల్లి, బీహారు పీఠభూమి—ఎెలక్టు చేయడం జరిగింది.

ఈ తొలిదశ కార్యక్రమం నిమిత్తం రు. 4.5 కోట్లు ఖర్చు అవుతాయని అంచనా వేశారు. అందులో రు. 2.6 కోట్లు విదేశ మారక ద్రవ్యం కావాల్సి యుంటుంది. ఈ మొత్తాన్ని యు. ఎస్. ఎ. ఐ. డి. ద్వారా ఋణరూపంలో అమెరికా ప్రభుత్వం యిస్తుంది.

భూమార్గంగా జరిగే సర్వే కన్నా విమానంద్వారా జరిగే సర్వేవల్ల ఖచ్చితమైన సత్వర ఫలితాలు కలుగుతాయి. డాక్టర్ చెన్నారెడ్డి, యీకార్యక్రమానికి ప్రారంభోత్సవం చేస్తూ, రెండున్నర సంవత్సరాలలో విమానాలద్వారా సర్వే కార్యక్రమం పూర్తి అవుతుందనీ, యిదే సంప్రదాయక పద్ధ తులద్వారా సుళువుగా రెండున్నర దశాబ్దాలు పట్టేదనీ అన్నారు.

ఈ కార్య క్రమానికి సంబంధించి, ఆర్థిక పరమైన అంశాలను పరిశీలించడం కూడ చాలా అవసరం. ఇనుము చేరని యితర లోహాల నిమిత్తం భారత దేశం పూర్తిగా యితర దేశాలపై ఆధారపడి ఉంది. తత్కారణంగా పారి

శ్రామికాభివృద్ధి అనుకున్న విధంగా జరగడం సాధ్యం కావడం లేదు. 1971 నాటికి మన దేశానికి వార్షికంగా రు. 200 కోట్ల విలువగల యీ లోహాలు అవసరమవుతాయని అంచనా వేశారు. విదేశ మారక ద్రవ్యంతో సహా రు 46 కోట్ల పెట్టుబడితో 5 సంవత్సరాల తర్వాత వార్షికంగా రు. 103 కోట్ల విలువ చేసే ఖనిజ సంపదను సంపాదించ వచ్చు. ఈ ప్రయోజనం, అనుకున్న గడువు కన్నా ముందుగా సిద్ధించ వచ్చు.

## నూలుమిల్లు : ఇతోధిక ఉద్యోగ అవకాశాలు

మన రాష్ట్రంలోని చేనేత పరిశ్రమ ప్రధాన కేంద్రాలలో నెల్లూరు జిల్లా ఒకటి. ఇక్కడ దాదాపు 20,000 మగ్గాలు ఉన్నాయి. దీనిద్వారా ఒక లక్ష మందికి ఉపాధి కలుగుతున్నది. ఇక్కడి నేత పనివారు, ప్రత్యేకంగా వెంకటగిరి తాలుకా నేత పనివారలు, విదేశ మార్కెట్టులను ఆకర్షించే ప్రత్యేకమైన డిజైనులలో ఉత్తమ శ్రేణి వస్త్రాలను ఉత్పత్తి చేయడంలో ప్రఖ్యాతి వహించారు.

మూడవ ప్రణాళికా కాలంలో సహకార రంగంలో నెలకొల్పే నిమిత్తం మంజూరు అయిన మూడు నూలు మిల్లులో ఒక మిల్లును నెల్లూరులో నెలకొల్పడం, కడప, చిత్తూరు జిల్లాలలోని నేత పనివారలకు వరప్రసాదం వంటిది. ఈ మిల్లులో 60 నుండి 100వ నెంబరు వరకు నూలు ఉత్పత్తి చేస్తారు.

ఈ పథకం అమలుకు రు. 70 లక్షలు ఖర్చు అవుతాయి ఈ మిల్లులో 12,000 కదుర్లు ఉంటాయి. మెరిసిరైజ్ చేసిన నూలును తయారు చేసే కోంబింగ్ ప్లాంటును దీనిలో నెలకొల్పడం ముఖ్యమైన అంశం. డైరెక్టర్ల బోర్డు దాదాపు రు. 11 లక్షలు పెట్టుబడి ధనం సేకరించింది. దానికి సమానమైన మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వం అందజేసింది. ముమ్ముందు యెక్కువ నిధులను యిస్తారని ఆశిస్తున్నారు.

ఈ కార్యక్రమం అమలులో ప్రాథమిక పనులు పూర్తి అయినాయి. దర్గామెట్టులోని పారిశ్రామిక వాడ సమీపంలో రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిన 23 ఎకరాల స్థలంలో సివిల్ పనులు ప్రారంభించారు. సంవత్సరాంతానికి యీ పనులు పూర్తి అవుతాయి.

## కాందిశీకుల పునరావాసం

పాకిస్థాన్, బర్మా సిలోను దేశాలనుండి వచ్చిన కాందిశీకులకు పునరావాసం కల్పించే పథకాన్ని కూడ యీ కార్యక్రమంతో కలిపారు. 200 గృహాలలో 200 కుటుంబాలకు వసతి సౌకర్యం కల్పించేదుకు అవకాశం ఏర్పరిచారు. దీని నిమిత్త కేంద్ర పునరావాస శాఖ రు 8.5 లక్షలు ఋణంగా యిచ్చింది. ఈ మొత్తాన్ని 20 సంవత్సరాలలో తిరిగి చెల్లించాల్సి ఉంటుంది.

ఈ మిల్లులోని వివీధ శాఖలలో కాందిశీకులకు సులువుగా ఉపాధి లభిస్తుందని ఆశిస్తున్నారు. ఈ మిల్లు ద్వారా కాందిశీకులకు, నేత పనివారలకు ఉపాధి లభించడమే గాక యితరులకు కూడ ప్రయోజనం కలుగుతుంది. ఈ మిల్లు ప్రాంతంలో అనుబంధ పరిశ్రమలను కూడ నెలకొల్పడం జరుగుతుంది.

# కుటుంబ నియంత్రణ

ఏపనయినా బాగా ముందూ వెనకా ఆలోచించిన మీదటనేచేస్తూండే గ్రామవాసులు, కుటుంబ నియంత్రణ గురించి జరిగే ప్రచారాన్ని అంతసులభంగా నమ్మలేదు. ఎన్నో సందేహాలను లేవదీస్తారు. ఈ కార్యక్రమానికి సంబంధించిన వివిధాంశాలను గురించి తరిచి తరిచి ప్రశ్నలు వేస్తారు.

ఈ ప్రశ్నలలో కొన్ని ఏమిటంటే :- ప్రాచీన కాలం నుంచి బిడ్డలు పుడుతూనే ఉన్నారు. మరి అలాంటిది కుటుంబ నియంత్రణతో అవసరం ఇప్పుడు, ఇంత హఠాత్తుగా ఎందుకు వచ్చింది ?

స్త్రీలు ఇదివరలో కంటె ఇప్పుడు ఎక్కువమంది బిడ్డలను కనటం లేదుకదా; మరి ఇప్పుడీ సలహా ఎందుకు ?

ప్రజలు ఇదివరలోకంటె మెరుగయిన సుఖతరమైన జీవితం గడపగలిగేందుకు కొత్త కొత్త అవకాశాలను కల్పిస్తూనే ఉన్నారు కదా, అలాంటిది కుటుంబ నియంత్రణ వంటి కార్యక్రమాన్ని చేపట్టవలసిన అగత్యం ఏమిటి ?

కుటుంబ నియంత్రణ విధానాన్ని అమలు జరపటం ప్రకృతిని వ్యతిరేకించటం కాదా ?

ప్రతివారూ కుటుంబ నియంత్రణను అమలు జరిపి బిడ్డలను కనటం మానివేస్తే అసలు మనుషులనేవారే లేకుండా పోరా?

ఈ విషయమై మతాలు చెప్పేదేమిటి? మతమనేది కుటుంబ నియంత్రణలను హర్షిస్తుందా ?

-ఈ ప్రశ్నలన్నిటికి సమాధానాలిచ్చి, యధార్థ విషయాలను సరియయిన విధంగా తెలియబరచటం ఎంతైనా అవసరం.

ఒకవైపు జనాభామాత్రం అతి శీఘ్రంగా పెరిగిపోతూ మరోవైపు మానవుని మనుగడకు అత్యావసరమైన గాలి, నీరు, భూమి వంటివి మాత్రం ఎదుగుబొదుగు లేకుండా ఉంటూండటం వల్లనే జనాభా పెరుగుదలను అరికట్టవలసిన అగత్యం ఏర్పడింది.

ప్రపంచజనాభా 1840 వ సంవత్సరంలో 100 కోట్లు అవడానికి ఎంతో కాలంపట్టింది. అయితే ఆతర్వాత ఒక్క శతాబ్దికాలంలోనే ఈ ప్రపంచ జనసంఖ్య రెట్టింపుఅయింది అప్పటినుంచి కేవలం 30 సంవత్సరాలు గడిచేసరికి జనసంఖ్య

300 కోట్లకు పెరిగింది. జనాభా పెరుగుదల ఇదే పద్ధతిన కొనసాగే పక్షంలో పదే పది సంవత్సరాలలో ప్రపంచ జనాభా 400 కోట్లు కాగలదు. ఈ శతాబ్ది ఆఖరుకి జనసంఖ్య 700 కోట్లకు పెరగగలదు.

భారతదేశంలో జనాభా పెరుగుదలకూడా మొత్తం ప్రపంచ జనాభా పెరుగుదల రేటుతో పాటుగానే ఉంటున్నది. 1921 లో మన జనాభా 25 కోట్లు మాత్రమే. అలాంటిది ఈ నాడు మన జనసంఖ్య 40 కోట్లుదాటింది. ఈ లెక్కన మరో 30 ఏళ్లలో ఈ సంఖ్య రెట్టింపు కాగలదు.

దేశానికి స్వాతంత్ర్యం లభించినప్పటినుంచికూడా ప్రజలకు చాలినంత నీరు, తిండి, బట్ట లభించేట్లూ, అనువయిన గృహవసతి లభించేట్లూచూడాలని పంచవర్ష ప్రణాళికలమేరకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. కాని జనాభా పెరిగిపోతూండటం మూలాన, ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచేందుకు జరిగే కృషి ఫలించకుండా పోతున్నది.

అయితే ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? దేశంలో సాధన సంపత్తి వృద్ధిచెందేరేటునే, జనసంఖ్యకూడా పెరగటం అవసరం. అలాకాక జనాభా పెరుగుదల రేటు ఎక్కువయ్యే పక్షంలో ప్రజలు కష్టాలపాలు కావలసివస్తుంది.

బిడ్డకూ బిడ్డకూ మధ్య తగినంత ఎడం ఉన్నట్లయితే, ఆ పుట్టే బిడ్డలు బాగా ఆరోగ్యంగా దృఢంగా ఉండగలరనీ, ప్రతిభావంతులు కాగలరనీ గ్రామ వాసులు తెలుసుకోవాలి. కాన్పుకూ కాన్పుకూ ఎడం ఉన్నట్లయితే తల్లుల ఆరోగ్యంకూడా మెరుగవుతుంది. వారు మరింత ఎక్కువకాలం జీవించగలరు. ఆదాయం పరిమితమైనపుడు హెచ్చుమంది సభ్యులుగల కుటుంబాల కంటె చిన్న చిన్న కుటుంబాలే సుఖపడగలవు.

స్త్రీలలో సంతానోత్పాదకశక్తి వెనకటికీ ఇప్పటికీ ఏమంత మారలేదన్నమాట నిజమే. కాని గ్రామస్థులు ఒక్కసంగతి మరచిపోతున్నారు. ఆరోగ్యరక్షణ కార్యక్రమాలు ఎన్నో అమలు జరుగుతూన్న మూలంగా, మరణాలరేటు బహుత్వరగా తగ్గిపోతున్నది. 1961లో మనదేశంలో, జనాభాలోని ప్రతి వెయ్యింటా 27గురు చనిపోతుండేవారు. అలాంటిది ఈ సంఖ్య ఇప్పుడు 16కు తగ్గిపోయింది. భారతీయుల సగటు ఆయుః పరిమాణం 1960లో 32 సంవత్సరాలు ఉండేది. అలాంటిది ఇప్పుడు 50 సంవత్సరాలకు పెరిగింది. అయితే ఇందువల్ల నిజంగా ప్రయోజనాలు లభించాలీ అంటే, మరణాల రేటును తగ్గించినట్లుగానే, జననాల రేటునుకూడా తగ్గించవలసి ఉంటుంది.

ప్రజల ఆయుఃపరిమాణాన్ని పెంచడానికీ, ఆరోగ్యస్థాయిని ఇనుమడింప జేయడానికీ, రకరకాల సాధన సంపత్తిలో హెచ్చు వాటా వ్యక్తులకు లభించేట్లు చూడడానికి గాను ఉద్దేశించిన కార్యక్రమమే కుటుంబ నియంత్రణ. ఈ కార్యక్రమంలో ప్రకృతి విరుద్ధమైన దేమీ లేదుకూడా. ఎండనుంచీ, చలినుంచీ, వర్షం నుంచీ మనం మనలను కాపాడుకుంటూనే ఉన్నాముకదా. మరి అలాంటప్పుడు, ముందు జాగ్రత్త కోసమై కుటుంబనియంత్రణకు పూనుకున్నప్పుడు అదేదో ప్రకృతి విరుద్ధమైన చర్య అని భావించ వలసిన అవసరం ఏముంది?

మన మతాలలోకూడ కుటుంబనియంత్రణ సూత్రాలను ఖండించి ఉండలేదు. తల్లిదండ్రులైనవారు బాధ్యతాయుతంగా వ్యవహరించటం ధర్మసూత్రంగా చెలామణి అవుతున్నది. కుటుంబ నియంత్రణలో ఇమిడివున్న సూత్రంకూడా ఇదే

*  *  *  *

కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ శాఖల మంత్రి డాక్టర్ ఎస్. చంద్రశేఖర్ విజయవాడ సమీపంలోని గన్నవరంలో అక్టోబరు 20వ తేదీన ట్యూబెక్టమీ శిబిర ఆసుపత్రి ప్రారంభోత్సవం చేశారు.

ట్యూబెక్టమీ విషయంలో ప్రజలు ఎటువంటి భయాందోళనలు చెందనవసరం లేదనీ, ఉదరానికి చేసే ఈ శస్త్ర చికిత్స వల్ల ఎలాంటి హానీ జరుగదనీ మంత్రి ప్రజలకు హామీ ఇచ్చారు.

జనాభా పెరుగుదలను అరికట్టి ఆర్థిక, సామాజిక రంగాలలో అభ్యున్నతి సాధించి దేశాన్ని అభివృద్ధి చెందిన రాజ్యాల సరసన చేర్చవలసి వున్నదని కేంద్ర మంత్రి ఉద్బోధించారు. ప్రతి సంవత్సరం 2 కోట్ల 10 లక్షల జననాలు, 80 లక్షల మరణాలు సంభవిస్తున్నాయి. కనుక యేటా నికరంగా 1 కోటి 30 లక్షల చొప్పున జనాభా పెరుగుతున్నది. ఈ పెరుగుదలను సగానికి తగ్గించవలసి వుంది. పిల్లలను కనే వయః వర్గంలోని తొమ్మిది కోట్ల మంది దంపతులు ఈ కార్యక్రమంలో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ పాల్గొనేటట్లు చేయడం ద్వారా దీనిని సాధించాలని మంత్రి అన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో కుటుంబ నియంత్రణ కార్యక్రమం పెద్ద ఎత్తున నిర్వహించబడుతున్నదని డాక్టర్ చంద్రశేఖర్ ప్రస్తుతించారు.

రాష్ట్ర ఆరోగ్య శాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షత వహించారు. ఈ ప్రాజెక్టును ప్రారంభించడానికి గత మూడు నెలలుగా సన్నాహాలు జరిగినవని ఆయన చెప్పారు. దేశంలో ఈ పద్ధతి అమలు జరగడం ఇదే ప్రథమమనీ, ట్యూబెక్టమి ఆపరేషన్లకు అవసరమైన సదుపాయాలన్నింటినీ కల్పించడానికి పూర్తి జాగ్రత్తలు తీసుకోవడం జరిగిందనీ శ్రీ నరసింహారావు తెలియజేశారు. గన్నవరం పంచాయతీ సమితివారు సమితి అధ్యక్షుడు డాక్టర్ సి. ఎల్. రాయుడు మార్గదర్శకత్వం క్రింద నిర్వహించిన సర్వేను బట్టి ఆ ప్రాంతంలో ముగ్గురు లేక అంత కంటే ఎక్కువ మంది పిల్లలను కలిగిన దంపతులు సుమారు 7000 మంది వున్నట్లు వెల్లడైందని మంత్రి వివరించారు. వారిని స్టెరిలైజేషన్‌కు ప్రోత్సహించడం అవసరమని అన్నారు. *

రాష్ట్రప్రభుత్వ బహుమతిపొందిన గ్రంథం

# టోకియో లేఖలు

అట్లూరి వెంకటేశ్వరరావు

టోకియో,
*25-8-1963*

## పిల్లల విద్య

చిరంజీవులయిన బాబులకు మీ నాయన దీవించి వ్రాయునది ఏమనగా-

ఇక్కడ నేను క్షేమంగానే ఉన్నాను. అక్కడ మీరందరు కులాసాగా ఉన్నారని అనుకుంటాను. మీ ఉత్తరము అందినది. అందలి విషయాలు చూసి చాల సంతోషించితిని. మీరిద్దరు బాగుగ చదువుచున్నందులకు చాల ఆనందించితిని. ఇక్కడి పిల్లలనుగూర్చి అడిగారు కదూ! ఈ ఉత్తరంలో జపాను దేశపు పిల్లలను గూర్చి వ్రాస్తాను.



**తల్లుల వీపులమీద పాపలు:-** ఇక్కడ పిల్లలు చాల ఆరోగ్యంగా ఉంటారు. దాదాపు తమంతట తాము నడుచువరకు తల్లుల వీపులపై ఉయ్యాలలాగుండు జోలెలో కూర్చుందురు. అట్లా కూర్చుని నిద్రపోవుదురు తల్లులు కూర్చున్నప్పుడు కూడ వీపుపైననే ఉందురు. వారి కది అలవాటు. అట్లుండుటవలన తల్లులు చేతులతో వేరే పనులు చేసికొనుటకు వీలుగా ఉండును. మన దేశంలో పిల్లలను ఎత్తుకొని వేరే పని చేయుటకు వీలుండదు. కాని ఇక్కడ పిల్లలు వీపుమీద ఉండగానే అన్ని పనులు సులువుగానే చేసికొనగలరు. అట్లే ప్రయాణము కూడ చేయుదురు. తల్లులకు పిల్లలకు ఇది అలవాటయిపోవును. ఈ ప్రక్క ఛాయా చిత్రములో పిల్లను ఎత్తుకొన్న తల్లిని చూడవచ్చును.

**పిల్లల ఆహారం:-** ఇక్కడ పిల్లల ఆహారాన్ని గూర్చి తల్లి తండ్రులు చాల శ్రద్ధ తీసికొందురు. చాల పుష్టికరమయిన ఆహారము నిచ్చుటవలన ఇప్పటి తరమువారు ఇంతకుముందు తరము వారికంటె నాలుగు లేక ఐదు సెంటిమీటరులు పొడుగు పెరుగుచున్నారు. సామాన్యముగా జపాను దేశస్థులు పొట్టివారు. కాని ఇప్పటి తరమువారు దాదాపు మనదేశస్థులంత ఎత్తు పెరుగుచున్నారు. ఇక్కడి పిల్లల ప్రవర్తనకు తల్లిదండ్రులు పూర్తి బాధ్యత వహింతురు. పిల్లలుకూడ తల్లిదండ్రుల మాట జవదాటరు. ఈ మధ్య ఒక 18 మాసముల ఆడపిల్ల ఆడుకొనుచు రోడ్డుమీదికి వచ్చి లారీక్రిందపడి మరణించినది. ఆ మరణాన్నిగూర్చి దర్యాప్తు జరిపిన అధికారులు లారీ డ్రయివరును, ఆ పిల్ల తల్లిని దోషులుగా నిర్ణయించిరి. ఆ తల్లి కనుక తగు జాగ్రత్త తీసుకొనినయడల ఈ ప్రమాదము జరిగియుండదని వారి అభిప్రాయము. దీనినిబట్టి తల్లిదండ్రుల బాధ్యతను అర్థము చేసికొనవచ్చును

**చదువురానివారు లేరు:-** ఈ దేశములో నిరక్షరాస్యత లేనే లేదు. అనగా ఈ దేశములో చదువురానివారు లేరు. ఇటువంటి పరిస్థితి మన దేశానికి ఎప్పుడు వస్తుందోగద! పిల్లలను బడికి పంపించనియెడల తల్లిదండ్రులు శిక్షార్హులు. ఇక్కడి పిల్లలకు తొమ్మిదవ తరగతి వరకు విద్యను ఉచితంగా నేర్పుదురు. అనగా ఐదు- పధ్నాలుగు సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్లలందరూ తప్పక బడికి వెళ్లి చదువుకొనవలెను. దీని మూలంగా ఈ దేశములో తొమ్మిదవ తరగతికి తక్కువ చదివినవారు లేనేలేరు. ఐదు సంవత్సరములకు తక్కువ వయస్సు గలవారిని ప్రాథమిక పాఠశాలలో చేర్చుకొనరు. కాని ఇక్కడ ఎక్కువమంది తల్లిదండ్రులు ఉద్యోగములు చేయుటచే పిల్లలను చాల చిన్న వయస్సులోనే, చిన్న పిల్లల బడిలో—కిండర్ గార్డెన్‌లో—చేర్చెదరు. అక్కడ పాటలు ఆటలు నేర్పి ఆడింతురు. తల్లులు పనిలోనికి వెళినప్పుడు పిల్లలను అక్కడ వదలి సాయంత్రము తిరిగి వచ్చునప్పుడు

తీసుకొని వచ్చెదరు. అందువలన పిల్లలు చాల చిన్నవయస్సు నుండియే స్వతంత్రముగా ఎవరిపై ఆధారపడకుండ జీవించుటకు అలవాటు పడతారు.

ఐదవ సంవత్సరము రాగానే ప్రాథమిక పాఠశాలలో చేర్చెదరు. ఇక్కడ చదువు చాలా కష్టంగా ఉంటుంది. ఈ ఉత్తరంలోని చిత్రాలలో ప్రాథమిక పాఠశాల విద్యార్థి, విద్యార్థినులు ఉన్నారు. ప్రతివారికి ఒక పెద్ద తోలుసంచి, దానినిండ పుస్తకాలు ఉంటాయి. ఆ సంచి పడిపోకుండ వీపుకు గట్టిగా కట్టుకొనవచ్చును.

*అంతా ఒకటే:—* ఈ దేశంలోని విద్యార్థులందరికి ఒకే రకమయిన దుస్తులు, ఒకేరకమయిన పుస్తకాలు, ఒకేరకమయిన సంచులు— అంతా ఒకేరకము. ఇంత చిన్న వయస్సులోనే పిల్లలందరిని ఒకేవిధముగా తయారుచేయుటవలన వారు పెద్దవారయిన పిదప సుశిక్షితులయిన పౌరులుగా తయారయి దేశ పురోగమనానికి ఎంతో సహాయ పడుచున్నారు. మన దేశంలోగూడ ఈ విధమైన విద్యాభ్యాసం ఉండాలంటారుగదూ! ఇంతచిన్న వయస్సులోనే ఎవరి సహాయంలేకుండా అతి జన సమర్దమయిన పట్టణంలో అన్ని రహదారులను రైలు పట్టాలను దాటి ఒంటరిగా పిల్లలు బడికి వెళ్లడంచూస్తే చాల ముచ్చటగా ఉంటుంది. ఇక్కడి రహదారులను దాటడం అంటే పెద్దవారికే భయం కాని పిల్లలు రహదారులను దాటు గుర్తులను జాగ్రత్తగా చదివి పచ్చదీపము వచ్చిన పిదప అన్నివైపుల చూచుకొని, రోడ్డు దాటుటకు నిర్దేశించిన ప్రదేశాలలో ఒక ప్రక్కనుండి ఇంకొక ప్రక్కకు వెళ్లుదురు. ఇక్కడ కార్లు చాల ఎక్కువ. ఒక నిముషం ఆగితే దాదాపు ఒక మైలు దూరము కారులన్ని స్తంభించిపోవును. అటువంటి జన సమ్మర్దమయిన రహదారులమీద కూడ ఎప్పుడు ప్రమాదాలు జరుగవు. అందరు వారి విధులను అర్థము చేసికొని రహదారి దీపముల రంగులను బట్టి రహదారులను దాటుచుందురు. తల్లిదండ్రులు కూడ పిల్లలను గూర్చి ప్రమాదాలను గూర్చి భయపడరు. అంత చిన్నతనమునుండియే సుశిక్షితులుగాను, గాఢమైన ఆత్మవిశ్వాసముతో గూడిన పౌరులుగాను తయారుచేయుచున్నారు.

*అబద్ధం అంటే :—* ప్రాథమిక విద్య అయిన తరువాత పదకొండవ సంవత్సరము వారు ఉన్నత పాఠశాలలో చేరుతారు. ఈ విద్యార్థులు, విద్యార్థినులందరు ఇదేవిధముగా దుస్తులు ధరింతురు. విద్యార్థులు పుస్తకముల సంచిని భుజాలకు తగిలించుకొందురు. విద్యార్థి ఏక్లాసు చదువుకున్నది అతని కోటు కాలరుపై ఉండు గుర్తు తెలియచేస్తుంది. అతని స్కూలు పేరు టోపీపై నున్న గుర్తు తెలియచేయును. ఇక్కడ విద్యార్థులందరికి ఒకేరకముగా తల వెంట్రుకలను కత్తిరించెదరు. తల దువ్వుకొనుటకు సరిపోయినంతటి వెంట్రుకలు ఉంచుకొనిరు. అందువలన తల దువ్వుకొను ప్రసక్తి లేనేలేదు. ఇక్కడి క్షౌరశాలల యజమానులు వేరే విధముగా వెంట్రుకలు కత్తిరించుటకు నిరాకరించెదరు. అట్లు వారు అందరికి ఒకేరకమయిన పద్ధతి అనుసరించని యెడల వారి అనుమతి పత్రములు రద్దుపరచబడును. ఇక్కడ పిల్లలకు అబద్ధమాడడం అంటే ఏమిటో తెలియదు. ఎప్పుడూ నిజమునే చెప్పుదురు చిన్న వయస్సునుండియే మంచి అలవాట్లను నేర్పుట వలన వారు స్వశక్తిపై ఆధారపడి జీవించుటకు కావలసిన అనుభవమును గడించుచున్నారు.



పాఠశాల దుస్తుల్లో విద్యార్థి

*అలంకరణ అంత ముఖ్యంకాదు :—* ఈ దేశములో విద్యార్థినులు గూడ ఇదే విధముగా దుస్తులను ధరింతురు. ఆడపిల్లలు పద్దెనిమిది సంవత్సరములు వచ్చువరకు ఇటువంటి దుస్తులనే ధరింతురు. అనగా ఉన్నత పాఠశాల చదువు పూర్తగువరకు వారికి వేరు దుస్తులు ఉండవు దీనివలన తల్లిదండ్రులకు ఖర్చు చాల తక్కువ. అన్నివేళలలోను; అన్ని సందర్భములలోను ఈ దుస్తులనే ధరింతురు. వీరిపుస్తకముల సంచులు కూడ ఒకేరకముగా నుండును. సామాన్యముగా ప్రాథమిక పాఠశాలలో ప్రవేశించునప్పుడు కొన్న సంచిని ఉన్నత పాఠశాలలో చేరగనే మార్చుదురు. ఉన్నత పాఠశాలలో ప్రవేశించగనే కొన్న సంచిని ఆ విద్య పూర్తగువరకు వాడెదరు. ఆడపిల్లల అలంకరణలను తల్లిదండ్రులుగాని, ఉపాధ్యాయులుగాని ప్రోత్సహించరు. అందువలన తలవెంట్రుకల అలంకరణ పద్దెనిమిది సంవత్సరములు వచ్చువరకు మొదలు పెట్టరు. ఎత్తు మడమల కాలిజోడునుకూడ ధరించరు. ముఖమునకుగాని, పెదిమలకు గాని రంగులు వేయరు. దీని అంతరార్థము వ్యక్తిగత అలంకరణకన్న విద్యావ్యాసంగానికే ప్రాధాన్యమిచ్చుట దీని అంతరార్థము.

*సెలవుల్లో డబ్బు సంపాదన:—* బడికి శలవలు ఇచ్చిన వెంటనే ఉన్నత పాఠశాల విద్యార్థులు, విద్యార్థినులు ఎక్కడో ఒకచోట



*జాగ్రత్తగా రోడ్డు దాటుతున్న విద్యార్థి*

పనికి కుదిరి పనిచేసి డబ్బు సంపాదించు కొందురు. సామాన్యంగా స్కూలుకు శలవులు ఇచ్చినప్పుడు ఏదో ఒక ముఖ్యమయిన పండుగగాని విశేషముగాని ఉండును. అట్టి రోజులలో దుకాణాలలో రద్దీ ఎక్కువగా నుండును. అందువలన దుకాణదారులు కొద్దికాలముపాటు అదనపు సిబ్బందిని నియమింతురు. అట్లు పనిచేయుటవలన వారికి బాధ్యత, వినయవిధేయతలు అలవడును.

*ఇండ్లలో పరిశోధనలు* :- ఇక్కడ విద్యార్థులు, విద్యార్థినులు తమ తీరక వేళలను వృధాచేయరు. సామాన్యంగా ఇంటివద్ద చేయవలసిన అనేకపనులలో తల్లిదండ్రులకు సాయపడుదురు. ఇదిగాక కొద్ది ఖర్చుతో సమకూర్చగల వైజ్ఞానిక పరికరాలను దుకాణములలో కొని వాటిని తయారుచేసి, వాటిమీద ప్రయోగములు జరుపుదురు. ప్రతివారికి ఏదో ఒక అభిమాన పాత్ర్యముండును. ఆ అభిమాన పాత్ర్యమునకు సంబంధించిన అనేక విషయాలను కష్టపడి చదివి నేర్చుకొని ప్రయోగములను జరిపి సంతృప్తిచెందుదురు. దీనిని ప్రోత్సహించుటకు తల్లిదండ్రులు అప్పుడప్పుడు వారికి కావలసినడబ్బు యిచ్చెదరు. దుకాణాలలో కూడ చాల చౌకధరలకు అనేక విజ్ఞాన పరిశోధనలకు పనికివచ్చు వస్తువులను అమ్ముచుందురు. ఉదాహరణకు ;-కారు, రైలు, ఓడ, విమానము, విద్యుత్ గంట, రేడియో మొదలయిన పరికరాలను సొంతముగా తయారుచేసుకొనుటకు కావలసిన విడిభాగాలన్నియు ఒక పెట్టెలో పెట్టి ఆ వస్తువులను ఎట్లు బిగించవలెనో తెలుపుబొమ్మలను అందులో పెట్టి అమ్ముదురు. పిల్లల అభిరుచినిబట్టి, వయస్సునుబట్టి వారికి కావలసిన వస్తువులను దుకాణములలో కొనుక్కొన వచ్చును. అట్లు కొన్న విడిభాగాలను సమీకరించి ఒక వస్తువుగా సమకూర్చుట వలన శాస్త్ర విజ్ఞానము అభివృద్ధి చెందును. అదే సమయములో ఇది ఒక ఆటలాగుండుట వలన అలసటగా తోచదు. పైగా సొంతముగా వస్తువులను తయారుచేసికొను నేర్పువచ్చినదను ఒక సంతృప్తి వారి ముఖములో గోచరించును. అంతచిన్న వయస్సునుండి ఈ విధముగా శాస్త్ర విజ్ఞానములో అభిరుచి కలిగించుటవలన, వారు పెద్దవాళ్ళయిన పిదప వారి దేశ పారిశ్రామికాభివృద్ధికి తో డ్పడుచున్నారు.



*పాఠశాల విద్యార్థినులు*

ఇంతవరకు వారి పిల్లల ఆటలను గూర్చిగాని, విలాసయాత్రలను గూర్చిగాని, వేడుకలను గూర్చిగాని వ్రాయలేదని మీరు అనుకొంటుండ వచ్చును. ఆ విషయములన్నింటిని ప్రత్యేకంగా తదుపరి ఉత్తరములో విశదీకరిస్తాను. ఈ ఉత్తరము అందిన వెంటనే మీ క్షేమములను తెలుపుచు ఉత్తరము వ్రాస్తారుకదూ!

ఇట్లు
మీ ప్రియమైన నాన్న

# బాలభారతి



కుమారి చారుమతి శర్మ

కుమారి చారుమతిశర్మ హైదరాబాదులోని సెంయిట్ జార్జి బాలికల గ్రామర్‌స్కూల్ విద్యార్థిని. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జనసంబంధశాఖ నిర్వహించిన ఇంగ్లీషు లేఖా రచన పోటీలో ప్రథమ బహుమతి పొందిన కుమారిశర్మ, 1956 అగస్టు 17వ తేదీన అస్సాంలోని షిల్లాంగులో జన్మించింది. ఆమె తండ్రి ఇండియన్‌సర్వే యూనిటులో ఉద్యోగిగా ఉన్నారు. 1960లో ఘనా (పశ్చిమఆఫ్రికా)లో విద్యాభ్యాసం చేసిన తర్వాత 1962 లో మస్సోరివచ్చి జెసెస్ అండ్ మే కాన్వెంటు పాఠశాలలో చేరింది. హైదరాబాదు వచ్చినతర్వాత కుమారి చారుమతిశర్మ 1964 లో సెయింట్‌జార్జి బాలికల గ్రామర్‌స్కూల్‌లో చేరింది. ఆమె యిప్పుడు 8వ తరగతి చదువుతూంది వివిధ దేశాల నాణేలు సేకరించడంలో ఆమెకు ఆసక్తి ఎక్కువ. ఆమెతన సమయాన్ని చాలావరకు పుస్తకపఠనంలో గడుపుతుంది. ఇనిడ్ బ్లైటన్, ఆర్. ఎల్. స్టివన్‌సన్ ఆమె అభిమాన రచయితలు. పాఠశాలలో జరిగే వక్తృత్వ పోటీలలో ఉత్సాహంగా పాల్గొంటుంది. "గణిత శాస్త్రంలో ఉన్నత విద్య అభ్యసించి ఐ. ఎ. ఎస్. పరీక్షలలో పాల్గొనాలని నా అభిలాష" అని ఆమె అంటుంది.

## కుమారి అనసూయాదేవి

కుమారి అనసూయాదేవి, జనసంబంధ శాఖ యిటీవల నిర్వహించిన తెలుగు లేఖా రచనపోటీలో ప్రథమ బహుమతి గెలుచుకుంది. 12 సంవత్సరాల కుమారి అనసూయ, హైదరాబాదులోని వెంకట్రావుస్మారక ఉన్నత పాఠశాలలో 11వ తరతగతి చదువుతున్నది. మ. ఘ. వ. నిజాం స్కాలర్‌షిప్పు సంపాదించిన ఘనత ఆమెకు దక్కింది. స్థానిక సంస్థలు నిర్వహించే సాంస్కృతిక కార్యక్రమాలలో ఆమె తరచుగా పాల్గొంటుంది. ఆమె అనేక వక్తృత్వపోటీలలో పాల్గొని బహుమతులు సంపాదించింది. గాత్ర సంగీతంలో ఆమెకు ఎక్కువ అభిమానం ఉంది "అన్ని వృత్తులలోను ఉపాధ్యాయ వృత్తి చాలా ఉన్నతమైంది. ఉపాధ్యాయనిగా, రచయిత్రిగా, సాంఘిక సేవ కార్యకర్తగా ఉండాలని నా అభిలాష'' అంటుంది కుమారి అనసూయ.

## బి. దయానంద్

12 సంవత్సరాల వయసుగల బి. దయానంద్, జన సంబంధశాఖ యిటివల జరిపిన తెలుగు లేఖా రచన పోటీలో బహుమతి పొందాడు. హైదరాబాదులోని వెంకట్రావు స్మారక ఉన్నత పాఠశాలలో 10వ తరగతి చదువుతున్నాడు. వివిధ పాఠశాలలు నిర్వహించిన వక్తృత్వ పోటీలు, వ్యాసరచన పోటీలలో ఆయన తరచుగా పాల్గొంటాడు. సంగీత నాటక పోటీలలో కూడ ఉత్సాహంగా పాల్గొంటూ ఉంటాడు. దయానంద్ అనేక బహుమతులను సాధించాడు. పుస్తక పఠనం, సంగీతం ఆయన అభిమాన విషయాలు.



కుమారి మీనా చౌధరి

కుమారి మీనాచౌధరి, సెయింట్‌జార్జి బాలికల గ్రామర్ స్కూల్ విద్యార్థిని. జనసంబంధశాఖ యిటీవల నిర్వహించిన హిందీ లేఖారచన పోటీలలో ప్రథమ బహుమతి సాధించింది. 1955 సెప్టెంబర్ 3వ తేదీన ఈమె జన్మించింది. హైదరాబాదులోని సమాజాభివృద్ధి జాతీయ సంస్థ డైరెక్టర్ డా॥ టి.పి.ఎస్. చౌధరి కుమార్తె. ఢిల్లీలో ప్రారంభవిద్య అభ్యసించిన తర్వాత తల్లి దండ్రులతో హైదరాబాదు సెయింట్‌జార్జి బాలికల గ్రామర్ స్కూల్

లో చేరింది. ఆమెయిప్పుడు 8వ తరగతి చదువుతున్నది. ఇంగ్లీషు, హిందీ భాషాభ్యాసంలో ఎక్కువ ఆసక్తిగల కుమారి చౌధరికి సంస్కృతభాష చాలా యిష్టం. ప్రఖ్యాత పురుషుల జీవిత చరిత్రలను చాలా ఆసక్తితో చదువుతుంది. అటువంటి పుస్తకాలనెన్నింటినో సేకరించింది. నాటకాలు, వ్యాసరచన, ఫొటోగ్రఫీలు ఆమె అభిమాన విషయాలు. "వైద్యవృత్తినాకు చాలాయిష్టం. విద్యాభ్యాసం పూర్తిచేసినతర్వాత ఆవృత్తిలో చేరుదామని ఆశిస్తున్నాను" అంటుంది ఆమె.

## కుమారి శోభాదేవి

కుమారి శోభాదేవి, హైదరాబాదులోని వెంకట్రావు స్మారక ఉన్నత పాఠశాలలో 11వ తరగతి విద్యార్థిని. జనసంబంధశాఖ యిటీవల నిర్వహించిన హిందీ లేఖా రచన పోటీలో ద్వితీయ బహుమతి సంపాదించింది. కుమారి శోభ, మార్కెటు సూపరింటెండెంటు శ్రీశివశంకర్‌లాల్ కుమార్తె. 12 సంవత్సరాల వయస్సు. నగరంలోని వివిధ సంస్థలు నిర్వహించిన అనేక వక్తృత్వ, వ్యాస రచనా పోటీలలో పాల్గొని ఎన్నో బహుమతులను సంపాదించింది. హిందీ మాతృభాష అయినా తెలుగు, ఇంగ్లీషు భాషలను బాగా అభ్యసించి, ఆయా భాషల వక్తృత్వ, వ్యాస రచనా పోటీలలో బహుమతులను పొందింది. హైదరాబాదు, షాలిబండాలోని భారత గుణవర్ధక సంస్థ హిందీ ప్రచారసభ, లాల్‌బహదూర్ శాస్త్రి సంస్థ, దక్షిణభారత హిందీ ప్రచారసభ వంటి అనేక స్థానిక సంస్థలు నిర్వహించిన వివిధ పోటీలలో పాల్గొని అనేక బహుమతులను గెలుచుకుంది. ఆమె తరచుగా చిన్నకథలు, కవిత వ్రాస్తూ ఉంటుంది. గాత్ర సంగీతంలో అభిమానం ఎక్కువ.

"రచయిత్రిగా, డాక్టరుగా, సాంఘిక సేవా కార్యకర్తగా రూపొందాలని ఉంది'' అని అంటుంది.

## మహమ్మద్ అలీముల్లాఖాన్

మహమ్మద్ అలీముల్లాఖాన్, హైదరాబాదు జంగంమ్మెట్ లోని ప్రభుత్వ అప్పర్ ప్రైమరీ పాఠశాల 7వ తరగతి విద్యార్థి. జనసంబంధశాఖ నిర్వహించిన ఉర్దూ లేఖా రచనపోటీలో బహుమతి అందుకున్నాడు. 10 సంవత్సరాల వయసు ఆయన తండ్రి మహారాష్ట్ర రాష్ట్రంలో తంతి, తపాల శాఖలో ఉద్యోగి. తన పాఠశాలలో నిర్వహించబడిన అనేక పోటీలలో ఆయనకు బహుమతులు లభించాయి. అయితే యితర ప్రదేశాలలో జరిగిన పోటీలలో పాల్గొని బహుమతిపొందడం యిదే ప్రథమం. కుమార్ ఖాన్ మంచిక్రీడాకారుడు. పాఠశాల కబడ్డీజట్టుకు నాయకత్వం వహించాడు. ఫుట్‌బాల్, క్రికెటు కూడ బాగా ఆడుతాడు. పాఠశాల నిర్వహించే వివిధ కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొంటాడు. 6వ తరగతిలో ఉన్నప్పుడు పాఠశాల విద్యార్థి సంఘం ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించాడు. ''ఇది ఆఖరు సంవత్సరం. బోర్డు పరీక్షకు సిద్ధంకావాల్సిఉంది. అందువల్ల యితర కార్యక్రమాలలో పాల్గొనడం తగ్గించి పరీక్షలో ఉన్నత శ్రేణి సాధించాలని కృషిచేస్తున్నాను'' అంటాడు ఖాన్.

బి.ఎం.కె. మీనన్



బి.ఎం.కె. మీనన్, హైదరాబాదులోని లిటిల్ ఫ్లవర్ స్కూల్ విద్యార్థి. జనసంబంధశాఖ, యిటీవల నిర్వహించిన క్రెయాన్ పెయింటింగ్ పోటీలో ఆయనకు ప్రథమ బహుమతి లభించింది. 10 సంవత్సరాల వయసు గల మీనన్ VI స్టాండరు చదువుతున్నాడు. కుమార్ మీనన్ అనేక పోటీలలో పాల్గొని బహుమతులను పొందాడు. వివేకవర్ధనీ విద్యాసంఘ లలితకళా విభాగం నిర్వహించిన అంతర్ పాఠశాల బాలల డ్రాయింగ్ పోటీలలో మీనన్ ప్రథమ బహుమతి సాధించాడు. డ్రాయింగ్, పెయింటింగ్ ఆయనకు అత్యంత అభిమాన విషయాలు. కథలు, హాస్యకథలు చదవడం చాలా యిష్టం.

కుమార్ ప్రదీప్‌షిర్, హైదరాబాదులోని లిటిల్‌ఫ్లవర్ ఉన్నతపాఠశాల 6వ తరగతి విద్యార్థి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జనసంబంధశాఖ నిర్వహించిన పెయింటింగ్‌పోటీలో ఆయన బహుమతి పొందాడు. ఇంగ్లీషు, హిందీపోటీలలో కుమార్‌షిర్ అనేక బహుమతులను సంపాదించాడు. పాఠశాలలో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలలో, ఆటలపోటీలలోను చాలా ఆసక్తితో పాల్గొంటాడు. మంచి క్రికెట్ ఆటగాడు. స్థానిక బాలల క్రికెట్ జట్టుకు నాయకత్వం కూడ వహించాడు. అతను మంచి చిత్రకారుడుకూడ, అతని పెయింటింగులకు పాఠశాల ఉపాధ్యాయుల, తోటి స్నేహితుల మన్ననలు లభించాయి. తన సమయాన్ని పుస్తక పఠనంలో గడపుతాడు. మంచి నడవడి అలవాట్లు గలవాడు.

## అనిల్ కుమార్

హైదరాబాదులోని సెయింట్ పీటర్స్ ఉన్నత పాఠశాలలో 6వ తరగతిలో విద్యాభ్యాసం చేస్తున్న అనిల్‌కుమార్, ఆ పాఠశాలకు చెందిన అనేకమంది విద్యార్థులకు, ఉపాధ్యాయులకు అంతగా పరిచితుడు కాడు. అయితే యిటీవల జన సంబంధ శాఖ నిర్వహించిన ఆర్ట్ పోటీలలో రెండవ బహుమతి సంపాదించి వెలుగులోకి వచ్చాడు. అమాయకత్వం ఉట్టిపడే యీ బాలుడు 1961 లో పాఠశాల కిండర్‌గార్టెన్ తరగతిలో చేరాడు. విద్యాభ్యాసంలో ప్రత్యేకత యేమిలేకున్నా స్వతస్సిద్ధమైన కళాకారుడు. మంచి అవకాశం, ప్రోత్సాహం లభిస్తే కళారంగంలో ప్రఖ్యాతి వహించగల బుద్ధిశాలి.

## నారీలోకం

స్వాతంత్ర్యం బహుముఖమైనది. ఓటుహక్కు, రాజకీయ పార్టీల స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం, తనకు అభీష్టమైనవృత్తిని స్వీకరించే స్వాతంత్ర్యం, న్యాయాధికృత, స్త్రీ, పురుషులకు సమాన హక్కులు, సమాన ఆర్థిక విద్యావకాశాలు స్వాతంత్ర్యం ద్వారా లభించాయి. ప్రపంచంలోని అతి పురాతనమైన ప్రజాస్వామిక దేశాలలోగల అన్ని విధాలైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు 20 సంవత్సరాల ప్రాయంగల స్వతంత్ర భారత దేశంలోకూడా చూడవచ్చు.

భారత రాజ్యాంగచట్టం క్రింద పురుషులతోపాటు స్త్రీలు కూడ సమాన హక్కులను అనుభవించవచ్చు. సవరించబడిన హిందూశాస్త్రం అనుసరించి స్త్రీలకు వారసత్వపు హక్కు, బహుభార్యా నిషేధ హక్కులు లభించాయి.

ఆర్థిక, విద్యారంగాలలో క్రొత్తగా లభించిన అవకాశాలను స్త్రీలు పూర్తిగా వినియోగించుకుంటున్నారు.

1966లో కళాశాలలో 3 లక్షలకుపైగా బాలికలు చేరారు. 1961 లో గ్రామీణ, పట్టణప్రాంతాలలో 5.9 కోట్లమంది స్త్రీ కార్యకర్తలు ఉన్నారు. ఉపాధ్యాయవృత్తి, వైద్యవృత్తులలోనే గాక ఇంజినీరింగ్, అణుశక్తి రంగాలలోకూడ స్త్రీలు పాల్గొంటున్నారు. సాంఘిక సేవా సంస్థలలో స్త్రీలు విరివిగా పాల్గొంటున్నారు.

## కార్మిక కల్యాణం

### 1966వ సం ఆంధ్రప్రదేశ్ దుకాణాలు, వ్యవస్థ చట్టం

వి. శేషాద్రి

1966 వ సం॥ ఆంధ్రప్రదేశ్ దుకాణాలు, వ్యవస్థల చట్టం, మన రాష్ట్రంలో దుకాణాలు, వ్యాపారసంస్థలకు వర్తించే ముఖ్యమైన చట్టం. ఈ చట్టం అమలుకు పూర్వం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో రెండు విభిన్న చట్టాలు అమలులో ఉన్నాయి. ఆంధ్రప్రాంతానికి వర్తించే చట్టాన్ని 1947 వ సం॥ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) దుకాణాలు వ్యవస్థల చట్టంగాను వ్యవహరించేవారు. ఒకే రాష్ట్రంలో రెండు విభిన్న చట్టాలు అమలులో ఉండడంవల్ల న్యాయపరముగా చిక్కులు ఏర్పడుతున్నాయి. వివిధ విషయాలలో రాష్ట్రమంతటికి ఒకే శాసనం వర్తించడానికి వీలుగా యీ రెండు చట్టాలను ఏకీకృతం చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రయత్నించింది. తత్ఫలితంగానే రాష్ట్రంలోని దుకాణాలు, వ్యవస్థలు యితర సంస్థలన్నిటికీ వర్తించే చట్టాన్ని రూపొందించారు. ఈ ఏకీకృత చట్టాన్ని 1966 వ సం॥ ఆంధ్రప్రదేశ్ దుకాణాలు, వ్యవస్థల చట్టంగా వ్యవహరిస్తున్నారు. 1967 జూన్ 15 వ తేదీ నుండి యీ చట్టం అమలులోకి వచ్చింది.

### చట్టం లక్ష్యాలు

దుకాణాలు, వ్యవస్థలు, యితర సంస్థలలో వ్యక్తుల నియామకాలకు సంబంధించిన నియమ నిబంధనలను క్రమబద్ధం చేయడమే యీ చట్టం ప్రధానలక్ష్యం. దుకాణాలు తెరవడం, మూయడంతోసహా దిన వార పని గంటలను, విరామ సమయాలు, వేతనాల చెల్లింపు, ఓవర్ టైమ్ వేతనం, గ్రాట్యుటీ చెల్లింపు మొదలైన విషయాలను యీ చట్టం ద్వారా క్రమబద్ధం చేస్తారు. ఈచట్టం వర్తించే దుకాణాల పేర్లను రిజిస్టరు చేయడానికి కూడ యీ చట్టం వీలుకల్పిస్తుంది. ఈచట్టం అమలుకుముందు 1947 వ సం॥ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతం) దుకాణాలు, వ్యవస్థలచట్టం, 1951 వ సం॥ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణాప్రాంతం) దుకాణాలు, వ్యవస్థలచట్టం అమలులో ఉన్నప్రాంతాలన్నిటికి యీ చట్టం వర్తిస్తుందని స్పష్టంచేయడం జరిగింది. అయితే నోటిఫికేషన్ ద్వారా ప్రకటించబడే యితర ప్రాంతాలకు కూడా యీ చట్టాన్ని వర్తింపజేసే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది. అనుబంధంలో పేర్కొన్న మునిసిపాలిటీలు, పంచాయతీలు, యితర ప్రాంతాలకు వర్తిస్తుందని యీ చట్టంలోనే పేర్కొనడం జరిగింది.

### చట్టం ముఖ్యాంశాలు

దుకాణాలు, వ్యవస్థల పేర్లను రిజిస్టరు చేయడానికి యీ చట్టం వీలు కల్పిస్తున్నది. యిది హర్షించదగిన విషయం. ఈ చట్టం అమలులోకి వచ్చిన తేదీ నుండి అంటే 1967 జూన్ 15 వ తేదీ నుండి 30 రోజులలోగా దుకాణాలు, వ్యవస్థలన్నిటి పేర్లను రిజిస్టరు చేయాల్సివుంటుంది.

పేరు నమోదు నిమిత్తం నిర్ణీతఫారమ్‌లో దరఖాస్తులను నిర్ణీత ఫీదుతో దాఖలు చేయాల్సిఉంటుంది. ఆతర్వాత సంబంధిత ప్రాంతానికి చెందిన ఇన్స్పెక్టరు, దరఖాస్తులను

పరిశీలించి దుకాణాలు, వ్యవస్థల రిజిస్టరులో తగిన (ప్రదేశంలో) ఆ పేర్లను నమోదు చేస్తారు. పేరు నమోదుచేసిన తర్వాత దుకాణం యజమానికి 'రిజిస్ట్రేషన్ సర్టిఫికెటు'ను దుకాణంలో అంటించాలి. ఈచట్టం క్రింద తన దరఖాస్తులో తెల్పిన సమాచారంలో మార్పులు, చేర్పులు జరిగిన పక్షంలో 15 రోజులలోగా ఆవిషయాన్ని ఇన్స్పెక్టరు తెలియ జేయాల్సి ఉంటుంది.

## పనివేళలు, వారాంతపు సెలవు

దుకాణాలు, వ్యవస్థలు రోజుకు 8 గంటలు, వారానికి 48 గంటలు పని చేయాలని యీ చట్టం నిర్దేశిస్తున్నది. రోజుకు ఒక గంట విరామ సమయం యివ్వాల్సి ఉంటుంది. ఓవర్ టైమ్ పనులన్నిటికీ రోజుకు 11 గంటలు, వారానికి 54 గంటలు నిర్ణయించారు.

పూర్వపు చట్టాలలో వారంలో ఏదో ఒక రోజున దుకాణాలు మూసివేసే అధికారం ఉండేది. ఈ చట్టాన్ని అనుసరించి దుకాణాల యజమానులకుగల ఆ అధికారాన్ని తొలిగించి, వారంలో ప్రతి ఆదివారంనాడు దుకాణాలను మూసివేయాలని నిర్బంధం చేశారు.

## పనివారల ఆరోగ్యం, భద్రత

ఈ చట్టాన్ని అనుసరించి దుకాణాలు, వ్యవస్థలకు తరచుగా సున్నం వేయాలి. తగిన గాలి, వెలుతురు సౌకర్యం కల్పించాలి. ఈ విషయంలో రాష్ట్రంలో అమలులో ఉన్న మునిసిపాలిటీలు, గ్రామ పంచాయతీలు, స్థానిక సంస్థల నియమ నిబంధనలు వాటికి వర్తిస్తాయి. విద్యుచ్ఛక్తితో నడిచే యంత్రాలుగల వ్యవస్థలలో ప్రథమ చికిత్స పేటికలను ఉంచాల్సి ఉంటుంది.

వారాంతపు సెలవులకుతోడు దిగువ తెల్పిన సెలవులను కూడా యీ చట్టం కల్పిస్తున్నది:

1. 12 రోజుల కాజువల్ సెలవులు.
2. 12 రోజుల అనారోగ్యపు సెలవులు.
3. జీతంతోసహా 15 రోజుల సంపాదిత (అర్నడ్) సెలవులు. ఈ సెలవులను 45 రోజుల మేరకు కూడబెట్టవచ్చు.
4. దుకాణాలు, వ్యవస్థలలో 180 రోజుల వరకు పని చేసిన స్త్రీ పనివారలకు జీతంతోసహా ప్రసూతికి ముందు 6 వారాలు, ప్రసూతి తర్వాత ఆరు వారాలు ప్రసూతి సెలవు యివ్వాలి.

## ప్రమాదాలు సంభవించిన పనివారలకు నష్టపరిహారం

దుకాణాలు, వ్యవస్థలలో పని చేసే పనివారలకు, 1923వ సం॥ పనివారల నష్టపరిహారం చట్టంలోని నియమ నిబంధనలు వర్తిస్తాయని యీ చట్టం నిర్దేశించింది. కొన్ని తరగతులకు చెందిన యజమానులు తమ పనివారలకు ప్రమాద వశాత్తు సంభవించిన నష్టాలకు నష్టపరిహారం చెల్లించాలని 1923వ సం॥ పనివారల నష్టపరిహార చట్టం నిర్దేశిస్తున్నది. "ఉద్యోగ విధులను నిర్వర్తించే సమయంలో సంభవించిన ప్రమాదాలలో పనివారలకు నష్టం కాటిల్లినప్పుడు సాధారణంగా ఆ పనివారలకు నష్టపరిహారం చెల్లించాల్సి ఉంటుంది." సాధారణ సిద్ధాంతం. ఈ విధంగా ఉద్యోగ సమయంలో పనివారలకు సంభవించిన ప్రమాదాలకు నష్టపరిహారం చెల్లించాలని యీ చట్టం ఉద్దేశించింది.

## గ్రాట్యూటీ చెల్లింపు

వృద్ధాప్యం కారణంగా గానీ, ఉద్యోగం నుండి తొలిగించి నప్పుడు గానీ పనివారలకు యీ చట్టం క్రింద గ్రాట్యూటీ చెల్లించాల్సి ఉంటుంది. ఉద్యోగానికి రాజీనామా యిచ్చిన వారికి, ఉద్యోగం వదలుకున్నవారికి కూడా గ్రాట్యూటీ ప్రయోజనం కలిగించారు. అయితే యజమానులకు 15 రోజులు ముందుగా నోటీసు యివ్వాలి. దుకాణాలు, వ్యవస్థల మార్పిడి సందర్భంలో వరుసగా 6 నెలల సర్వీసుగల పనివారలు నోటీసు యిచ్చే అధికారం, గ్రాట్యూటీ చెల్లింపు హక్కు కలిగి ఉంటారు. ఈ చట్టం ప్రకారం పనివారల మరణం వల్ల ఆయనపై ఆధారపడిన సభ్యులు, ఆయన నామినేటు చేసిన వ్యక్తులకు గ్రాట్యూటీ స్వీకరించే హక్కుకు భంగం ఏర్పడదు. వరుసగా సర్వీసు ఉన్న ప్రతి సంవత్సరానికి 15 రోజుల వేతనం చొప్పున గ్రాట్యూటీ ఇస్తారు. ఈ విధంగా మరణించిన పనివారల ఆధారిత సభ్యులు, ప్రతిపాదిత సభ్యులు చట్టరీత్యా గ్రాట్యూటీ స్వీకరించే అధికారం కలిగి ఉంటారు. ఈ చట్టం రీత్యా యీ విధమైన సాంఘిక న్యాయం సిద్ధిస్తున్నది.

# పొదుపు, మితవ్యయం - నేటి మన కర్తవ్యాలు

# గిరిజన సంక్షేమం

[దేశంలోని గిరిజనులు ఆర్థికంగానూ, సాంఘికంగానూ వృద్ధిలోకి వచ్చేందుకు వీలు కల్పించడానికై గత రెండు దశాబ్దాలుగా చెప్పుకోదగిన కృషి జరిగింది. షెడ్యూల్డు తెగల ప్రతినిధులు ఈనాడు లోక్‌సభలో 37 గురూ, రాష్ట్రశాసనసభలలో 262 గురూ ఉన్నారు. షెడ్యూల్డు తెగలకు చెందినవారు దాదాపు 53,000 మంది కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో ఉన్నారు. వీరిలో 47 గురు ఐ.ఎ.యస్. శ్రేణికీ 18 గురు ఐ.పి.యస్. శ్రేణికీ చెందినవారు. కోటీ ఇరవై అయిదు లక్షలమంది గిరిజనులు నివసిస్తూన్న ప్రాంతాలలో శ్రేయోభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. గిరిజన సంక్షేమ పథకాల నిమిత్తం నాల్గవ ప్రణాళికా కాలంలో షుమారు 100 కోట్ల రూపాయలు ఖర్చుచేయ సంకల్పించారు]

భారతదేశంలో దాదాపు మూడుకోట్ల మంది గిరిజనులు నివసిస్తున్నారు చెదురు మదురుగా దేశంలో వివిధ ప్రాంతాలలోనూ నివశించే వీరు ఆర్థికంగానూ, సాంఘికంగానూ శీఘ్రంగా వృద్ధిలోకి రావడం, యావత్తు దేశం పురోగమించడానికి ఎంతో అవసరం.

సామాజికంగా ఎన్నో ఇబ్బందులకు లోనవుతూ, హీన దశను వెళ్ళబోస్తూన్న వీరి శ్రేయోభివృద్ధి గురించి మన ప్రణాళికావేత్తలు 1951 లో మొదటి పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టినది లగాయతు ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. సమాజంలోని ఈ బలహీన వర్గాలవారి ఇక్కట్లను తొలగించడానికి, భారత దేశం స్వతంత్ర మయినప్పటినుంచీ ప్రభుత్వం ఎంతగానో కృషిచేస్తున్నది. గత రెండు దశాబ్దాల కాలంలోనూ, వివిధ రంగాలలో గణనీయమైన ఫలితాలని సాధించడమయినది.

ప్రభుత్వోద్యోగాలలో ఐదుశాతం షెడ్యూల్డు తెగలవారికై ప్రత్యేకిస్తున్నారు. ఈ ఖాళీలకు తగినంతమంది అభ్యర్థులు లభించేట్లు చూడడానికై ఆయా ఉద్యోగాలకు నిర్ణయించిన అర్హతల విషయంలోనూ, వయఃపరిమితి విషయంలోనూ కొన్ని రాయితీలను చూపుతున్నారు. అఖిలభారత స్థాయిఉద్యోగశ్రేణులైన ఐ.ఎ.యస్. లోనూ ఐ.పి.యస్. లోనూ షెడ్యూల్డు తెగలవారికి ప్రాతినిధ్యం ఆయేటికాయేడు పెరుగుతున్నది. ఐ.ఎ.యస్.లో 1957వ సంవత్సరంలో షెడ్యూల్డు తెగలవారు ముగ్గురేముగ్గురు ఉన్నదల్లా ఇప్పుడు 47గురు ఉన్నారు. అలాగే ఐ.పి.యస్. లో ఈ వర్గాల అధికారుల సంఖ్య 1957 లో 3 ఉన్నదల్లా 1966లో 18 మందికి పెరిగింది. కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో షెడ్యూల్డు తెగలవారు 1961లో 37,704 ఉన్నదల్లా 1966వ సంవత్సరం వచ్చేసరికి 52,655గురు అయినారు.

## విద్యాబోధనా సౌకర్యాలు

షెడ్యూల్డు తెగలకు చెందిన విద్యార్థులకు ఇతోధికంగా విద్యాబోధనా సౌకర్యాలను కల్పించేందుకు అనేక చర్యలను తీసుకోవడం జరిగింది. విద్యాసంస్థలలో ఉచితంగా చదువు చెప్పటం, అవసరమైన పుస్తకాలనూ, ఇతర పరికరాలనూ సమకూర్చటం, ఉపకార వేతనాలను మంజూరు చేయటం ఈ కల్పించే రాయితీలలో కొన్ని. దేశంలోని పబ్లిక్ స్కూళ్ళ విద్యార్థులలో తక్కువ రాబడివర్గాలవారికి వారివారి ప్రతిభను పురస్కరించుకొని కేంద్రం ఇస్తూండే ఉపకారవేతనాలలో కొంతశాతం, షెడ్యూలుతెగల విద్యార్థులకుగాను ప్రత్యేకించారు.

దేశంలోని సాంకేతిక, తదితర విద్యాసంస్థలు చాలా భాగం విద్యార్థుల ప్రవేశానికి సంబంధించిన స్థానాలలో కొన్నిటిని షెడ్యూలు తెగలవారికోసం ప్రత్యేకిస్తున్నాయి. ప్రవేశానికి నిర్ణయించిన కనీసపు విద్యార్హతలనూ, వయః పరిమితినీ కూడా అవి సడలిస్తున్నాయి.

మెట్రిక్‌కు క్రింది తరగతులలో ఉన్నవారికిగాను ప్రభుత్వం ఇచ్చే ఉపకార వేతనాలూ, స్టైఫండ్లూ 1965_66 లో దాదాపు 12 లక్షల 20 వేలమంది గిరిజన విద్యార్థులకు లభించాయి. 1955_56 లో లభించిన ఉపకార వేతనాలకు ఇవి మూడురెట్లు. మెట్రిక్‌కు పై తరగతులలోని గిరిజన విద్యార్థులు షుమారు 57,000 మందికి మూడవ ప్రణాళిక మేరకు ఉపకార వేతనాలు లభించాయి. మొదటి ప్రణాళికా కాలంలో ముట్టచెప్పిన వాటికి ఇది అయిదురెట్లు.

## ఆర్థికాభ్యున్నతి

షెడ్యూల్డు తెగలవారు దాదాపు కోటి 49 లక్షలమంది వ్యవసాయ వృత్తినాధారంగా చేసుకుని జీవిస్తున్నట్లు 1961 వ సంవత్సరపు జనాభా లెక్కల వల్ల తెలుస్తున్నది. మూడవ ప్రణాళికా కాలంలో, షెడ్యూల్డు తెగల కుటుంబాల ఉపయోగార్థం 61,017 యకరాల భూమిని కేటాయించడమయింది. మొదటి రెండు ప్రణాళికలలోనూ కలిసి వివిధ శ్రేయోభివృద్ధి కార్యక్రమాలవల్ల 33,000 గిరిజన కుటుంబాలకు మాత్రమే ప్రయోజనం చేకూరగా, మూడవ ప్రణాళికా కాలంలో దాదాపు 60,000 కుటుంబాలు లాభం పొందాయి.

షుమారు కోటీ 25 లక్షల మంది గిరిజనులు నివశిస్తున్న ప్రాంతాలలో ఇప్పుడు శ్రేయోభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. దేశమంతటా కలిసి యీనాడు గిరిజన సమాజాభివృద్ధి కార్యక్రమ మండలాలు 415, ఈ వర్గాల శ్రేయోభివృద్ధికి సంబంధించిన బహుళార్థ సాధక కార్యక్రమ మండలాలు 43 ఏర్పాటైవున్నాయి. ఒక్కొక్క మండలం విస్తీర్ణం షుమారు

518 చదరపు కిలోమీటర్లూ, జనాభా 25,000 ఉంటాయి. ఈ జనాభాలో మూడింట రెండు వంతులకు తగ్గకుండా గిరిజనులై ఉంటారు. మూడవ ప్రణాళిక మేరకు, ఈ మండలాలపై 15 కోట్ల 53 లక్షల రూపాయలు ఖర్చుచేశారు.

## గిరిజన సంక్షేమానికి చేస్తున్న ఖర్చు

గిరిజన సంక్షేమ కార్యక్రమాలకూ, పథకాలకూగాను మొదటి పంచవర్ష ప్రణాళికలో ఖర్చుగా 19 కోట్ల 83 లక్షల రూపాయలు మాత్రం కేటాయించి ఉండగా, రెండవ ప్రణాళికలో 42 కోట్ల 92 లక్షల రూపాయలు కేటాయించడం జరిగింది. అనంతరం మూడవ ప్రణాళికలో ఈ కేటాయింపు 59 కోట్ల 90 లక్షలకు పెరిగింది. ఇక నాల్గవ ప్రణాళిక ముసాయిదాలో 100 కోట్ల రూపాయలు కేటాయించారు. దీనిలో 68 కోట్లు గిరిజనుల ఆర్థికాభ్యున్నతికీ, 22 కోట్లు విద్యాబోధనకూ, 10 కోట్ల రూపాయలు ఆరోగ్య, రక్షణ, గృహవసతి, తదితర పథకాలకుగాను ఉద్దేశించారు.

## పరిశోధనా సంస్థలు

గిరిజనులు నివసించే ప్రాంతాలనుగురించీ అక్కడి ప్రజల స్థితిగతులూ, సమస్యలూ, అవసరాలనుగురించీ, విపులంగా పరిశోధనలు జరిపేందుకై, వేర్వేరు రాష్ట్రాలతో కలిపి పరిశోధనాసంస్థలు తొమ్మిది ఏర్పాటైనాయి. రెండవ ప్రణాళిక ఆఖరుకి ఇలాంటి సంస్థలు నాలుగే ఉండేవి. గిరిజన సంక్షేమ పథకాలను రూపొందించడానికి అవసరమైన పరిశోధనలను ఈ సంస్థలలో సాగిస్తారు.

## గిరిజనాభివృద్ధిని గురించిన పరిశీలక బృందం

గిరిజన సంక్షేమ కార్యక్రమాలు మరింత శీఘ్రంగా అమలు జరిగేట్లు చూసే ఉద్దేశంతో భారత ప్రభుత్వం 1966 అక్టోబర్‌లో ఒక పరిశీలక బృందాన్ని నియమించింది. నాగాలాండ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ షీలూ ఆవో దీనికి అధ్యక్షులు. దేశంలో వివిధ రంగాలలోనూ సాధిస్తూన్న అభివృద్ధివల్ల ప్రయోజనాలు గిరిజనులకు కూడా కలిగేట్లు చూడడానికి తగు చర్యలను ఈ బృందం సిఫార్సు చేస్తుంది. గిరిజన శ్రేయోభివృద్ధి కోసమని నాల్గవ ప్రణాళిక ముసాయిదాలో తలపెట్టిన ప్రతిపాదనలను, ఆచరణలోకి తెచ్చేందుకు వీలుకల్పిస్తారు. గిరిజన ప్రాంతాలలోని స్థితిగతులకూ, అవసరాలకూ తగిన శ్రేయోభివృద్ధి పథకాలను యిదమిద్ధంగా రూపొందించడంలో ఈ పరిశీలక బృందం రాష్ట్ర ప్రభుత్వాలకు తోడ్పడుతుంది.

---

## హరిజనులు

### తాత్కాలిక ఉద్యోగులకు రక్షణ

ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ తరగతుల సంక్షేమ సంఘం అక్టోబరు 17వ తేదీన సమావేశమై తాత్కాలిక ప్రభుత్వోద్యోగులను రిట్రెంచ్ చేసే సందర్భంలో షెడ్యూల్డ్ తరగతుల ఉద్యోగులకు రక్షణ కల్పిస్తూ ఉత్తరువు జారీచేసినందుకు ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలుపుతూ తీర్మానించింది.

## వెనుకబడిన వర్గాలు

### నూతన దృక్పథం అలవరచుకోవాలని ముఖ్యమంత్రి ఉద్బోధ

సెప్టెంబరు 22వ తేదీన సాంఘిక, గిరిజన, స్త్రీ సంక్షేమ శాఖల అధికారుల సమావేశానికి ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ రాష్ట్రంలో అమలు జరిగే సంక్షేమ కార్యక్రమాల్లో నూతన దృక్పథం అవలంబించవలసిన ఆవశ్యకతనుగురించి ముఖ్య మంత్రి ప్రస్తావించారు. హరిజన సంక్షేమ పథకాల క్రింద గృహనిర్మాణానికి యిస్తున్న గ్రాంటు రు 60 నుండి రు. 100 లకు పెంచబడుతుందని ఆయన వెల్లడించారు. ఉపకార వేతనాలు సకాలంలో యివ్వాలనికూడా ముఖ్యమంత్రి అభిప్రాయం వెలిబుచ్చారు.

## అల్పసంఖ్యాక వర్గాలు

### రాజ్యాంగ చట్టంలో రక్షణలు

1950 జనవరి 26వ తేదీన స్వతంత్ర భారత రాజ్యాంగ చట్టం అమల్లోకి వచ్చింది. మన రాజ్యాంగచట్టం అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన ప్రజలందరికీ, భారతీయ పౌరులందరికీ వున్నట్లు రాజకీయ, మత విషయిక, సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. న్యాయ చట్టంరీత్యా పౌరులందరికీ సమానమైన హోదా యివ్వబడింది. జాతి, మత, కుల, లింగ, జన్మస్థాన కారణములచేత ఏవిధమైన విచక్షణ చూపరాదని రాజ్యాంగ చట్టం నిషేధించింది.

కొన్ని ముఖ్య సూత్రాలు :

15వ సూత్రం :

జాతి, మత, కుల, లింగ, జన్మస్థానాది కారణములవల్ల ప్రభుత్వం పౌరుల పట్ల విచక్షణ చూపరాదు.

16వ సూత్రం :

(1) ప్రభుత్వోద్యోగాలలో పౌరులందరికీ సమానావకాశాలు వుండాలి.

(2) జాతి, మత, కుల, లింగ, జన్మస్థానాది కారణాల వల్ల ప్రభుత్వోద్యోగములు యిచ్చుటలో ప్రభుత్వం పౌరులపట్ల విచక్షణ చూపరాదు.

(5) మత సంస్థలు మొదలగు వాటి విషయములో అభ్యర్థి ఫలానా మతము, లేక వర్గమునకు చెందినవాడై వుండాలని ఏదైనా శాసనమున్నచో దానికి యీ సూత్రము వర్తించదు.

25వ సూత్రం :

పౌరులందరికీ భావనా స్వేచ్ఛ-తమ మతములను విశ్వసించుటకు, అనుసరించుటకూ, ప్రచారము చేసి కొనుటకూ స్వేచ్ఛవుంటుంది.

26వ సూత్రం :

మత, ధర్మాదాయ ప్రయోజనములకు సంస్థలను నెలకొల్పుకుని, నిర్వహించు కొనుటకూ, మత విషయములో తమ కార్యక్రమాలను నిర్వహించు కొనుటకూ, స్థిర చరాస్తులు సంపాదించు కొనుటకు న్యాయశాస్త్రరీత్యా సదరు ఆస్తులను నిర్వహించి అనుభవించుటకూ పౌరులందరికీ హక్కు వుంటుంది.

27వ సూత్రం :

ఏదైనా ప్రత్యేకంగా ఒక మత ప్రయోజనంకోసం వినియోగించదలచి విధించిన పన్నులను కట్టమని ఏ పౌరుణ్ణికూడా నిర్బంధంచేయ కూడదు.

28వ సూత్రం :

పూర్తిగా ప్రభుత్వ నిధులతో నడచే విద్యాసంస్థలలో మతవిషయికవిద్యాబోధన జరుగరాదు.

ఫలానా మతానికి సంబంధించిన బోధ జరగాలని ఉద్దేశించి ఏదైనా ఒక ధర్మసంస్థ తరఫున స్థాపించబడి ప్రభుత్వం నిర్వహించే విద్యాసంస్థకు యీ నియమం వర్తించదు.

ప్రభుత్వ ఆమోదము పొందిన, లేక ప్రభుత్వము నుండి ధన సహాయము పొందుతున్న విద్యా సంస్థలలో విద్యాభ్యాసం చేసేవారిని వాటిలో జరిగే మత విషయక విద్యాబోధనలోగానీ, ప్రార్థనలలో గానీ చేరవలసిందని నిర్బంధం చేయరాదు. వారు అంగీకరిస్తేనే, లేక మైనర్ల విషయంలో సంరక్షకులు అంగీకరిస్తేనే, వారు అట్టి కార్యక్రమాల్లో పాల్గొంటారు.

29 వ సూత్రం :

జాతి, మత, కుల, భాషా ప్రాతిపదికపై ప్రభుత్వ విద్యాసంస్థలలో, లేక ప్రభుత్వ సహాయంపొందే విద్యాసంస్థలలో ఎవరికీ ప్రవేశం నిరాకరించకూడదు.

30 వ సూత్రం :

మత, లేక భాషావిషయిక అల్పసంఖ్యాక వర్గ ప్రజలు తమ తమ విద్యా సంస్థలను నెలకొల్పుకుని నిర్వహించుకోవచ్చు. ప్రభుత్వం ధనసహాయం చేసేటప్పుడు, మత, భాషా విషయిక అల్పసంఖ్యాక ప్రజల అధ్వర్యాన వున్నదనే కారణంచేత విద్యా సంస్థలపట్ల విచక్షణ చూపకూడదు.

325 వ సూత్రం :

ఎన్నికలలో నియోజక వర్గాల ఒకే వోటర్ల జాబితా వుండాలి. జాతి, మత, కుల, లింగాది భేదములవల్ల ఏ పౌరునికిగాని ఆ జాబితాలో చేరే హక్కు నిరాకరించబడకూడదు.

## ప్రజలకు సహాయం

పంచాయతీ సమితుల ద్వారా సాంఘిక విద్యాకార్యక్రమం అమలు జరుగుతున్నది. వయోజన విద్య తరగతులు నిర్వహించబడుతున్నవి. వయోజన విద్యాబోధన విధానాలలో శిక్షణ పొందిన స్థానిక పాఠశాలల ఉపాధ్యాయులే సాధారణంగా యీ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. శిక్షణ పొందిన ఉపాధ్యాయులకు నెలకు రు 16 లు, పొందనివారికి రు 12 లు యిస్తారు. ఆంధ్ర ప్రాంతంలో పడమటలోనూ, తెలంగాణాలో జడ్చర్లలోనూ—యీ వయోజన విద్యా విధానాలలో ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చే కేంద్రాలు వున్నవి.

## సమాధాన వేదిక

ప్రశ్న 1. శ్రీ బి. మల్లయ్య, అడ్లూరు, యెల్లారెడ్డి, కామారెడ్డి తాలూకా, నిజామాబాదు జిల్లా.

మా పెరడులోని ఏలకికాయచెట్టుకు ప్రతి సంవత్సరం కాయలు కాస్తాయి. అయితే వాటిలో గింజలు వుండవు. మేము అనేక విధాల ప్రయత్నించి చూశాము కాని ఫలించలేదు. దీనికి కారణమేమిటి ? దయచేసి సరిఅయిన సేద్యవిధానాలను వివరించండి.

సమాధానం : బాగా తేమగా వున్న పరిస్థితులలోనే ఏలకికాయచెట్టు సంతృప్తికరంగా ఎదుగుతుంది. కొంతవరకు నీడకూడా వుండాలి. ఇతర పరిస్థితులలో ఇది మంచిగా పెరిగి సంతృప్తికరంగా ఫలసాయాన్ని ఇవ్వకపోవచ్చు. సాధారణంగా దక్షిణాదిలో వీటిని 1500 అడుగులు మొదలు 3000 అడుగుల ఎత్తున వున్న ప్రదేశాలలో పండిస్తుంటారు. ఎత్తుగా వున్న ఆ ప్రదేశాలలో చాలినంతగా తేమ వుంటుంది. ఇతర పరిస్థితులలో ఇది సంతృప్తికరంగా పండకపోవచ్చు. చెట్టు సంతృప్తికరంగా ఎదిగి కాయలుకూడా బాగానే కాసినప్పటికీ గింజలు లేకపోవడానికి వాతావరణ పరిస్థితులే కారణమై వుంటాయి.

ప్రశ్న 2. శ్రీ ఎ. వి. సుబ్బారావు, వాకతిప్ప, తూర్పుగోదావరి జిల్లా.

రేడియో లైసెన్సులవల్ల లభించిన సొమ్ము ఆకాశవాణి నిర్వహణకు సరిపోతుందా ?

సమాధానం : సరిపోదు.

ప్రశ్న 3. ఒక గంటకు ఎంత ప్రతిఫలం చెల్లిస్తారు ?

సమాధానం : కళాకారులకు ముట్టజెప్పే ప్రతిఫలాన్ని వారి ప్రదర్శన ప్రమాణాన్ని బట్టి నిర్ణయిస్తారే గాని సమయాన్నిబట్టి కాదు.

సీరియల్ :

# భాగ్యచక్రం

అరికెపూడి కౌసల్యాదేవి

## జరిగిన కథ

కారు ఏక్సిడెంట్‌లో శ్రీపతి చిక్కుకుని మతిస్థిమితాన్ని కోల్పోతాడు. అతని కూతురు జయశ్రీ మినహా మిగిలిన వారంతా ఆ ఏక్సిడెంట్‌లో చనిపోతారు. శ్రీపతి మేనల్లుడు శ్రీనగేష్ ఆయనకు చికిత్స చేస్తుంటాడు. శ్రీలక్ష్మి అనే మెడికల్ స్టూడెంటు సహాయంతో శ్రీపతిని బాగు చేస్తాడు. ఆనందంతో శ్రీపతి యింటినుండి హుషారుగా స్వగృహానికి వెళ్ళిన శ్రీనగేష్‌కు, మంచంలో జ్వరంతో స్పృహ తప్పిపడివున్న శ్రీలక్ష్మి కనిపించింది.

శ్రీనగేష్‌ను చూచిన సుశీలాదేవి యించుమించుగా కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

"పర్వాలేదు. ఇదంతా నిన్నటి పరిస్థితి ప్రభావమే. సాయంత్రానికే ఈ జ్వరం తగ్గిపోతుంది. మీకేం భయం వద్దు. శ్రీనివాసరావు గారికి నేను కబురంపి రప్పిస్తాను. స్వస్థత చిక్కేవరకూ యిక్కడే వుందురుగాని అందరూ" అంటూ హామీ యిచ్చాడు శ్రీ నగేష్. సాయంత్రానికి శ్రీనివాసరావు, పిల్లలూ అయితే వచ్చారు కాని శ్రీలక్ష్మి జ్వరం మాత్రం తగ్గలేదు.

శ్రీ నగేష్ శ్రద్ధా పూర్వక సేవ, చక్కటి వైద్యం వలన మర్నాడు సాయం వేళకు జ్వర తీవ్రత కొంత ఉపశమించి, శ్రీలక్ష్మి కనులు విప్పింది.

"ఏమిటి హడావుడి? మీ రింత అధైర్యస్థులను కోలేదే' హాస్యంగా అన్నాడు శ్రీ నగేష్ ఇంజక్షన్ చేస్తూ.

నీరసంగా నవ్విన శ్రీలక్ష్మి అంతలోనే తనను పరివేష్ఠించి వున్న అందర్నీ చూచి "అయ్యో, మీ కందరికీ ఎంత శ్రమ కలిగిస్తున్నాను!" అంటూ విచారం, క్షమాపణలు వ్యక్తం చేసింది.

వాత్సల్యం ఉప్పొంగగా, "శ్రమేముందమ్మా? అంతకూ మేమే కదా కారణం? ఆ దైవ కృపవల్ల త్వరగా కోలుకోవాలి" అంటూ ఆమె ముంగురులను సవరించింది శ్రీదేవి.

ఆపైన ప్రతి ఒక్కరికీ మాటలు కరవయ్యాయి. ఎవరి మటుకు వారికే అంతర్యంలో అక్కడ అందరూ ఏకకుటుంబ సభ్యులుగా అనిపించి అరమరికలే లేకుండా పోయాయి. మాటలతో నిమిత్తం లేకనే ప్రతి ఒకరి అంతరంగంలోని ప్రేమా,గౌరవాలూ కనులలోనే వ్యక్తమయ్యాయి.

చాల సేపటికి తానే అన్నది శ్రీలక్ష్మి, శ్రీనగేష్‌తో "ఏమిటి! మిమ్మల్ని నేను మీ భాగ్య చక్రానికి దూరం చేసేయ లేదు కదా?"

నవ్వాడు నగేష్. "అది మాత్రం ఎవరి తరంకాదు కాని మీరు లేచి నవ్వుతూ తిరిగితే మరి నేను నిశ్చింతగా నాపనులు చూచుకో గలుగుతాను......ఎంత ఆలోచించి చేసినా ఒకొక్కప్పుడు ఏదో ఒక పని పొరపాటుగా చేస్తాం." స్వగతం లాగా అనుకున్నాడు. "మిమ్మల్ని మామయ్య చూస్తే ఆయన భావాలు మారి ఉన్మాదం తగ్గగలదని ఊహించానే కాని, ఈ సంఘటన ప్రభావం మీపై ఎలా పనిజేస్తుందో అనేది మాత్రం ఊహించ లేకపోయాను!"

"వద్దు డాక్టరుగారూ! అలా అనుకోవద్దు." నొచ్చుకుంటూ అన్నది శ్రీలక్ష్మి. "నావల్ల ఒకరు బాగుపడ్డారు. అంతేచాలు. నా జ్వరం ఈ రోజు కాకుంటే రేపు తగ్గుతుంది."

ఆనాడు ఆ ప్రసంగం అంతలోనే ఆగిపోయినా, ఆ మర్నాడు మాత్రం సంభాషణ చాలా తీవ్రంగా సాగిపోయి, అనుకోని ఫలితాలకు నాందీగీతిక అయ్యింది—అసలు ఆరోజు ఉదయమే శ్రీనగేష్ దినచర్య అనుకోని విధంగా ఆరంభమైంది. ఉదయమే నిద్రలేచిన అతనికి నౌఖర్లు అతి పదిలంగా ఒక లేఖను అందించారు.

"ఏమిటది?" విప్పి చూడకుండానే విసుగ్గా ప్రశ్నించాడు శ్రీనగేష్.



''జయమ్మగారు పంపించారు.''

సమాధానం వింటూనే ఆత్రంగా తీసి చూచాడు.

''బావా!

మేము ఈ సాయంకాలంగాని రేపుగాని వెళ్ళిపోవాలనుకుంటున్నాము. కనుక తెలియపరచడమైనది.

—జయశ్రీ''

''ఏమిటిది?!'' అమితంగా ఆశ్చర్యపోయాడు పతిత.

''ఏమిటిబాబూ అది?'' నిద్రలేస్తూనే ఆశ్చర్య సముద్రంలో మునిగిపోయిన కుమారుని ప్రశ్నించింది శ్రీదేవి.

మౌనంగా ఆ లేఖను తల్లికి యిచ్చాడు.

శ్రీదేవి ఆశ్చర్య మందలేదు. ''అతి తొందరపాటు! వయస్సుకుతగ్గ విజ్ఞత లేదు.'' అంటూ అసహ్యించుకొంది. అప్పటికి మటుకు శ్రీనగేష్ మాట్లాడలేదు.

స్నానానంతరం ఎక్కడికో ప్రయాణ మౌతూన్న అతడిని తిరిగి శ్రీదేవి ప్రశ్నించింది. '' జయ దగ్గఱకేనా ? ''

'' కాదు. ఆసుపత్రికి, '' అతడి సమాధానం ముభావంగా వున్నది. గ్రాహ్యమైంది శ్రీదేవికి అతడి ఆంతర్యం. సానునయంగా నచ్చ జెప్పింది. '' చూడుబాబు ! చిన్నపిల్ల ఏదో తొందర పడిందని నువ్వూ విరక్తి పెట్టుకుంటావా ? ''

శ్రీనగేష్ ముఖంలో నీలి నీడలు అలము కున్నాయి "ఏం చెయ్యనమ్మా ? జయ ప్రవర్తన ఆనాటి కానాడు భరించరానంత విడ్డూరంగా మారిపోతున్నది. ఏం చెప్పడానికైనా నేను వెనుకాడ వలసి వస్తూన్నది. మామయ్యను యింకా అయిదారు నెలలపాటు ఈ పల్లె పట్టునే వుంచి చూడాలి, బహుశః ఆవిడ అంగీకరించదు. ఇక చెప్పడం దేనికి ? ఆవిడ యిష్టమైనట్లే కానియ్. ''

" అలా రాదు నాయనా. '' నచ్చజెప్పనున్న ధోరణిలో ప్రారంభించింది శ్రీదేవి. " ఎవరి తెలివి తక్కువలకు వాళ్ళనే వదిలేయి. వైద్య వృత్తిలో కోపము, అసహనము పనికిరావు. నీచేతిలో ఒక నిండు ప్రాణం ఉన్నదనే సంగతిని గుర్తుంచుకో. నీ మామయ్య విషయంలో నీకు మాత్రం బాధ్యతా, అధికారమూ లేవా ? ''

వినయపూర్వకంగా ఆమోదముద్రను వదనంపై ప్రవర్తిస్తూ మందహాసం చేశాయి శ్రీనగేష్ పెదవులు. "అట్లాగే లేమ్మా. అడుగడుగునా నీ సలహాలు లేనిదే నేనిలా వుండగలిగే వాడినా?" అంటూనే నౌకరుచేత ''జయతో నేను వచ్చి కలుస్తానని చెప్పు. ఆ లోపలకూ వెళ్ళేందుకు ఎటువంటి ప్రయత్నాలు చేయవద్దని నామాటగా చెప్పు." అని కబురంపి వెళ్ళిపోయాడు.

కాని జయశ్రీని కల్సుకోవడానికి అతడు ఆమె యింటికి వెళ్ళవలసిన అవసరం లేకపోయింది. శ్రీకాంత్ జయశ్రీ లిరువురూ అతిసన్నిహితంగా తన ప్రైవేట్ రూమ్‌లో కూర్చుని చిరకాల మిత్రులలాగా ఆత్మీయంగా మాట్లాడుకోవడం చూచిన శ్రీనగేష్ క్షణకాలం మ్రాన్పడిపోయాడు. తర్వాత మౌనంగా వెనుదిరగబోయిన అతడిని శ్రీకాంత్ చూచి నిల్చుంటూ, "హల్లో! గుడ్‌మార్నింగ్ డాక్టర్!" అన్నాడు. జయశ్రీ అయిష్టంగానే చిరుహాస్యం చేసింది. ఎవరినుండీ సంభాషణ రాకపూర్వమే తానే ప్రారంభించాడు శ్రీనగేష్ "ఏం, మిస్టర్ శ్రీకాంత్? అన్ని వార్డులూ చూచి వచ్చారా?"

దోషిలా నిల్చున్నాడు శ్రీకాంత్.

క్షణాలలో తన తీరునూ, ఆగ్రహాన్నీ మార్చివేసుకుని సౌమ్యంగా మారిపోయాడు శ్రీనగేష్. "ఏం జయా? ఏమిటిలా వచ్చావ్?" అని అతి సరళంగా ప్రశ్నించాడు.

"చీటీ పంపించాను, చూశావా?" ఎదురు ప్రశ్నించింది జయశ్రీ.

"ఆఁ. ఆ విషయమే నీతో మాట్లాడాలనుకుంటున్నాను. ఇప్పుడీ హాస్పటల్ పని అయ్యాక మీ యింటికి వస్తానులే."

"బహుశః అప్పుడు నేనుండకపోవచ్చు ఇంటిదగ్గఱ. అదేమిటో ఇప్పుడే మాట్లాడుబావా!"

శ్రీనగేష్ తన అంతరంగంలో చెలరేగుతూన్న కోపపు ఛాయలను పైకి వ్యక్తీకరింపకుండా జాగ్రత్తపడుతూ, కేవలం

సంభాషణను మార్చటానికే శ్రీకాంత్‌వైపు తిరిగాడు. "శ్రీకాంత్! మా మామయ్యగారి ఉన్మాదం పూర్తిగా తగ్గిపోయింది తెలుసా! నా శ్రమంతా ఫలించింది. మరి సందేహంలేదు. ఆయన చక్కగా కోలుకొంటారు. చిన్న చిన్న విషయాలవల్లా, సంఘటనలవల్లా, మరి మతి చాంచల్యంరాదు!" ప్రయత్నం ఫలించినందుకు అమితా నందంతో ఉప్పొంగిపోతూన్న అంతరంగంతో మాట్లాడుతున్నాడు శ్రీనగేష్.

"ఐసీ!" అన్నాడు శ్రీకాంత్ అసాధారణంగా, పరధ్యాన దృక్కులతో ఎటోచూస్తూ షోగ్గా రెండు వేళ్లమధ్యనా సిగరెట్ ఉంచుకుంటూ. "మళ్లీ రాదనే గ్యారంటీవున్నదా? అయినా యిటు వంటివి తగ్గుతాయంటే—అందునా ముసలాళ్ళకి—నాకంత నమ్మకం లేదు!" అన్నాడు తిరిగి.

విస్మయంతో చూచాడు శ్రీనగేష్. అతడికి ఇదివరలోలాగా తనపట్ల భయభక్తులు, వినయవిధేయతలూ నశించటం గమనించి "సరే. ఆ విషయాలు తర్వాత మాట్లాడుకుందాం. మీరు వెళ్ళి రౌండ్సు పూర్తిచేసి రండి." అన్నాడు కరకుగా శ్రీకాంత్‌ను ఉద్దేశించి.

మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు శ్రీకాంత్.

జయశ్రీ, శ్రీ నగేష్‌లు మిగిలారు ఏకాంతంగా.

"హాస్పిటల్‌కు వచ్చి స్వయంగా అతడితో మాట్లాడేంత పనేమున్నది జయా నీకు?" నిశితంగా చూస్తూ ప్రశ్నించాడు శ్రీనగేష్.

"అంటే?" క్షణాలలో జయశ్రీ కనుబొమలు ముడిపడి పోయాయి. "నీతో మినహా మరెవరితోనూ నా కెటువంటి పనీ వుండకూడదా?"

దెబ్బతిన్నట్టు చూచాడు శ్రీ నగేష్. కొంతసేపటికి తనను తాను సంబాళించుకుంటూ అన్నాడు ప్రశాంతంగా: "పొరపాటే, నీ అంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకోవటానికి నే నెవర్ని? మరెప్పుడూ అటువంటి విషయాలలో కలుగజేసు కోనులే......కాని నేను యింతవరకూ కలుగజేసుకున్న విషయం గురించి మాత్రం—అంటే మీ నాన్నగారి విషయంలో నీకు సావకాశంగా కొన్ని విషయాలు చెప్పాలి. ప్రస్తుతం నాకు ఖాళీ లేదు. మధ్యాహ్నం మామయ్యనుకూడా తీసుకుని మా యింటికిరా. అమ్మనుకూడా చూచినట్టు వుంటుంది."

మాట్లాడుతూనే స్టెతస్కోపు చేతికి తీసుకుని వెళ్ళిపోవ డానికి ఉద్యుక్తుడైన అతడు జయశ్రీ అభ్యంతర వచనాలు విని విధిగా ఆగాడు.

"ఏమిటా మాట్లాడే విషయం? బిల్లుకేనా? ఎంతౌనుందో ఇప్పుడే చెప్పు."

"ఎంత చనువున్నా, ఎంత అయిష్టమైనా మరీ అంత పెడసరంగా మాట్లాడడం మంచిదికాదు జయా, మామయ్యకు చేసిన వైద్యానికి నేను ఫీజు తీసుకోనని వెనక చెప్పిన సంగతి మరచి పోయావేమో—గుర్తుకు తెస్తున్నాను. జ్ఞప్తికి తెచ్చుకో!"

"సంతోషం! మరింకేమిటి? ఇంకా ఏమైనా అవమానాలు మిగిలి వున్నాయా?"

శ్రీ నగేష్ అయోమయంగా చూచాడు. "నీ మాటలు నాకేం అర్థంకావడం లేదు. మీ నాన్నను వదలిన పిచ్చి నిన్ను పట్టిందేమోనని భయంగా వున్నది!"

"కట్టిపెట్టు." కటువుగా అన్నది జయశ్రీ. "అవును, చేతలే తెలిసిన వాళ్ళకి మాటలెలా తెలుస్తాయి? నువ్వు ఎప్పటి కప్పుడు నన్ను అవమానిస్తున్నావ్!"

ఆ ఉరుములేని పిడుగుపాటుకు కలవరపడుతూ తలెత్తాడు శ్రీ నగేష్. 'అదేమిటో వివరించు' మన్నట్టు చూచాడామెవైపు.

"నీకు శ్రీలక్ష్మితో పరిచయం నావల్లనే కదా? నేను వదలు కొన్న ఆమెతో నీకు స్నేహం చేయాల్సిన అవసర మేమిటి? మాటి మాటికీ దానిని నా ఎదుటికి తెచ్చి నన్ను బాధిస్తున్నావ్!"

ఆమె మాటలలోని ఉద్రేకతకూ, నిర్మొహమాటత్వానికీ శ్రీ నగేష్‌కు క్రోధాశ్చర్యాలు ముప్పిరిగొనడమే కాకుండా వివేక శూన్యమైన ఆ మాటలకు కొద్ది విచారంకూడా గలిగింది. మెల్లని స్వరంతో అన్నాడు: "పొరపడుతున్నావ్ జయా. నేను నిన్ను చిన్న బుచ్చినదీ, అవమానించినదీ ఏమీలేదు. నిన్ను నేనెంత గౌరవాద రాలతో చూస్తున్నానో నువ్వు గ్రహించలేకపోతున్నావ్. నాకు అందర్నీ గౌరవించడం, ఆదరాభిమానాలతో మెలగడమే తెలుసును కాని అవమానపరచడం, అసహ్యించుకోవడం నాకు రాని పనులు." అంటూనే హాస్పిటల్ వరండామీద మెల్లగా నడక సాగించాడు.

జయశ్రీ అతడిని విడువలేదు. తానూ అతడితోపాటే అడుగులువేస్తూ ఆవేశంతో అన్నది: "ఆ శ్రీలక్ష్మిని చూస్తేనే నాకు ఒళ్ళంతా మండిపోతుంది. మధ్యాహ్నం అన్నయ్యలా కండ్లలో మెదలి మనస్సు చెదిరిపోతుంది; ఆత్మశాంతి దూరమౌతుంది అటువంటి ఆమెతో పరిచయం వృద్ధిచేసి నన్నుకూడ నాన్నగారి స్థితికి తీసుకు వస్తున్నావ్!"

ఆమె ఎంత ఆవేశంగా అన్నదో అంత నిదానంగా జవాబు చెప్పాడు శ్రీనగేశ్. "నీకు అటువంటి ఆవేశం కలుగడం సహజమే కావచ్చు. కాని—నాకు నీవెంతో శ్రీలక్ష్మి అంతే. నీతోబాటు నేనూ వైరం పూనలేను." జయశ్రీ వదనంలో ప్రస్ఫుటమవ్వగల క్రోధరేఖలనూ, కనులు వర్షించగల విస్ఫులింగాలనూ శ్రీనగేష్ ఊహించగలిగాడు కాని, అతడామె వదనం చూడకుండానే అక్కడి నుండి నిష్క్రమించాడు. (సశేషం)

# పండుగలూ పర్వదినాలూ

—క్రో. రా.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఆడంబరంగానూ, ఆనందంతోనూ జరుపుకొనే పండుగలూ, ఉత్సవాలూ అనేకం వున్నాయి. వివిధ మతాలవారు, వివిధ కులాలవారు ఈ పండుగలను ఎంతో ముచ్చటగా, కన్నులపండువుగా జరుపుకుంటూ వుంటారు. ప్రతిపండుగా, ప్రతిఉత్సవమూ కళాత్మకంగా రూపు రేఖలు దిద్దుకుంటుంది. కళలతో శోభాయమానంగా వెలుగుతుంది.

ఈ ఏడాది, అక్కన్న-మాదన్న హరిబౌలివద్ద జరిగిన మహంకాళి మాతేశ్వరిపూజ ఉత్సవాలకు ఒక ప్రత్యేకతవుంది. ఈ పూజాఉత్సవాల సందర్భంగా యిక్కడ ఆటలపోటీలు, క్రీడల పోటీలు జరిపారు. చివరిరోజున జనసంబంధ శాఖామంత్రి విజేతలకు బహుమతుల్ని అందజేశారు. ఈ ఉత్సవాలను ప్రారంభిస్తూ పండుగలు సాంఘికజీవితంలో చైతన్యాన్ని కలిగిస్తాయనీ, హృదయంలోని భక్తిని ప్రకటించుకోవడానికి అవి ఆలంబనంగావుంటాయని ఆయన అన్నారు. ఇక్కడి చారిత్రాత్మక ఆలయంవద్ద పూజకై వేలకొలది స్త్రీలు వచ్చారు. దేవి దర్శనానికై హైదరాబాదునగరం నలుమూలలనుంచీ భక్తులు వరుసలుదీర్చి మహంకాళీ మాతేశ్వరి ఆలయం వద్దకు ప్రవాహంలా కదలివచ్చారు.

స్వాతంత్ర్యదినం ఉదయపువేళ అనేకచోట్ల జాతీయజెండాలు గగనవీధిలో రెపరెపలాడాయి. జాతీయ వీరయోధులకు ప్రజలు భక్త్యాంజలులు సమర్పించుకున్నారు ఆ రోజు ఉదయం సికింద్రాబాదులోని పెరేడుగ్రౌండ్సులో జరిగిన సాంప్రదాయక కవాతు ప్రదర్శన ఆనాటి కార్యక్రమాలన్నిటిలోకీ ప్రధానంగా పేర్కొదగ్గది. ఈ కవాతు ప్రదర్శనలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి వందనస్వీకారంచేశారు. స్వాతంత్ర్యదినోత్సవాన్ని పురస్కరించుకుని రాష్ట్ర జనసంబంధశాఖ లేఖారచన పోటీని, వక్తృత్వపోటీని నిర్వహించింది.

రాష్ట్రమంతటా ఆగస్టు 28న కృష్ణజయంతిని అత్యంత వైభవంగా, ఉత్సాహంతో జరుపుకున్నారు. సికింద్రాబాదు మహంకాళీ దేవాలయం వద్ద ఆంధ్రప్రదేశ్ యాదవ మహాసభవారు ఈ ఏడాది ఏర్పాటుచేసిన ఉత్సవాలకు జనం విపరీతంగా హాజరయ్యారు.

జంటనగరాలలో వినాయక చవితి ఉత్సవాలు సెప్టెంబరు 7వ తేదీనుంచి పదిరోజులపాటు జరిగాయి. వినాయకుడు యింటింటా ఆరాధించబడే దేవుడు. ఏ కార్యాన్ని ప్రారంభించడానికైనా ముందుగా వినాయకుడ్ని ప్రార్థించడం ఒక ఆచారం. మతపరంగా చూస్తే యిది చాలా ముఖ్యమైన పండుగ. పాటలతో, నృత్యాలతో, నాటకాలతో ఈ పండుగను జరుపుకుంటారు. మట్టి వినాయకుడ్ని ప్రతిష్ఠిస్తారు. ఈ దేవుడు విద్యార్థులకూ, పిల్లలకూ మరీ ప్రీతి పాత్రుడైన దేవుడు. ఊరిలోని అన్ని ప్రాంతాలూ ఒకదానితో ఒకటి పోటీలు పడుతూ యీ ఉత్సవాలను నిర్వహిస్తుంటాయి. మునుపటిలాగే ఈ ఏడాదికూడా బజారులన్నీ జనసమ్మర్దంతో నిండిపోయాయి. అంతటా ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి. కొన్నిచోట్ల ఏడవరోజున, మరికొన్నిచోట్ల పదవ రోజునగాని యిరవైయొక్క రోజునగాని వినాయకుడ్ని పూలపాన్పు బండిమీద భజనలుచేస్తూ, పాటలు పాడుతూ ఊరేగించారు. వినాయకుడి కరుణా కటాక్షాల్ని అర్థిస్తూ గళమెత్తి పాటలు పాడారు. హృదయాన్ని ఉద్రూత లూగిస్తూ భజనలు చేశారు.

ఈ ఏడాది ఉరుసు హజరత్ మురద్‌షా ధోటీ, జన సంబంధ శాఖామాత్యులు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ సమక్షములో జరిగింది. మురద్‌షా ధోటీ సమాధిని యాత్రాస్థలంగా ముసల్మానులు భావిస్తుంటారు. ఈ సందర్భంలో ముషాయిరాలు (కవి సమ్మేళనాలు) జరిగాయి. జంటనగరాలలోని వివిధ ప్రాంతాలనుంచి అనేకులు సమావేశమయ్యారు.

గాంధీ జయంతిని అక్టోబరు 2న అత్యంత భక్తితో ప్రజలు జరుపుకుని, జాతిపితయెడ తమ భక్తిని ప్రకటించుకున్నారు. జాతీయ సమైక్యత పతిన పత్రాలమీద అందరూ సంతకం చేశారు. వారం రోజులపాటు జరిగిన ఈ ఉత్సవాలు రోజుకొక ప్రత్యేక కార్యక్రమంతో, గాంధీజీ ప్రవచనాలకూ, హృదయానికి సన్నిహితమైన శ్రేయో కార్యక్రమాలతో ముగిసాయి.

దసరాపండుగ అక్టోబరు 11న కన్నుల పండువుగా, వైభవోపేతంగా జరిగింది. తొమ్మిది రోజుల పాటు జరిగిన ఈ ఉత్సవంలో మొదటి మూడు రోజులు లక్ష్మీదేవి పూజలతోనే గడిచింది. ఆతర్వాత మూడు రోజులు పార్వతీ అమ్మవారి పూజా కార్యక్రమాలతోనూ, కడపటి మూడు రోజులు సరస్వతీదేవి పూజతోనూ గడిచాయి. సాధారణంగా ఎనిమిదవ రోజునగాని, లేదా పదవ రోజున గాని జరిపే ఆయుధపూజలో ఆయుధాలకీ, పనిముట్లుకీ పూజ చేస్తారు. కొత్తగా ఒక వ్యాపారాన్ని ప్రారంభించాలన్నా, ఒక పనికి శ్రీకారంచుట్టాలన్నా విజయదశమి మంచి రోజు. చదువులతల్లి సరస్వతీ దేవికి పూజలు జరిగాయి. పుస్తకాలకు, సంగీత సాధనాలకు కూడా ఆరోజున పూజలు జరిగాయి.

దీపాల పండుగ దీపావళి, నవంబరు ఒకటవ తేదీన దివ్య కాంతుల్ని విరజిమ్ముతూ, చెవులకు చిల్లులు పడేలాగ శబ్దం చేసుకుంటు దీపావళివచ్చింది. ఆరోజు ఆనందంచిందులాడేరోజు. ఉత్సాహం ఉరకలువేసే రోజు. ఏడాదిలో యింత అల్లరిగా, యింత శబ్దం చేసుకుంటూ యింత ఆనందోత్సాహాల్ని చిలకరించే పండుగ మరోటి లేదు. ఈ పండుగ జరుపుకోవడంలో ఒక అంతరార్థంవుంది. ఈ పండుగ దీపాల పండుగ. వెలుగు పండుగ. ఆవెలుగు హృదయాలలో నింపుకునే వెలుగు. జీవితంలో నింపుకునే వెలుగు. అందుకే యింటినిండా ఆ దీపాలు. వీధుల్లో మందుగుండు సామానుతో ఆవెలుగు మెరుపులు.

నరకాసురుడనే రాక్షసుని చంపి లోకానికి పరోపకారాన్ని చేశాడు కృష్ణుడు. అందుకు ప్రతిఏటా ఉత్సవంగా జరుపుకుంటారు ప్రజలు

సంధ్యవేళ లక్ష్మీదేవి లోకమంతాదుట్టి ధనవంతులకూ, పేదలకూ అందరికీ శుభాలను కూర్చుతుంది. ఆరోజు అందరూ తలంటిస్నానంచేస్తారు. వ్యాపారంలో కొత్తగా పద్దులు తెరుస్తారు.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు జరుపుకునే పండుగలు అనేకం వున్నాయి. కన్నులకు విందుకూర్చే పండుగలవి. ప్రజల సాంస్కృతిక జీవితానికి అవి దర్పణాలు. నిజానికి ఈ ఉత్సవాలు, ఈ పండుగలు ప్రజల హృదయాల్లో ఆనంద జ్యోత్స్నల్ని కురిపిస్తాయి. ఉత్సాహ నిర్ఝరులను ప్రవహింపజేస్తాయి.

# ఉత్సవాలు

## "అంధత్వ నిరోధన దినం"

అంధత్వనిరోధన విషయాల జాతీయ సంస్థ నిర్ణయం ప్రకారం, అక్టోబరు 2 వ తేదీన హైద్రాబాదులో, సరోజినీ దేవి కంటి ఆసుపత్రిలో "అంధత్వ నిరోధన దినం" జరిగింది. ఆ సందర్భంలో ఒక ప్రదర్శనను కూడా ఏర్పాటు చేశారు. రెవిన్యూ శాఖామంత్రి శ్రీ పి. బి. రాజు అధ్యక్షత వహించారు. ఈసంవత్సరపు నినాదం— 'కళ్లను కాపాడుకోండి—దృష్టిని నిలుపుకోండి.'

## టీ. బి. సీళ్ల అమ్మకం ఉద్యమం

18 వ టీ. బి. సీళ్ల అమ్మకం ఉద్యమానికి కేంద్ర ఆరోగ్య కుటుంబ నియంత్రణ శాఖల మంత్రి డాక్టర్ ఎస్. చంద్రశేఖర్ అక్టోబరు 19 వ తేదీన హైద్రాబాదులో ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్ర ఆరోగ్య మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షత వహించారు.

## జాతీయ సమైక్యతా కార్యక్రమం

భారత—మధ్యప్రాచ్య సాంస్కృతిక విషయాల సంస్థవారు ప్రారంభించిన జాతీయ సమైక్యతా కార్యక్రమానికి రాష్ట్ర ముఖ్యమంత్రి అక్టోబరు 10 వ తేదీన హైద్రాబాదులో ప్రారంభోత్సవం చేశారు. ప్రజలు భాష, మత విభేదాలను విడనాడి పరస్పరం సన్నిహిత సంబంధాలను కలిగి జాతిని సమైక్యం, సుదృఢం చేయాలని ఈసందర్భంలో ముఖ్యమంత్రి ప్రజలను ఉద్బోధించారు.

*** *** ***

## ఆంధ్రశాస్త్రజ్ఞునికి సత్కారం :

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్ర శాఖాధ్యక్షులుగా వున్న ఆచార్య బి. రామచంద్రరావు ఈ సంవత్సరం (1967) విజ్ఞాన శాస్త్రంలో శాంతి స్వరూప్ భట్నాగర్ స్మారక బహుమతిని గెలుచుకున్నారు. లండన్‌లో అంతరిక్ష పరిశోధనల్పై జరిగిన ఒక అంతర్జాతీయ మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొని ఆయన ఇటీవలనే స్వదేశానికి తిరిగి వచ్చారు.



శ్రీ రామచంద్రరావు విశాఖపట్నంలో జన్మించారు. భౌతిక శాస్త్రంలో బి.ఎస్.సి (ఆనర్స్) డిగ్రీ పుచ్చుకున్నారు. ఈ పరీక్షలో అత్యధిక మార్కులు తెచ్చినందుకు ఆయనకు శ్రీపతి పతకం లభించింది. ఉత్తమ పరిశోధన వ్యాసాన్ని సమర్పించినందుకు 1945 వ సంవత్సరంలో శ్రీరావుకు మెట్కాఫ్ పతకాన్ని ఇచ్చారు.

శ్రీ రావు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్రశాఖలో 1945 వ సంవత్సరం నుంచీ వివిధ హోదాలలో పనిచేస్తున్నారు. 1956 అక్టోబరులో ఆచార్యుడుగా నియుక్తులయ్యారు. 1963 జూలై లో శాఖాధ్యక్షులయ్యారు. కొలంబో ప్రణాళిక క్రింద ఆయన 1951 లో ఆస్ట్రేలియా సందర్శించారు. డబ్ల్యు. ఎల్. ఇ. ఇ కార్యక్రమం క్రింద 1966 లో అమెరికా వెళ్లారు. శ్రీ రావు దేశ విదేశాలలోని వివిధ పత్రికలలో 160 కి పైగా వ్యాసాలు ప్రకటించారు.

1956లో ఆచార్య రామచంద్రరావుకు సర్ జె. సి. బోస్ ప్రీమియమ్ బహూకరించ బడింది. ఆయన బ్రిటిష్ ఇనిస్టిట్యూట్ ఆవ్ రేడియో ఇంజనీర్స్ సభ్యునిగానూ, ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెలికమ్యూనికేషన్ ఇంజనీర్స్ సభ్యునిగానూ, ఇనిస్టిట్యూట్ ఆఫ్ రేడియో అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్స్ (అమెరికా) సీనియర్ సభ్యునిగానూ, ఫిజికల్ సొసైటీ (లండన్) సదస్యునిగానూ ఎన్నిక అయ్యారు. ఆయన ఆంధ్రప్రదేశ్ ఎకాడమీ ఆవ్ సైన్సెస్ స్థాపక సదస్యుడు కూడా. వెలుగు ప్రసారం, విద్యుత్ వాహకాలకు సంబంధించిన వివిధ అంశాలలో శ్రీ రావు కొత్త విషయాలు కనిపెట్టారు. ట్రాన్సిస్టర్ ఫిజిక్స్ రంగంలో కూడా ఆయన మంచి కృషి చేశారు.

కీర్తిశేషులకు శ్రద్ధాంజలి:

# డా॥ బూర్గుల: శ్రీ ఎ. సి: బుచ్చిబాబు

## డా. బూర్గుల రామకృష్ణరావు

కేరళ, ఉత్తరప్రదేశ్‌ల మాజీగవర్నరు డా॥ బూర్గుల రామకృష్ణారావు సెప్టెంబరు 15వ తేదీన తమ 69వ యేట హైద్రాబాదులో పరమపదించారు.



సుప్రసిద్ధ రాజకీయవేత్త సంస్కారవంతుడు, పండితుడు, బహు భాషావేత్త అయిన డా॥ రామకృష్ణారావు ప్రభుత్వంలోను, వివిధ సంస్థలలోను ఉన్నత పదవులను నిర్వహించారు.

1950 లో ఎం. కె. వెల్లోడి మంత్రి మండలిలో రెవెన్యూ విద్యాశాఖల మంత్రిగా పనిచేశారు. వెనకటి హైదరాబాదు రాష్ట్రానికి శ్రీరామకృష్ణారావు మొట్టమొదటి ముఖ్యమంత్రి, కడపటి ముఖ్యమంత్రికూడా అయినే (1952–56) 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడడంలో ఆయన చాలా ప్రముఖపాత్ర వహించారు. 1962 లో ఆయన రాజ్యసభకు ఎన్నికయ్యారు. శ్రీ రామకృష్ణారావు ప్రాచ్య భాషల అభివృద్ధిమండలి అధ్యక్షులుగా వ్యవహరించారు. ఉస్మానియా, ఆంధ్ర విశ్వ విద్యాలయాలు వీరికి గౌరవ డాక్టరేటు బిరుదునిచ్చి గౌరవించాయి.

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్‌హుసేన్ తమ సంతాప సందేశంలో డా॥ రామకృష్ణారావును గొప్ప దేశభక్తునిగా, సమర్థుడైన పరిపాలకునిగా పేర్కొన్నారు. "శ్రీరామకృష్ణారావు దేశసేవకు అంకితమైన వ్యక్తి. వెనకటి హైద్రాబాదు రాష్ట్రప్రజల విముక్తి పోరాటానికి నాయకుడు. ఆయన దేశ రాజకీయాలలో గౌరవనీయమైన పీఠాన్ని అలంకరించారు. చక్కటి సంస్కారము, విజ్ఞతగల వ్యక్తి. ఆయన మరణంతో మన ప్రజా జీవితానికి, ముఖ్యంగా తెలుగు సాహిత్య ప్రపంచానికి తీరనిలోటు వాటిల్లింది" అన్నారు శ్రీమతి ఇందిరా గాంధీ.

రాష్ట్ర అసెంబ్లీలో సంతాప తీర్మానాన్ని ప్రవేశ పెడుతూ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి యిలా అన్నారు-- సామాన్యుని సమస్యల్ని నెరవేర్చే విషయంలో డాక్టర్ రామకృష్ణారావు ఎప్పుడూ వెనుకంజ వేయలేదు. ఆయన ప్రవేశ పెట్టిన భూ సంస్కరణలుగాని, ఆంధ్ర మహాసభ చర్చలలో ఆయన వహించిన ప్రముఖ పాత్రగాని ఆయన పట్టుదలకు, ప్రతిభకు తార్కాణాలు. ముఖ్యమంత్రిగా, గవర్నరుగా, పార్లమెంటు సభ్యుడిగా మాతృదేశానికి ఆయన చేసిన సేవలు నిజంగా ఆంధ్రుల హృదయ ఫలకాలమీద శాశ్వతంగా లిఖింపదగినవి. జాతీయోద్యమంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. ఆయన గొప్ప పండితుడు, పరిపాలనాదక్షుడు.''

## శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి సెప్టెంబరు 20 వ తేదీన తమ 60 వ ఏట మద్రాసులో మరణించారు. వీరి మరణంతో ఆంధ్రదేశం ఒక గొప్ప నాయకుణ్ణి కోల్పోయినట్లయ్యింది. మరణించే నాటికి వీరు ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో హోంశాఖామంత్రిగా



వున్నారు. లోగడ అనేక ముఖ్యమైన మంత్రిత్వ శాఖలనుకూడా వీరు చేపట్టి సమర్థుడనిపించుకున్నారు.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి 1907 మార్చినెలలో రాజమండ్రిలో దేశభక్తులకు అలవాలమైన యింట జన్మించి, తమ పూర్వుల జాతీయతా భావసంపదకు వారసులయ్యారు. 1927 లో మద్రాసు లోని పచ్చయ్యప్ప కళాశాలలో విద్యార్థిగా ఉన్న రోజుల్లో తొలి సారిగా రాజకీయాలలోకి ప్రవేశించారు. క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో కారాగారవాసం అనుభవించారు.

ఇరవయ్యయిదేళ్ళకు పైగా నెల్లూరు పురపాలక సంఘాధ్యక్షులుగా వున్నారు.

1955 లో తొలిసారిగా శాసనసభకు ఎన్నికయ్యారు. 1960 లో పరిశ్రమల శాఖామంత్రిగా నియుక్తులయ్యారు. 1962 నాటి మంత్రివర్గంలో శ్రీ సుబ్బారెడ్డి పబ్లిక్ వర్క్సు శాఖ చేపట్టారు. కీలకమైన విద్యుచ్ఛక్తి, నీటి పారుదల పథకాలను ముఖ్యంగా చిన్న నీటిపారుదల పథకాలను శీఘ్రతరంగా అమలు జరపడంలో విశేషించి కృషి చేశారు. 1964 లో ఏర్పాటైన బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలోకూడా వీరికి యిదే శాఖ అప్ప గించబడింది. 1966 లో వీరికి వ్యవసాయశాఖను అప్పగించారు.

గత జనరల్ ఎన్నికల్లో శ్రీ సుబ్బారెడ్డి రాపూర్ నియోజక వర్గంనుండి తిరిగి అసెంబ్లీకి ఎన్నికయ్యారు.

శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి మరణానికి సంతాపాన్ని ప్రకటిస్తూ ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టంథానుపిళ్ళై ఈవిధంగా పేర్కొన్నారు.—

"శ్రీ సుబ్బారెడ్డి ప్రజాసేవకు అంకితమైన దేశభక్తుడు. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో ప్రతిభావంతుడైన వ్యక్తి. వీరి మరణం రాష్ట్రానికి తీరనిలోటు."

ముఖ్య మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ఈ విధంగా తమ సంతాపాన్ని వ్యక్తంచేశారు.—

"మద్రాసులో కాలేజీ చదువు చదువుతున్నప్పటి నించీ మేమిరువురం పరిచితులం. గత మూడు దశాబ్దాలుగా రాజకీయ రంగంలో మేమిద్దరం కలిసి పనిచేస్తూవచ్చాం. అసాధారణమైన వ్యక్తిత్వం ఆయనది."

రాష్ట్ర విధానసభలో ప్రతిపక్షనాయకుడు శ్రీ గౌతు లచ్చన్న యిలా అన్నారు.—

"వీరి మరణంతో మనమొక ధైర్యవంతుడ్ని—వున్నది వున్నట్టుచెప్పగల దేశభక్తుడ్ని—కోల్పోయినట్టయింది. వీరిమరణం ఒక్క నెల్లూరు జిల్లాకేగాక మొత్తం యావదాంధ్రకూ తీరనినష్టం".

హోంమంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి మరణానికి తమ ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ సెప్టెంబరు 21 న రాష్ట్ర విధానసభ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. తమ నాయకుని గౌరవార్థం సభవారు రెండునిమిషాలు నిశ్శబ్దాన్ని పాటించారు. అనంతరం విధానసభ సమావేశం ఆరోజుకు వాయిదాపడింది.

శాసనసభలోని అన్ని పక్షాలవారూ శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి బహుముఖ ప్రతిభను కొనియాడుతూ, వారివ్యక్తిత్వ వైశిష్ట్యానికి కారణ మనదగిన సంఘటనలను ప్రస్తావించారు.

సెప్టెంబరు 26 వ తేదీన సమావేశమైన శాసనమండలి శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి మరణాలకు సంతాపాన్ని ప్రకటిస్తూ సానుభూతి సూచకంగా ఆరోజు సమావేశం వాయిదావేశారు

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి మరణానికి రాష్ట్రంలోని అనేక సంస్థలు తమ గాఢ సంతాపాన్ని ప్రకటించాయి. సానుభూతి సంతాప సమావేశాలు జరిపాయి. తమ జోహార్లు అర్పించాయి. శ్రీ సుబ్బారెడ్డి కుటుంబానికి సంతాప తీర్మానాలు పంపించాయి.

## బుచ్చి బాబు

సుప్రసిద్ధ తెలుగు నవలా రచయిత, కథకుడు, నాటక రచయిత, విమర్శకుడు, చిత్రకారుడు అయిన 'బుచ్చిబాబు' అని పిలవబడే శ్రీ శివరాజు వెంకట సుబ్బారావు సెప్టెంబరు 20 వ తేదీన హైదరాబాదులో తమ 51 వ యేట స్వర్గస్థులయ్యారు. షేక్స్‌పియర్ రచనలమీద శ్రీబుచ్చిబాబు వ్రాసిన విమర్శక గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతిలభించింది. వీరి నవల 'చివరకు మిగిలేది' నిజంగా తెలుగు సాహిత్య చరిత్రలోనే చివరకు మిగిలేదిగా పరిగణింపబడుతున్నది. ఉత్తమ యిల్లాలు, ఆద్యంతాల మధ్య రాధవంటి చక్కటి నాటికలు; నిరంతర త్రయం, అరకులోయలో కూలిన శిఖరాలు, దేశం నాకిచ్చిన సందేశం, ఆమెనీడ, అశాప్రియ వంటి అనేక ఉత్తమ శ్రేణి కథలు వ్రాసి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. అధునిక తెలుగు సాహిత్యంలో మనస్తత్వ చిత్రణ, వర్ణనాత్మక



కథా కథనంలో ఒక కొత్త ఒరవడిని ప్రవేశపెట్టారు. వీరి కథలు చాలావరకు ఆంగ్లంలోకి అనువదింపబడి సుప్రసిద్ధ ఆంగ్ల పత్రికల్లో ప్రచురితమై ప్రపంచ కథానికా సాహిత్యంలో తెలుగు కథానిక గౌరవ ప్రతిష్ఠలను సమున్నత స్థాయిలో నిలిపాయి. శ్రీ బుచ్చిబాబు స్వయంగా చిత్రకారుడుకూడా. అనేక తైలవర్ణ చిత్రాలను చిత్రించారు.

# చైతన్యమూర్తులు

## జాతిపిత



ఇరవై ఐదు శతాబ్దాల క్రితం లుంబినీ వనంలో సాల వృక్షం నీడన ఒక శిశువు జన్మించాడు. ఇరవై శతాబ్దాల క్రితం పశువులకు ఆశ్రయం యిచ్చే కొండచెరియలలో బెత్లెహేం గ్రామంలో ఒక శిశువు జన్మించాడు. ఒక శతాబ్దం క్రితం-అంటే తొంభై సంవత్సరాల క్రితం-ఎవరికీ అంతగా తెలియని పోరుబందరు పట్టణంలోఒక శిశువు జన్మించాడు. ఒక శిశువు జననంలో అంత ప్రత్యేకత ఏముంది? ఈ భూమిపై లక్షలాది మంది శిశువులు జన్మించారు. జన్మిస్తున్నారు. అయితే యీ శిశువులు ప్రత్యేక విశిష్టత కలిగిన వారు. వారి జననం ప్రపంచంలో ప్రముఖ సంఘటనగా పేర్కొంటారు. వారు చరిత్రకు, మానవతకు ప్రత్యేక రూప కల్పన చేసినవారు. వారి అడుగు జాడలు కాలగతిని మాసి పోలేనివి. గాంధీజీ వంటి మహామహితాత్ముడు మన కాలంలో జన్మించడం సంభ్రమాశ్చర్యంకలిగించే సంఘటనే అయినప్పటికీ అది అభూత కల్పన మాత్రంకాదు. అక్షయమైన వారి దివ్య శక్తి యుగ యుగాలను ప్రభావితంచేస్తూనే ఉంటుంది.

గాంధీ శత జయంతి ఉత్సవాల జాతీయ సంఘం నిర్ణయం ప్రకారం, యీ సంవత్సరం గాంధీ జయంతిని శతజయంతి ఉత్సవాలకు నాందిగా వారం రోజుల కార్య క్రమాన్ని అమలు జరిపారు. స్త్రీలు, పురుషులు, పాఠశాలలు, కళా శాలలు, గ్రంథాలయాలు, కార్పొరేషన్‌లు, యితర ప్రజాసంస్థలు దేశంలోని నలుమూలల యీ కార్యక్రమాన్ని నిర్వహించాయి.

1969 అక్టోబరు 2వ తేదీన గాంధీజీ శతజయంతి ఉత్సవాన్ని, ఆమహా పురుషునికి తగిన విధంగా, భక్తి శ్రద్ధలతో ఘనంగా జరపాలని జాతి నిర్ణయించింది. ఆదర్శ గృహిణిగా, ఉత్తమ స్త్రీగా యితరులకు మార్గ దర్శకు రాలైన మాతా కస్తూరిబా శత జయంతి ఉత్సవంకూడ జరపబడుతుంది. భారత దేశంలోనే కాక ప్రపంచమంతటా యీ ఉత్సవాన్ని ఘనంగా జరపడానికి విస్తృత ప్రాతిపదికపై ఏర్పాట్లు జరుగుతున్నాయి. యునెస్కో, యితర విషయాలతో పాటు, 1968-69 సంవత్సరాన్ని గాంధీ శతజయంతి సంవత్సరంగా నిర్వహించాలని నిర్ణయించింది. ఈ సంస్థ అధ్వర్యంలో దాదాపు 122 దేశాలలో ఉన్న జాతీయ సంఘాలు యీ ఉత్సవాల నిమిత్తం అనేక కార్యక్రమాలను రూపొందించాయి.

## జవహర్‌లాల్ నెహ్రూ



జవహర్‌లాల్ నెహ్రూ స్మృతి చిహ్నాలు ఎన్నిటినో నిర్మించుతున్నాం అయితే నిజమైన స్మృతి చిహ్నం వేరేవుంది. అది మన హృదయాలలో నిర్మించుకోవలసిన చిహ్నం. నెహ్రూ ఆశయాలకు వాస్తవ రూపకల్పన చేసేందుకు, సుందర భవిష్యద్భారతావనిని నిర్మించుకునేందుకు మనం దృఢచిత్తులంకావాలి. అదే ఆయనకు మనం మనహృదయాలలో శాశ్వతంగా నిర్మించే స్మృతిచిహ్నం.

జాతీయసమైక్యత, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, సాంఘికసమానత, ఆర్థికప్రగతి, శాస్త్రీయ సాంకేతికాభివృద్ధి, సామ్యవాద సిద్ధాంతాలవ్యాప్తి మతరహిత వ్యవస్థ

అంతర్జాతీయ సత్సంబంధాల వికాసం - వీటికొరకే ఆయన అర్ధశతాబ్దికి పైగా అవిరళకృషి చేశారు. ఇవే ఆయన సిద్ధాంతంలోని మూల స్థంభాలు, వీటిమీదే పటిష్ఠమైన భారతదేశం రూపొందుతుంది.

ఈనాడు వారి శరీరం మనమధ్య లేకపోవచ్చు. కాని వారి ఆత్మ మనముందు ఎప్పుడూ మార్గదర్శంగా నిలుస్తూనేవుంటుంది. ఒక కొత్త శకానికి నాంది జరిగిన వర్తమాన వ్యవస్థలో మనం ఆయన ఆశయాలకు రూపకల్పన చేసేందుకు కంకణం కట్టుకోవాలి.

## లాల్ బహదూర్ జీ :

శాస్త్రీజీ, మహాత్మాగాంధీకి నిజమైన అంతేవాసి. దేశ సేవయే ఆయన జీవిత పరమావధి. అధికార దర్పానికి ఆయన ఎప్పుడూ లొంగిపోలేదు.



లాల్ బహదూర్ శాస్త్రీ జన్మతః రాజనీతిజ్ఞుడు. గాంధీజీవలె ఆయన ఎల్లప్పుడూ మృదువుగాను గట్టిగానూ మాట్లాడేవారు. సంప్రదింపులు జరపడానికి ఆయన సుముఖత చూపేవారు. కాని సిద్ధాంతాలకు భిన్నంగా రాజీపడడం ఆయనకు సమ్మతం కాదు.

శాస్త్రీజీ ప్రధానమంత్రి అయినప్పుడు ఎన్నో తీవ్ర సమస్యలను ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. ఆయన వాటిని అపూర్వమైన ప్రతిభా సామర్థ్యాలతోనూ, అద్వితీయమైన ధైర్యసాహసాలతోనూ ఎదుర్కొని ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. అంతర్జాతీయ వ్యవహారాలలో శాస్త్రీజీ సాధించిన విజయానికి తాష్కంట్ ఒడంబడిక చిహ్నం. దేశ వ్యవహారాలన్నింటిలోనూ ప్రతిపక్షాలపై విశ్వాసముంచి వారి విశ్వాసాన్ని చూరగొనే నూత్న పంథాను అవలంబించి విపత్కర సమయంలో జాతిని ధీరోదాత్తంగా ముందుకు నడిపించడానికి ఆయన మార్గం రూపొందించారు.

## శ్రీ అరవిందుడు



ఆధునిక భారతీయ చరిత్రలో ఆగస్టు పదిహేనవ తేదీ రెండు అపూర్వ సంఘటనలదృష్ట్యా విశిష్టత సంతరించుకున్నది. ఆ తేదీనాడే స్వతంత్ర భారతదేశం అవతరించింది. తన ప్రత్యేకకృషితో ప్రత్యేక మార్గాన భారతీయ ఆధ్యాత్మిక పునరుజ్జీవనానికి వెలుగుబాటను చూపిన శ్రీ అరవిందుడుకూడ ఆనాడే జన్మించాడు. శ్రీ అరవిందుని అభిప్రాయం అనుసరించి మానవత రూపకల్పన చేసుకుంటున్నది. దానికి దోహదం చేయాల్సి ఉంది. అంటే ఒక కొత్త ప్రబోధం, కొత్తవిలువ, కొత్త ధర్మాన్ని అనుసరించాల్సిఉంది. ఈ మార్గాన్నిగూర్చి శ్రీ అరవిందులు తన రచనలలో వివరణాత్మకంగా వర్ణించారు.

ప్రాక్పశ్చిమదృక్పథాలను అమోఘంగా సమన్వయపరచిన వారని రోమెన్‌రోలా అభివర్ణించిన శ్రీ అరవిందులు, జీవితాన్ని గూర్చి, ప్రపంచాన్నిగూర్చి సమగ్రంగా చర్చించి ప్రస్తుత పరిస్థితిని మనముందు ఉంచారు. తనకుగల వివిధ మహిమలను గూర్చి తెల్పుతూ కొత్తపద్ధతిని అనుసరించే మామూలు తత్త్వవేత్తగా గాక మానవతకు మార్గాన్వేషకుడుగా తన "దివ్యజ్ఞానజీవితం" అనే ఉద్గ్రంథంలో తనను తాను తెలుపుకున్నారు.

## ఉక్కు-మనిషి సర్దార్

(పటేల్ జయంతి అక్టోబరు 31)

గాంధీయుగంలో దేశం ప్రసాదించిన మహానాయకులలో సర్దార్ వల్లభ్‌భాయ్‌పటేల్ అతిముఖ్యులు. విజ్ఞులు ఆయనను బిస్మార్క్‌తో పోల్చుతారు. ప్రజలు ఆయనను "ఉక్కు-మనిషి" గా వర్ణిస్తారు. ''ఆయన కల్చర్ అగ్రికల్చర్'' అనే జాన్‌గుంథర్ అభివర్ణన ఆయనకు తగినట్టుగా ఉంటుంది.

సర్దార్ పటేల్ ముక్కుసూటిగా వెళ్ళేవ్యక్తి. బార్డోలీ సంఘర్షణల సమయంలో గాంధీజీ సందిగ్ధంగా వ్యవహరించినప్పుడు




పటేల్ స్పష్టమైన మార్గాన్ని అనుసరించారు. తన అంగీకారాన్ని తెల్పాలని గాంధీజీకి ఆయన విజ్ఞప్తిజేశారు.

భారత రాజకీయాలలో సర్దార్ పాత్రను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. గుజరాత్ కాంగ్రెస్ నాయకుడుగా సర్దార్, పార్లమెంటరీబోర్డు అధ్యక్షుడుగా సర్దార్, కేంద్రప్రభుత్వ దేశీయ వ్యవహారాలశాఖమంత్రిగా సర్దార్, రాష్ట్రాల వ్యవహారాల శాఖ మంత్రిగా సర్దార్.

కేంద్ర దేశీయవ్యవహారాలమంత్రిగా అతి సంక్లిష్టసమస్యలను ఎదుర్కోవాల్సి వచ్చింది. మతకలహాలు ముమ్మరంగా ప్రబలిఉన్న రోజులైనా ఆయన ప్రాణరక్షణకు, శాంతిభద్రతలకు భంగమేర్పడనీయలేదు. మైఖల్ బ్రీచర్ వెలిబుచ్చిన ప్రశంసా వాక్యాలు సర్దార్ జీ సమర్థవంతమైన నాయకత్వానికి తగినవి.

"అయన తన చివరి సంవత్సరాలలో దేశానికి ప్రత్యేకమైన సేవ చేయవలసివచ్చింది. స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఉత్పన్నమైన అనేక క్లిష్టపరిస్థితులను పరిష్కరించడంలో ఆయన అమోఘమైనపాత్ర నిర్వహించి, ఆధునిక భారతదేశ నిర్మాతలలో ఒకరుగా నిలిచారు."

రాష్ట్రాల వ్యవహారాలశాఖ మంత్రిగాను, సమైక్య భారత దేశ నిర్మాతగాను ఆయన అతిముఖ్యమైనపాత్ర నిర్వహించారు. సర్దార్ పటేల్ తన వ్యవహారదక్షత, రాజకీయచతురతలతో దేశంలో రాచరికానికి స్వస్తిచెప్పారు.

(శ్రీ యు. యన్. ఢేబర్)

## నేతాజీ సుభాస్ చంద్రబోస్

సుభాస్ చంద్రబోస్ 1945 ఆగష్టు 18వ తేదీన దివంగతులయ్యారు. ప్రముఖ దేశనాయకులు కారాగారాలలో మ్రగ్గుతున్న కాలంలో ధైర్య స్థైర్యాలను కోల్పోయిన ప్రజానీకానికి ఆయన నూతన ఉత్సాహం, ఆత్మ స్థైర్యం కలిగించారు. రోమ్, బెర్లిన్, టోక్యో నగరాల నుంచి ఆయన చేసిన రేడియో ప్రసంగాలు భారత స్వాతంత్ర్య పోరాటానికి నవ్యదృక్పథాన్ని సంతరించిపెట్టాయి. ప్రపంచ దృష్టిని ఆకర్షింపజేసాయి. ఆయన దేశాన్ని




స్తబ్ధత నుండి మేల్కొల్పి జాతిని చైతన్యవంతం చేశారు. ఇవి భారత వీరాంగన ఝాన్సీ లక్ష్మీబాయి సాహస కృత్యాలను పోలినవి. సుభాస్ చంద్రబోస్ ఇచ్చిన పిలుపు— "ఛలో ఢిల్లీ" భారత దేశమంతటా ప్రతి పట్టణంలోనూ, పల్లెలోనూ మారుమోగింది. తుదకు సాయుధ దళాలకు కూడా యీ నినాదం ప్రాకింది. ఆ దెబ్బతో బ్రిటిష్ సామ్రాజ్యపాలన అంతిమ ఘట్టంలో పడింది. ఆయన ఒక కొత్త పతాకాన్ని, కొత్త గీతాన్ని, కొత్త దృక్పథాన్ని ప్రసాదించారు. సామ్రాజ్యవాదులతో సాగిన అంతిమ పోరాటంలో ఇవి భారత ప్రజలకు ధైర్యోత్సాహాలు కలిగించి విజయ సాధన కారణములయ్యాయి.

## చిలకమర్తి

సరిగ్గా ఒక శతాబ్ది క్రిందట సెప్టెంబరు 26వ తేదీన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు జన్మించారు. తొలి తెలుగు నవలకు శ్రీకారం చుట్టిన ఘనత ఆయనదే. చక్కటినాటక రచయితగా ఆయన ప్రసిద్ధులయ్యారు. కావ్యాలలోని యితివృత్తాల్ని ఆధారంగా తీసుకుని మూడునాటకాలు రచించారు. అవి బహుళ ప్రచారమందాయి. వీరి గయోపాఖ్యానం అనే నాటకం ఈ శతాబ్దారంభంలో ఆంధ్రదేశంలోని ఆబాలగోపాలాన్ని ఆకట్టుకుంది. ఆ నాటకం ప్రదర్శించబడిన ప్రతిచోటా ఇసుకవేస్తే రాలనంతగా ప్రేక్షకులు హాజరయ్యేవారు. ఆయన చక్కటి రచయితేగాదు, మంచి వక్త కూడాను. తన వాగ్ధాటిలో శ్రోతలను మునకలు వేయించేవారు.

అంతేకాదు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు సంఘ సంస్కర్త కూడా. కందుకూరి వీరేశలింగం పంతులు గారితో కలిసి పాఠశాలలను స్థాపించారు. స్త్రీవిద్యాభివృద్ధికి కృషిచేశారు.

## కార్ల్ సాండ్ బర్గ్

ప్రముఖ అమెరికన్ కవి కార్ల్ సాండ్ బర్గ్ తమ 89వ యేట ఉత్తర కరోలినాలో ఫ్లాట్ రాక్‌లో జులై 22వ తేదీన తమ స్వగృహంలో పరమపదించారు. మధ్యయుగాలనాటి మన సత్వముతో పారిశ్రామిక యుగంలో ప్రభవించిన కవిగా ఆయనను అభివర్ణించారు. సాండ్ బర్గ్ స్వీడెన్‌నుంచి వలస వచ్చిన ఒక నిరక్షరాస్యుని కుమారుడు. ఆయన వ్రాసిన అబ్రహాం లింకన్ జీవిత చరిత్ర అపూర్వమైన గ్రంథం.

## డా. లోహియా



సోషలిస్టు నాయకుడు డా. రామమనోహర్ లోహియా 1967 అక్టోబరు 12వ తేదీన తమ 57వ యేట క్రొత్తఢిల్లీలో స్వర్గస్థులయ్యారు. ఈ సందర్భంలో భారత రాష్ట్రపతి డా॥ జాకిర్‌హుసేన్ తమ సంతాపాన్ని ప్రకటిస్తూ 'గొప్ప దేశభక్తుడూ, ఆదర్శవాదీ అయిన డా॥ లోహియా తన జీవితాన్ని యావత్తూ సమాజంలోని బడుగువర్గాలవారి శ్రేయస్సుకే అంకితం చేశారు' అన్నారు. ఉపప్రధాని మొరార్జి దేశాయ్ తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తంచేస్తూ— 'భారతదేశం ఒక గొప్ప కార్యకర్తను కోల్పోయింది. డా॥ లోహియా ఆదర్శవాది. దేశ శ్రేయస్సుకు అనవరతమూ ఆయన శ్రమించారు'— అన్నారు.

## లార్డ్ అట్లీ

ఇంగ్లాండుకు 1945–51 మధ్యకాలంలో ప్రధానిగావున్న లార్డ్ అట్లీ అక్టోబరు 8వ తేదీన లండన్‌లో కాలంచేశారు. ఆయన భారతదేశానికి మంచి మిత్రుడు. భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించే చారిత్రాత్మక పత్రంపై సంతకం చేసిన ఇంగ్లాండు ప్రధాని ఆయన. ఆయన మరణానికి తమ సంతాపాన్ని ప్రకటిస్తూ రాష్ట్రపతి – భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించిన లార్డ్ అట్లీ రాజనీతిజ్ఞతను మనం మరచిపోలేము— అన్నారు.

## ప్రణాళికా సంఘానికి సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త మార్గదర్శకత్వం :

ప్రణాళికా సంఘం నూత్న ఉపాధ్యక్షుడు ప్రొఫెసర్ డి.ఆర్. గాడ్గిల్ దేశంలోని ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తల్లో ఒకరు. ఆర్థిక శాస్త్రానికి మూడు ముఖ్య శాఖలైన ఆర్థిక శాస్త్ర సిద్ధాంతం, ఆర్థికశాస్త్ర చరిత్ర, ఆర్థిక సిద్ధాంతాల ఆచరణలలో ఆయనకు మంచి ప్రావీణ్యంవుంది.

శ్రీ గాడ్గిల్ ప్రారంభ విద్య నాగ్‌పూర్‌లో సాగింది. తరవాత కేంబ్రిడ్జి నుంచి ఎం. ఏ., ఎం. లిట్ పట్టాలు పొందారు. బొంబాయి ప్రభుత్వ ఆర్థిక శాఖలో 1924–25 సంవత్సరాలలో అడిషనల్ అసిస్టెంట్ సెక్రటరీగా వ్యవహరించారు. 1925 నుంచి 1930 వరకు సూరత్‌లోని ఎం. టి. బి. కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేశారు. 1930లో పూనాలోని గోఖలే రాజకీయ, ఆర్థిక శాస్త్రాల విద్యాసంస్థకు డైరెక్టరయ్యారు. ఈ కాలంలోనే ఆయన కార్మిక, సహకారోద్యమ సమస్యలపట్ల కూడా ఆసక్తి కనబరచసాగారు. 1937లో ఆయన బొంబాయి జవుళి పనివారల విచారణ సంఘం సభ్యుడుగా వున్నారు. 1939 నుంచి 1948 వరకు బొంబాయి సెకండరీ విద్యాబోర్డు సభ్యుడుగా పనిచేశారు. 1940లో ఇండియన్ ఎకనమిక్ అసోసియేషన్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. వెనుకబడిన దేశాల అభివృద్ధికి మార్గాలను సూచించడానికై 1951లో ఐకరాజ్య సమితి నియమించిన నిపుణుల బృందంలో శ్రీగాడ్గిల్ సభ్యుడు. ప్రణాళికా సంఘానికి చెందిన ఆర్థిక శాస్త్రవేత్తల బృందానికి ఆయన ఉపాధ్యక్షుడుగా వుండేవారు. ప్రణాళికా సంఘపు గ్రామీణ లఘుపరిశ్రమల సంఘంలోకూడా సభ్యులు. 1957–60 మధ్య కాలంలో మహారాష్ట్ర ఆర్థికాభివృద్ధి మండలికి ఆయన అధ్యక్షుడు. పూనా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగానూ, గోఖలే రాజకీయ, ఆర్థిక శాస్త్రాల విద్యా సంస్థ ఆచార్యుడుగానూ పనిచేసిన శ్రీ గాడ్గిల్ 1966 ఏప్రెల్‌లో రాజ్యసభకు నామినేటు చేయబడినారు. ఆచార్య గాడ్గిల్ రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా సెంట్రల్ బోర్డు సభ్యుడుగానూ ఇంకా అనేక అధికార, అనధికార జాతీయ, అంతర్జాతీయ సంఘాల సభ్యుడుగానూ వున్నారు.

కేంబ్రిడ్జినుంచి విద్యముగించి వచ్చిన తొలి రోజులలో ఆయన వ్రాసిన "భారత దేశపు పారిశ్రామిక పరిణామం" అనే గ్రంథం, వెరా ఆన్‌స్టే లిఖించిన "భారతదేశపు ఆర్థికాభివృద్ధి" అను గ్రంథానికి సాటివచ్చే ప్రామాణికమైన గ్రంథంగా పరిగణించబడుతున్నది. భారతదేశంలో, ప్రణాళికా విధానాన్ని శ్రీ గాడ్గిల్ విమర్శించి వున్నారు. "ప్రభుత్వం జరిపిన కృషిపరిమాణం మొత్తం మీద పెద్ద ఎత్తున ప్రభావం వేయడానికి చాలదు." ప్రణాళికా విధానాన్ని మరింతగా దృఢపరచడానికీ, దాని ప్రమాణాన్ని పరిమాణాన్ని పెంపొందించడానికీ, నిర్మాణాత్మక విధానంలో ప్రభుత్వానికి మార్గదర్శకత్వం వహించడానికీ ప్రణాళికా సమితి ఉపాధ్యక్షుడుగా కృషిచేయడానికి ఆయనకు యిప్పుడు అవకాశం లభించింది.

*

# గృహిణి

పిలకా గణపతిశాస్త్రి

## జరిగిన కథ

పార్థసారథికి నాటకాలపిచ్చి. రాఘవ నాట్యకళా మండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. సరోజ, వాళ్ళనాటకాలో హీరోయిన్‌గా వేస్తుండేది. ఒకసారి ఏలూరులో ఒకనాటకానికి పార్థసారథి కాంట్రాక్టు వప్పుకున్నాడు. సరోజతో ఆవిషయంతెలియద్దామని వాళ్ళింటికి వెళ్ళి చెప్పాడు.

సరోజ ఆ వార్తవిని ఎంతో సంతోషించి అతని నభినందించింది. ఏలూరులో నాటకం గొప్పగా పేరుతెచ్చుకుంటే తమ మండలి కెంతయినా ఘనత చేకూరగలదని ఉత్సాహపడింది. ఇంచు మించుగా ఇంకా ఇరవై రోజుల వ్యవధి ఉన్నది కనక ఏడెనిమిదిసారులు రిహార్సల్స్ జరిపి తప్పకుండా అందరిచేత ఓహో! అనిపించుకో వచ్చునని ఉవ్విళ్ళూరింది. మండలిలో మిగిలిన నటీనటులకందరికి కొద్దోగొప్పో ఎక్కువగా ముట్టజెప్పి సంతృప్తి పరచడం మంచిదే అని అంగీకరించింది. అయితే ఇక తన కే మాత్రము ఎక్కువగా ఇవ్వనక్కరలేదని చెప్పి అంతకుముందే అతనికెన్నో విధాల ఋణపడినట్టు మాట్లాడింది. పార్థసారథి ఆమె కృతజ్ఞతకెంతో ఉప్పొంగిపోయాడు! పోనీ రొక్కం రూపంలో ఎక్కువగా పుచ్చుకోడానికిష్టం లేకపోతే ఏదో ఒక బహుమతి అయినా తీసుకోక తప్పదని బలవంతపెట్టాడు. అయితే ఆమె దానికేవిధంగాను ప్రతి సమాధానం చెప్పక వినీవిననట్టు మాట్లాడకూరుకుంది.

ఆదే సమయంలో వెంకటకృష్ణయ్య నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ అక్కడికివచ్చి సరోజ పక్కనే వేరొక పడక కుర్చీలో చేర్లపడ్డాడు. లాల్చీ జేబులోనించి అగ్గిపెట్టె పైకితీసి పొడుగాటి లంక పొగాకు చుట్ట వెలిగించాడు. అదే క్షణంలో మధ్యనకూర్చున్న సరోజ వారిద్దరికి ఒకరొకరితో పరిచయం కలిగించింది.

'ఈయన మామండలి నటులు-పార్థసారథిగారు. ఈయన మా మామయ్య వెంకటకృష్ణయ్యగారు'.

వెంకటకృష్ణయ్య సరోజ పార్థసారథుల ముఖకవళికల్లోకి క్షణంకాలం సూక్ష్మంగా పరిశీలించి అంటీ అంటనట్టు నమస్కరించాడు.

'ఓహో! పార్థసారథిగారంటే మీరేనా బాబూ! మీపేరు చాలా చాలా విన్నాను. మాటలసందర్భంలో మా సరోజకూడ మీసంగతి ఎన్నోసార్లుచెప్పింది! ఎన్నాళ్లనించో ఒక సారి మీ దర్శనంచేసుకోవాలని అనుకుంటున్నాను. ఇన్నాళ్లకి మీ పరిచయం కలిగింది. చాలా సంతోషం!'

పార్థసారథి అతనికి తిరిగి నమస్కరించి అలవోకగా ఒక చిరునవ్వు చిందించాడు.

'మీ పేరుకూడ నేనింతకుముందు చాలాసార్లు విన్నాను. రంగనాయకమ్మగారు, సరోజ, ఓమాట అప్పుడప్పుడు చెబుతూంటారు. పాపం ఆపదలో ఉన్నప్పుడు రంగనాయకమ్మగారిని మీరెంతో ఆదుకున్నారట! ఎప్పుడు మీసంగతి వచ్చినా ఆవిడ ఇదేమాట చెబుతూంటుంది.'

ఆ అభినందన మీద వెంకటకృష్ణయ్య గొంతు కొంచెం సవరించుకున్నాడు. 'ఆ! ఇందులో అంతగొప్పగా చెప్పుకోవలసింది ఏమి ఉందిబాబూ! ఆ సమయంలో ఏదోనాకు చేతనయినంత సాయంచేశాను. అంతే! అంతకన్న నేను ఎక్కువగా చేసింది ఏమిలేదు! మారంగమ్మ మనస్సు మంచిది కనుక గోరంతలు కొండంతలుచేసి మాట్లాడుతూంటుంది. ఇంతకీ రంగమ్మ నాకేమన్నా పరాయిదా ఏమన్నానా? మా పెదనాన్నగారి కుమార్తెకదూ. ఇదిగో ఇప్పుడిక మా సరోజమ్మ పెళ్లి ఒకటి చెయ్యాలని చూస్తున్నాను. ఇది కనుక జరిగిపోతే నాకొక పెద్ద బెడద తీరిపోయినట్టే!

వెంకటకృష్ణయ్య సరోజ ముంగురులు సవరిస్తూ ఉట్టిపడుతున్న వాత్సల్యంతో ముద్దుగా లాలించబోయాడు. అంతలోనే ఆమె తటాలున తల వంచి వేసుకున్నది. పార్థసారథి మరి మాట్లాడలేదు. వెంకటకృష్ణయ్య తిరిగి అగ్గిపెట్టె పైకి తీసి, రెండు మూడు పుల్లలు గీసి ఆరిపోయిన చుట్ట ముట్టించాడు. హాలులో తనాబీ వైపు,

సరోజా పార్థసారథుల వైపు మాటి మాటికి పరిశీలనగా చూస్తూ, హాయిగా అది కాలుస్తూ ఏదో ఆలోచనలో పడ్డాడు. అతని వాలకం పార్థసారథి కెంతో వింతగా కనబడింది.

వెంకటకృష్ణయ్య కొంచెం నలుపుపాలెక్కువయిన చామన చాయ. ఇంచుమించుగా యభై ఏళ్లు పైబడినా నలభై ఏళ్ల మనిషిలా దృఢంగా ఉన్నాడు. బాగా కండలు తీరిన బలిష్ట శరీరం, కోర మీసాలు చిక్కని కనుబొమ్మల మధ్య లోతయిన కళ్లు రవంత చిన్నవిగా కనిపించినా సూది మొనలా మెరుస్తున్నాయి. తేనెరంగు సిల్కు లాల్చీ తొడుక్కున్నాడు. గ్లాస్కో మల్లు పంచె కట్టుకున్నాడు. భుజాలమీద జరీ కండువా అంచు పడకకుర్చీ వెనకాల అటు, ఇటు జీరాడుతున్నవి. ముంజేతి మీద బంగారు రిస్టువాచీ తళతళ మెరుస్తూంది.

అతనికి ఆపట్టణానికి పది పదిహేను మైళ్ల దూరంలో ఉన్న ఒక పెద్ద గ్రామంలో నలభై యాభై ఎకరాల భూవసతి ఉన్నదని పార్థసారథికి అంతకుముసుపే తెలిసింది వేశభాషలను బట్టిచూస్తే అతడింకా ఎక్కువగా ఆస్తిపాస్తులున్న ఆసామీ అయి ఉండవచ్చునని తోచింది.

అంతలోనే వెంకటకృష్ణయ్య కోరమీసాలు సవరించుకుంటూ రిస్టువాచీకేసి చూసి కొంచెం కంగారుపడి తటాలున లేచినిలబడి పార్థసారథితో అన్నాడు.

'అన్నట్టు బజారులో కొంచెంపని ఉందిబాబూ! త్వరగా వెళ్లాలి. సెలవుమరి!'

'ఎప్పుడు వచ్చారు మీరు?' పార్థసారథి యాథాలాపంగా అడిగాడు.

పొద్దున్నే వచ్చాను. మళ్లీ ఈవేళ సాయంత్రానికి తిరిగి ఇంటికి వెళ్లిపోవాలి సెలవుమరి.'

వెంకటకృష్ణయ్య ందరగా అడుగులు వేసుకుంటూ చరచరా మేడమెట్లుదిగి క్షణంలో వీధిలోకి వెళ్లిపోయాడు. సరోజ వారిద్దరి మాటలు వింటూ రవంత తల వంచుకుంది. పార్థసారథి రెండు మూడు క్షణాలపాటు ఆమెవైపు చూసి గొంతు బాగా తగ్గించి అడిగాడు.

'అయితే సరోజా! మీ మామయ్యకి కాస్త ఎదిగిన కొడుకులెవరు లేరా?'

'లేరు! అసలు ఆయనకి మగపిల్లలే కలగలేదు! మా అత్తయ్యకి ఒక్కత్తే ఆడపిల్ల. ఆపైన మళ్లీ సంతానం కలగలేదు. మూడేళ్ల క్రితం ఆవిడ టైఫాయిడ్ జ్వరంవచ్చి పోయింది.'

సరోజ మధ్య మధ్య ఆలోచిస్తూ నెమ్మదిగా సమాధానం చెప్పింది. అయినా పార్థసారథి అంతర్యంలో సందేహం పూర్తిగా తొలగలేదు.

'ఓహో! అలాగా! అయితే ఆయన తిరిగి వివాహం చేసుకోలేదా?'



'లేదు!'

'ఎందుచేత? బాగా ఆస్తి పాస్తులున్న వాడేగా?'

'ఇన్ని ఏళ్లు పైబడ్డతరవాత ఇంక నాకు పెళ్లి ఎందుకని మాట్లాడకూరుకున్నారట! ఆ మధ్యన కూతురు పెళ్ళిచేసిన తరవాత మాటల సందర్భంలో మా అమ్మ మళ్లీ పెళ్లి చేసుకోవలిసిందని పట్టుపట్టింది అయినా ఆయన ఆమాట బొత్తిగా చెవికెక్కనీయలేదు.'

'అయితే ఆయన కింటిదగ్గర కాస్త కాచిపోసేవాళ్లు ఎవళ్లు లేరన్నమాట!'

'లేకేం? ఎవరోవంటాడిణి కుదుర్చుకున్నారు!...... ఎందుకిలాగ తరిచితరిచి అడుగుతున్నారు?'

'అబ్బే ఏమీలేదు! నీకింత త్వరగా పెళ్లి చెయ్యాలని ఆయన కింతటి ఉబలాటం ఎందుకు కలిగిందా అని అనుమానం వేసింది! ఇన్నాళ్ళ నించి లేని తొందర ఇప్పుడెందుకు కలిగింది చెప్మా!'

'ఏమోమరి! నాకు అంతుపట్టడంలేదు! ఇంతకుమును పెన్నడు ఆయన ఈ మాటే తలపెట్టలేదు!.....నామూలాన్ని బొత్తిగా నలుగురిలోను తల ఎత్తుకుని తిరగలేక పోతున్నారట! ఈవేళ పొద్దున్నంతా ఇదేమాట! మన ఇద్దరిమీద కొంచెం అనుమాన పడుతున్నట్టున్నారు!'

సరోజ హేలనగా లేతచిరునవ్వుచిలకరించింది. పార్థసారథి తల పంకించాడు.

'అవునవును! నేనదిపసికట్టానులే!......అయితే సరోజా! ఒకమాట అడుగుతానుగాని ఏమీ అనుకోకేం? రెండు మూడేళ్ల తరువాత ఎలాగా పెళ్లి చేసుకోవాలని అనుకున్నప్పుడు దానికి ఇప్పుడే ఒప్పుకోరాదూ? ఆ తరవాత అసలు పెళ్లి కావడమే కష్టమై పోతుందేమో! జాగ్రత్తగా ఆలోచించుకున్నావా?'

సరోజ రెండు మూడు క్షణాలపాటు లోతుగా అతనికేసి చూసి అలవోకగా నవ్వింది.

అయితే మీకు మామాటలన్నీ బాగానే వినబడ్డాయన్న మాట! మా మామయ్య పోరుపడలేక ఊరికే అలాగన్నాను. అంతే! నేనసలు పెళ్లే చేసుకోదలుచుకోలేదు'.

పార్థసారథి రవంత ఆశ్చర్యపడి అడిగాడు.

'ఏం? ఎందుచేత?'

సరోజ చెక్కిళ్ళ మీద చిరు సిగ్గు చిగురులెత్తింది. క్రీగంటి చూపులతో సన్నగా కవ్విస్తూ లీలగా ఎత్తిపొడిచింది.

'నేనెందుకు పెళ్లిచేసుకోనో మీకు తెలియదేమిటి? నాచేత చెప్పించాలని అడుగుతున్నారు! అంతే! నేనామాత్రం కనిపెట్ట లేననుకున్నారా?'

ఆ మాటల అంతరార్థం పార్థసారథి హృదయంలో ఒక మెరుపులా దూసుకుపోయింది. కొన్నాళ్ళ క్రితంవారిద్దరు ఏకాంతంగా మాట్లాడుకుంటున్నప్పుడు ఆమె ఎంతో ఆప్యాయంగా అతని గుండె మీద వాలిపోయింది. 'ఎప్పటికయినా చేసుకుంటే మిమ్మల్నే పెళ్ళి చేసుకోవాలని అనిపించిది. అది మరి కుదరదు కనక ఇక ఈ జన్మకింతే!' అని డగ్గుత్తికతో మాట్లాడలేక ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టింది. అదే మాట ఇప్పు కామె ఉట్టంకించినదని గ్రహించడానికి అతనికెంతో సేపు పట్టలేదు! ఆ స్ఫురణతో తిరిగి అతని మనస్సులో కొండంత ధైర్యం పుంజుకుంది. తామిద్దరుకలిసి కృష్ణతులాభారంతో దేశంలో నటీనటులందరిలోను గొప్ప పేరు సంపాదించుకోవాలన్న సంకల్పానికిక ఏమాత్రము అడ్డంకి కలగదన్న గట్టి ధీమా స్థిరపడింది.

కాని అంతలోనే అతని అంతరాంతరంలో ఇదమిత్థమని నిర్ణయించరాని అనుమానమేదో అదేపనిగా పట్టుకుని పీడించ సాగింది. నిజంగా సరోజ తానన్న మాటమీద ధైర్యంగా నిలబడ గలదా? తిరిగి సందేహం పొటమరించింది. కాని ఆమె ముఖంలో అటువంటి అనుమానానికికూడా ఆస్కారం కనబడలేదు! కాని ఎందుచేతనోగాని మరేం భయంలేదన్న దృఢనిశ్చయం కలగలేదు! ఉసూరుమని నిట్టూర్చి వినబడీ వినబడనట్టు నసిగాడు.

'ఈ వెర్రి మొర్రి పగటి కలలవల్ల లాభమేమిటి సరోజా! ఏదయినా కాస్త కలిగిన మంచి సంబంధంవస్తే మారు మాట్లాడక పెళ్ళిచేసుకోవడమే మంచిదేమో! ఆలోచించుకో!'

ఏదో మాటవరసకని అలాగన్నాడేకాని నిజానికతనికి సరోజ వివాహం బొత్తిగా నచ్చలేదు. వెనువెంటనే ఆమె విసుగుదలతో సణిగింది.

'అఁ! పెళ్ళిచేసుకుంటే ఇక నాటకాలకి పూర్తిగా నీళ్లు వదులుకోవలసిందే! దీనికి, వాటికి ఎక్కడ పొత్తు కుదరదు! అదీగాక లేనిపోని సంసార జంజాటంలో తలదూర్చడం నాకిష్టం లేదు.'

పార్థసారథి లోలోపలి అనుమానం అంతా క్షణంలో పటాపంచలయింది! మనస్సులో 'అమ్మయ్య!' అనుకుని తేలికపడినట్టు ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు. కిటికీలోనించి ఆకాశంవైపుచూసి కొంత ఆత్రంగా తన ఆందోళన వెల్లడించాడు.

'బాగా దట్టంగా మబ్బుపట్టినట్టుంది! అప్పుడే పన్నెండు కావస్తుంది. మరి నేను వెళ్ళాలి. మా ఆవిడ అన్నంకూడా తిన కుండా నాకోసం కనిపెట్టుకుని కూర్చుంటుంది. ఈ ఏలూరు నాటకానికి నువ్వుకూడా బాగా శ్రద్ధపట్టి పనిచెయ్యాలి! తెలిసిందా? దీనితో మన పేరు, మన మండలి పేరు, ఊరు, వాడ హోరుమని మారు మోగిపోవాలి. సాయంత్రంవెళ్ళి రాఘవతోకూడా మాట్లాడతాను. నువ్వు కాస్త శ్రమపడి పనిచెయ్యాలిసుమా! మరిచిపోకేం? మరి నేను వెళ్ళనా?'

'మరేం భయంలేదు! అనవసరంగా కంగారుపడకండి! చిట్టచివరికి అన్నీ సవ్యంగానే జరిగిపోతాయి.'

సరోజ గట్టిగా భరోసా ఇచ్చింది.

పార్థసారథి త్వరగా అడుగులు వేసుకుంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు. అన్ని వ్యవహారాలలోను ఆమె బలంగా చేయూత నిచ్చిన తరువాత అతనికెంతో గుండెదిటవు కలిగింది. కాని వెంకట కృష్ణయ్య వింతవైఖరి తలుచుకుంటే మాత్రం లోలోపల అస్పష్టమైన అనుమానమేదో గుబగుబ లాడింది! ఎన్నెన్ని విధాల ఆలోచించినా అతని ఆలోచనల అనుపాను లేవి స్ఫురించలేదు!

ఆకాశంలో క్రమక్రమంగా దట్టంగా కమ్ముకొంటున్న మబ్బుల మధ్యనించి ప్రతిధ్వనిస్తున్న ఉరుముల రణగొణధ్వనిలో మెరుపుల తళతళ మిరుమిట్లలో మరింత తొందరగా అడుగులు వేసుకుంటూ తన ఇంటివైపు వెళ్ళిపోయాడు. (సశేషం)

## ఔదార్యఘట్టాలు

### స్వచ్ఛంద కృషి

నిజామాబాద్ జిల్లాలో పోచారం కాలువ క్రింద సాగు చేస్తున్న సుమారు 1500 మంది వ్యవసాయదారులు స్వచ్ఛందంగా ఒక వారం రోజులు శ్రమించి ఆ కాలువకు పడిన గండిని మరమ్మతు చేశారు. అందువల్ల నీటిపారుదల శాఖ ఈ కాలువ లోనికి సకాలంలో నీటిని విడుదల చేయడానికి అవకాశం కలిగింది.

### ప్రమాదాన్ని తప్పించిన గాంగ్ కూలీ

ఒక రైల్వే గాంగ్ కూలీ అప్రమత్తత వల్లా, ఇంజను డ్రైవరు చాకచక్యంవల్లా సెప్టెంబరు 17వ తేదీన సికింద్రాబాద్–బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌కు సంభవించనున్న పెద్ద ప్రమాదం తప్పిపోయింది. దక్షిణ రైల్వేకు చెందిన గుంతకల్లు విభాగంలో పని చేస్తున్న ఈ గాంగ్‌కూలీ వెంకటన్‌పల్లి, ఖాదర్‌పేట స్టేషనమధ్య రైలుమార్గంలో ఫిష్‌ప్లేట్లు తొలగింపబడి వుండడం గమనించి, రైలుని ఆపుజేసి, డ్రైవరుకు ఆవిషయం తెలియజేశాడు. వెంటనే రైలుమార్గాన్ని మరమ్మతు చేశారు. 45 నిమిషాలపాటు రైలు బండి ఆగి, తిరిగి బయలుదేరింది. వారి విజ్ఞతకు రైలులోని ప్రయాణికులు ఆ గాంగ్‌కూలీనీ, డ్రైవరును అభినందించారు.

### కళ్ళదానం

హైద్రాబాదులోని సరోజినీదేవి కంటి ఆసుపత్రిలో అసిస్టెంట్ సర్జన్‌గా పనిచేస్తున్న డా॥ రమణ అక్టోబరు 15 వ తేదీన తమ తండ్రిగారైన డా॥ జె. సూర్యప్రకాష్‌రావు, రిటైర్డ్ అసిస్టెంటు సర్జన్ దివంగతులైన సందర్భంలో వారి కళ్ళను 'నేత్రనిధి'కి దానంచేశారు. అక్టోబరు 16 వ తేదీన ఆ కళ్ళను రెండు ఆపరేషన్లలో ఉపయోగించారు.

## సంస్కృతి

### నృత్యము—సంగీతము

సంగీత, నృత్యకళలకు ఆంధ్రదేశం ఆదినుంచీ ఆటపట్టు. నాట్యకళనుగూర్చి నందికేశ్వరుడు వ్రాసిన 'అభినయ దర్పణం' ఒక్క తెలుగు దేశంలో మాత్రమే కనిపిస్తున్నది. కాకతీయ సామ్రాజ్యాధీశుడూ, గణపతిదేవుని బావమరిదీ అయిన జాయపసేనాని రచించిన 'నృత్య రత్నావళి' కూడా నాట్యశాస్త్రంమీద ప్రామాణిక గ్రంథమే. జాయపసేనాని గణపతి దేవుని గజబలాధిపతి. జాయపసేనాని ప్రవచించిన సాంప్రదాయాలకు అనుగుణంగా శిల్పులు సుందరమూర్తి కల్పనలను వరంగల్లు జిల్లాలోని రామప్పదేవాలయ శిలలపై శాశ్వతంగా ప్రతిష్ఠించారు. కృష్ణా జిల్లాలోని ఒక చిన్న గ్రామం కూచిపూడి. చిరకాలంగా నాట్య కళామతల్లిని ఆరాధిస్తూ నాట్య కళను నలుదిక్కులకు వ్యాపింపజేసే నాట్యాచార్యులకు ఆలవాల మది. ఈ ఆచార్యులు నేటికీ ఆ నృత్యరత్నావళిలో ప్రవచించబడిన రీతులనే పరిపోషించుకొంటూ పరివ్యాప్తం చేస్తున్నారు. దక్షిణాది అంతటా ఈ కళాసాంప్రదాయాలను బహుళ ప్రచారం చేస్తున్నారు. సాంప్రదాయక స్వచ్ఛతను కాపాడుతూ ఈ శాస్త్రీయ నృత్యకళా సాంప్రదాయాలకు రూపకల్పనలు చేయడంలో ఈ కూచిపూడి ఆచార్యులు బహుధా సేవచేస్తున్నారు. శాస్త్రీయ కూచిపూడి నృత్యకళారంగంలో అగ్రాసనాధిపతులు వీరు.

సంగీత ప్రపంచంలో కూడా ఆంధ్రుల ప్రతిభ అపారమైనది. భారతీయ సంస్కృతీ వాహినిలో ఆంధ్రులు రాగసుధలను చిలకరించారు. అసలు తెలుగుభాష తియ్యదనమే సంగీతానికి చక్కగా కుదురుతుంది. ఈ భాషలోని లాలిత్యమూ, శబ్దఉచ్చారణ రాగ జలధికి ప్రవాహ గమనాన్నీ, ఒరవడినీ కలిగిస్తాయి. విజయనగర రాజుల కాలంలో ఇది ఒక నిర్దిష్టమైన ఆకృతిని సంతరించుకుంది. విజయనగర ప్రభువు అళియ రామ రాయలు కాలంలోనే గొప్ప సంగీత శాస్త్రజ్ఞుడు రామయామాత్యుడు 'స్వరమేళకళా నిధి' అనేగ్రంథాన్ని రచించాడు. ఇదే కర్నాటక సంగీతంలో అగ్రగణ్యమనదగిన తొలిగ్రంథం. అళియ రామరాయలు సంగీత కళావికాసానికి ఉదారంగా తోడ్పడ్డాడు. తంజావూరుని పాలించిన నాయక రాజు రఘునాథ నాయకుడు స్వయంగా గొప్ప సంగీత విద్వాంసుడు. రఘునాథనాయకుని ప్రోత్సాహంతో అతని కోరికమీద వెంకటమఖి అనే సుప్రసిద్ధ సంగీత విద్వన్మణి "చతుర్దండి ప్రకాశిక"ను రచించాడు. సంగీత శాస్త్రంలో సప్రమాణికమైన గ్రంథంగా దీనిని భావిస్తుంటారు. తాళ్ళపాక అన్నమాచార్యులవారి మృదుమధుర భక్తి రస సుధానిధులనదగిన సంకీర్తనలు తామ్ర పత్రాలపై లిఖింపబడి వున్నాయి. అన్నమాచార్యులవారు తిరుపతిలో నివసించేవారు. వెంకటేశ్వరస్వామి భక్తులు.

'సంగీత ప్రపంచంలో మరో ధృవతార క్షేత్రయ్య. వీరి 'మువ్వ గోపాల పదాలు' నేటికీ ఆంధ్రుల యింటింట ఆలపింపబడుతూ వుంటాయి.

సంగీత రసిక జన మనోల్లాస చక్రవర్తి త్యాగరాజు. పరమ భక్తాగ్రగణ్యుడు. కర్ణాటక సంగీతానికి త్యాగరాజస్వామి జీవనాడి. దాక్షిణాత్య సంగీతానికి త్యాగరాజు చేసిన సేవ అపారమైనది. సంగీత త్రిమూర్తులలో ఆయన ఒకరు. నారాయణ తీర్థులవారి సంస్కృత తరంగాలు సంగీత, నాట్య రంగాలలో కళామతల్లి కంఠసీమలో మణిఖచితహారాలు. అవి కళామతల్లి సౌందర్యాన్నే యినుమడింప జేసే భూషణాలు. జయదేవుని అష్టపదులకు దీటైన ఆణిముత్యాలు.

వార్తలలోని వెలుగు

# నాగార్జునసాగర్

భారత ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధి ఆగస్టు 4వ తేదీన నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడి ఎడమ కాలువలకు ప్రారంభోత్సవం చేశారు ఈ ప్రాజెక్టు నుంచి జలాలను పొలాలకు విడుదల చేయడంతో జాతీయ చరిత్రలో ఒక నూత్న అధ్యాయం ప్రారంభమైనదని ప్రధాన మంత్రి అభిలషించారు దేశ ప్రజలు ఆంధ్రప్రజల ఆత్మ విశ్వాసానికి ధైర్యానికి నాగార్జునసాగర్ చిహ్నమని శ్రీమతి గాంధి ఉద్ఘాటించారు

నిర్మాణంలో వున్న ఆనకట్ట





రాత్రివేళ ఆనకట్ట దృశ్యం

నాగార్జునసాగర్ ప్రాజెక్టును మొదట నందికొండ ప్రాజెక్టు అనేవారు. కీ॥శే॥ శ్రీ నెహ్రూ ఈ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేసిన సందర్భంలో దీనికి క్రీస్తు శకం రెండవ శతాబ్దినాటి ప్రసిద్ధ బౌద్ధ భిక్షువు ఆచార్య నాగార్జునుని పేరిట 'నాగార్జునసాగర్' అని నామకరణం చేశారు. ఆచార్య నాగార్జునుడు ఆ కాలంలో ఈ పరిసర ప్రాంతంలోనే నివసించాడు.

నాగార్జునసాగర్ ఆనకట్ట ప్రపంచమంతటిలోకి పెద్ద రాతి ఆనకట్ట. చివరి ఘట్టంలో 35 లక్షల ఎకరాలకు నీటిపారుదలచేసి, దాదాపు 20 లక్షల టన్నుల వరకు ఆహారోత్పత్తిని అధికం చేయ డానికి అనువుగా దీనిని నిర్మించారు.

కుడి కాలువకు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ పేరు పెట్టారు. దీని నిర్మాణం పూర్తయినప్పుడు ప్రపంచమంతటిలోకీ యిదే పెద్ద పంట కాలువ అవుతుంది. ఈ కాలువ 246 మైళ్ళ పొడవు వుంటుంది. ఇప్పటికి దీనిని 57 మైళ్ళ వరకు త్రవ్వి ఐదు లక్షల ఎకరాలకు నీటిపారుదల సదుపాయాలు కల్పించారు.

లాల్‌బహదూర్ శాస్త్రి కాలువగా వ్యవహరించబడుతున్న ఎడమ కాలువ 218 మైళ్ళ పొడవున ప్రవహించి 14.58 లక్షల ఎకరాలకు నీటిపారుదల చేస్తుంది. ఇప్పటికి 44 మైళ్ళ వరకు త్రవ్వకం ముగిసింది. 70,000 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం చేకూరింది.

చివరి దశలో జలాశయం నుంచి యీ రెండు కాలువల లోనికి 36,000 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది.

ప్రారంభం నుంచి 1967 మార్చి నెలాఖరు నాటికి ప్రాజెక్టు పనులకు సుమారు రూ. 120.67 కోట్లు ఖర్చయ్యాయి.

సేద్యానికి లభించే నీటిని మిక్కిలి ప్రయోజనకరంగా వినియోగించుకోవడానికి వీలుగా జాగ్రత్త చర్యలు గైకొనబడినవి. ఈ వరప్రసాదాన్ని సంపూర్ణంగా అనుభవించడానికై సువిశాల మైన దీని ఆయకట్టు ప్రాంతంలో సేద్య కార్యకలాపాలు ఒక మహోద్యమంవలె సాగుతాయి. దూరదృష్టితో వ్యవసాయ–ఆర్థిక సర్వేలను, భూమి నాణ్యతల సర్వేలను ఇంకా ఇటువంటి కొన్ని ఇతర పరిశీలనలను చేయడం జరిగింది. నాగార్జునసాగర్ దేశానికి సంపూర్ణంగా ప్రయోజనం కలిగిస్తుంది.




ఎడమ కాలువ సొరంగం

## నాగార్జున సాగర్ నిర్మాణంలో కొన్ని ముఖ్య ఘట్టాలు

(1) 1955 జూన్ లో నాగార్జునసాగర్ కంట్రోలు బోర్డును ఏర్పాటుచేశారు.

(2) 1955 డిసెంబరు 10వ తేదీన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ నిర్మాణ కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు.

(3) 1966 అక్టోబరు 11వ తేదీన కుడివైపు కాలువ త్రవ్వకానికి పునాదిరాయి వేయుటం జరిగింది.

(4) 1957 జులై 2వ తేదీన రాతి డాం నిర్మాణం కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరిగింది.

(5) 1959 ఫిబ్రవరి 7వ తేదీన హాలియా నదిపై అక్విడెక్టుకు పునాదిరాయి వేశారు.

(6) 1959 సెప్టెంబరు 9న ఎడమకాలువ సొరంగంపనికి ప్రారంభోత్సవం జరిగింది.

(7) 1965 జూన్ 11న గుర్రపునాడా ఆకారం గల సొరంగం ద్వారా కృష్ణానదీజలాల మళ్ళింపుకు ప్రారంభోత్సవం జరిగింది.




మళ్ళింపు సొరంగం

పండించు కొందు మిర్వది లక్షలకు మించి క్షేత్ర రాజముల నీ చెమ్మసోక
ఆకొన్న పేద తాలూకాల దుర్దశల్ తొలగిపోగలవు నీ చెలిమి సోక
కరుణ కొంచెములేని కరువు బెబ్బులిపండ్లు రాలిపోగలవు నీ రాకచేత
ఆశోపహతి తప్తమైన దీనుల చింత మాసిపోగలదు నీ మైత్రి కతన
యెన్ని తరముల నుండియో యెదురుచూచి
నిలుపుకొన్నాము నిన్ను సాన్నిధ్యమందు
దిగులువాసెను మా కష్ట దినములెల్ల
చనిమె నాగార్జునాచార్య సాగరంబ!

—జాషువా

# సాహితీ సదనం

గ్రంథ సమీక్ష

## పూర్వకావ్యాల ప్రచురణ

గడచిన రెండు శతాబ్దాలకాలంలో మన ప్రజలమీద పాశ్చాత్య భావ ప్రభావం బాగా ఎక్కువగా వుంది. దీనివల్ల కొన్ని లాభాలు చేకూరక పోలేదుకాని మన దేశీయమైన సంస్కృతి పట్ల, సాహిత్యాది లలితకళల పట్ల చిన్న చూపు చూడడం కూడ ఎక్కువగానే జరిగింది. బయటివారు మెచ్చుకుంటేనే గాని మన శక్తి సామర్థ్యాలు మనకు అర్థంకాని పరిస్థితికూడా వచ్చింది.

తెనుగు సాహిత్యంలో, ముఖ్యంగా ఆధునిక యుగ మన్నది ప్రవేశించిన తర్వాత ప్రాచీన గ్రంథాలపట్ల నిరాదరణ ప్రబలింది. యావద్భారత దేశానికి శిరోధార్యములైన భారత, భాగవత, రామాయణాలను మినహాయిస్తే, మిగిలిన కావ్యాలూ, ప్రబంధాలూ యీ కాలంలో ఎవరినీ అంతగా ఆకర్షించ లేకపోయినవి. ప్రబంధకవిత్వపు వింతపోకడల పట్ల, ఆ కాలపు కవుల పాండిత్య ప్రకర్ష, క్లిష్టాన్వయాలు, సర్కసు ఫీట్లువంటి విచిత్రకవితా ప్రదర్శనపట్ల అసహ్యం కలిగింది. దీనివల్లనే ఆధునికకవితా యుగంలో రకరకాలైన సాహిత్య విప్లవాలురావడం, క్రొత్తకోసం, మంచికోసం నిరంతరాన్వేషణ జరగడం ప్రారంభమైంది. తెనుగు సాహిత్యంలో యింకా యిప్పటికీ యీ యుగమే నడుస్తున్నది. పద్యారచనలో సారళ్యము, నిరాడంబర కవితావైభవము, భావ ప్రాధాన్యము, సాంఘిక ప్రయోజనాత్మకమైన ఊహాప్రకటనలకు నేడు గౌరవస్థానం లభించింది. మరొక వైపు ప్రాచీన సాహిత్యమంతా అంత తీసిపారవేయ దగినదేనా అనే పునరాలోచనకూడా ప్రారంభమైంది.

ఈ పరిస్థితుల్లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు పూర్వకావ్యాల ప్రచురణకు పూనుకున్నారు. పూర్వప్రబంధాలను చవుకగా, అందమైన రూపంలో అందించాలనే ఉద్దేశంతో మొత్తం 50 సంపుటాలను ప్రకటించాలని నిర్ణయించారు. దీనికి కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వమూ సబ్సిడీలు మంజూరు చేయడానికూడా అంగీకరించి కొంతడబ్బు విడుదలచేసినవి. పూర్వ కావ్యాలు, ప్రబంధాలు 27 సంపుటాలుగానూ, భారత, భాగవత, రామాయణాదులను సంగ్రహ రూపంలో 15 సంపుటాలుగానూ, పూర్వకావ్యాలనుండి ఏరికూర్చిన ముఖ్యభాగాలను 8 సంపుటాలు గానూ ప్రకటించాలని అకాడమీ సంకల్పించింది. ఇప్పటికి దశకుమారచరిత్ర, శృంగార నైషధము, శృంగార శాకుంతలము, మనుచరిత్ర, వసుచరిత్ర, కవికర్ణరసాయనము, రామాభ్యుదయము, పాండురంగమహాత్మ్యము, ఆముక్తమాల్యద, సారంగధరచరిత్ర, విజయవిలాసము, హరిశ్చంద్రోపాఖ్యానము, కేయూరబాహు చరిత్ర, మొల్లరామాయణము, శతకసంపుటము, ప్రభావతీ ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము, పారిజాతాపహరణము మొదలగు గ్రంథాలు వెలువడినవి. ఈ ప్రచురణలలో ముఖ్యమైన విశేషము ప్రతిగ్రంథానికి, సామాన్య పాఠకునికి కూడా ఉపయోగ కరంగా వుండేటట్లు సమగ్రమైన పీఠిక వ్రాయించడం; ప్రతిగ్రంథం యొక్క పుట్టుపూర్వోత్తరాలు, కవి జీవితము, యితర విశేషాలు యిందులో స్థూలంగా పాఠకులకు పరిచయం చేయడం జరుగు తున్నది. వీటిలో చాలావాటి ఖరీదు ఒక రూపాయి పెట్టారు. అచ్చు చక్కగా వుండడమేకాక దిట్టమైన క్యాలికో బైండు అట్టతో పది కాలాలపాటు మనగలిగినట్లు వుండడం వల్ల వీటికి మార్కెట్టులో మంచి గిరాకీ ఏర్పడింది. ఈవరుసలో ఏకావ్యం వచ్చింది అని ఎప్పటికప్పుడు కనుక్కుంటూ ప్రతులు అయిపోతా యేమోననే భయంతో పాఠకులు హడావిడి పడడంచూస్తే, చవుక గ్రంథాల ప్రచురణోద్దేశం పూర్తిగా నెరవేరినట్లే కనిపిస్తుంది. అయితే ప్రతులు 2 వేలు మాత్రమే వేయాలని ఆదిలో నిర్ణయం చేసు కున్నందువల్ల కావలసిన వారందరికీ కాపీలు దొరకక చాలామంది ఆశాభంగం చెందడం జరుగుతున్నది. ఇటీవలనే, మిగిలినవి నాలుగు వేల కాపీలు ముద్రించాలనే నిర్ణయం తీసుకున్నారు.

కన్నతల్లిని కాదన్నట్లు, తన పూర్వసంస్కృతి, సంప్రదాయాలను నిరాదరించిన ఏజాతికూడా నిజమైనపురోగమనం సాధించ లేదు. ఆధునిక శాస్త్రీయ, సాంకేతిక విప్లవ విజయాలపట్ల ఎంత అభిమానం వున్నా, వాటి దృష్ట్యా నేటి జవితం అభివృద్ధి చెంద వలసిన అవసరం వున్నా, వీటి అంతటికీ పునాది ప్రాయమైన మూల బీజములు ప్రాచీన సంస్కృతిలో యిమిడి వున్నాయనే సత్యాన్ని మరువరాదు. ప్రగతిని, నిరంతరం మార్పుచెందుతూ వస్తూవున్న ఒక అఖండ ప్రవాహంగా గుర్తించడం అవసరం. ఈనాటి ప్రగతి అంతా హఠాత్తుగా ఆకాశమునుండి వూడిపడినది కాదు. భూతకాలం పునాదిగా, వర్తమానం వంతెనగా మాత్రమే భవిష్యత్తు నిర్మించబడుతూవుంటుంది. ఈ సత్యాన్ని గమనించడం అవసరం.

తెనుగువారిలో పత్రికలుకాని, పుస్తకాలుగానీ కొనుక్కొనే అలవాటు చాలా తక్కువనే చెప్పాలి. ప్రతియింటిలో చిన్నదైనా సరే, ఒక గ్రంథాలయం ఏర్పాటు చేసుకోవాలనే దృష్టి పూర్తిగా శూన్యం. సాహిత్య అకాడమీవారు తలపెట్టిన చవుక పుస్తకాల ప్రచురణ పథకాల వల్ల యిటువంటి అవకాశం తప్పనిసరిగా ఏర్పడుతుంది. ఆస్తులు సంపాదించి యిచ్చినా యివ్వలేకపోయినా, మనపిల్లలకు యిటువంటి సదవకాశమైనా కల్పించడం మనలో ప్రతివారి ధర్మం కాదా?

—"చైతన్య"

# క్రీడారంగం

'జైరాజ్'

పదకొండు సంవత్సరాల క్రిందట ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పటినుంచీ రాష్ట్ర ప్రభుత్వం ఆటలు, క్రీడల అభివృద్ధి పట్ల చాలా ఆసక్తి కనబరుస్తున్నది. రాష్ట్రంలో ఆటలు, క్రీడల ప్రమాణాన్ని పెంపొందించడానికి ఆంధ్రప్రదేశ్ క్రీడా వ్యవహారాల మండలి కృషిచేస్తున్నది. ఈ సంస్థ ప్రయత్నాల ఫలితంగా వచ్చే కొన్ని సంవత్సరాలకాలంలో క్రీడాభిలాషులకు ఇతోధికంగా మంచి సౌకర్యాలు చేకూరగలవని నేను నమ్ముతున్నాను.



*ఉస్మానియా విశ్వవిద్యాలయ ఫుట్ బాల్ టీము, అంతర్ విశ్వవిద్యాలయ (దక్షిణ మండలం) ఫుట్ బాల్ టోర్నమెంటులో రన్నర్స్*

హైద్రాబాదు నగరంలో చక్కగా నిర్మించిన మూడు స్టేడియములున్నాయి. దేశంలోని ఉత్తమమైన స్టేడియములలో లాల్ బహదూర్ స్టేడియం ఒకటి. గోషామహల్‌లోని పోలీసు స్టేడియంలో ఫుట్ బాల్ పోటీలు జరుగుతుంటాయి. దీనిలో జాతీయ హాకీ ఛాంపియన్ షిప్ పోటీలు కూడా జరిగాయి. బేగంపేటలోని పోలీసు లైన్స్‌లో స్టేడియమును నిర్మించడంతో ఇప్పుడు హాకీ క్రీడా కార్యకలాపాలు దాదాపు పూర్తిగా సికింద్రాబాదుకే పరిమిత మయ్యాయి. బేగంపేట స్టేడియమును చక్కగా వినియోగించుకోవాలి.

జిల్లా ప్రాంతాలలో కూడా స్టేడియముల నిర్మాణం విరివిగా జరుగుతున్నది. అనంతపురంలోని సంజీవరెడ్డి స్టేడియం ఉపయోగంలోనికి వచ్చింది. గుంటూరులోని బ్రహ్మానందరెడ్డి స్టేడియం దాదాపు పూర్తికావచ్చింది. క్రీడా మండలి సహాయంతో అనేక ఇతర ప్రదేశాలలో కూడా స్టేడియముల నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

క్రీడా మండలి ఆట మైదానాలను విరివిగా సంపాదించడం పట్ల దృష్టిని కేంద్రీకరించాలి. వచ్చే కొన్ని సంవత్సరాలలో హైదారాబాదు నగరంలో ఆట మైదానాలకి చాలినంత స్థలాన్ని సమంజసమైన ధరకు సమకూర్చుకొనడం దుర్లభం కావచ్చు. కనుక మండలి వెంటనే పూనుకొని వీలైనంత ఎక్కువ స్థలాలను సేకరించాలి.

గుంటూరులో ప్రాంతీయ శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పడానికి మండలి నిశ్చయించింది. ఇలాంటి కేంద్రాలను రాష్ట్రంలోని ఇతర ప్రదేశాలలో కూడా స్థాపించడం అవసరం.

ఇటీవల అథ్లెటిక్స్ అసోసియేషన్ కార్యక్రమాలలో మళ్ళీ ఉత్సాహం కనిపిస్తున్నది. అథ్లెటిక్ పోటీలను క్రమం తప్పకుండా నిర్వహిస్తున్నారు. రాష్ట్ర అథ్లెటిక్స్ చరిత్రలో మొదటిసారిగా గడచిన అంతర్ రాష్ట్ర పోటీలలో మన యువ అథ్లెట్లు అద్భుతమైన సామర్థ్యం ప్రదర్శించారు. వారు అరడజను వరకు స్వర్ణ, రజత పతకాలను గెలుచుకున్నారు.

గత నెలలో లాల్ బహదూర్ స్టేడియములో జరిగిన అంతర్ పాఠశాలల అథ్లెటిక్ ఛాంపియన్ షిప్ పోటీలలో సుమారు వేయిమంది బాల బాలికలు ఉత్సాహంతో పాల్గొన్నారు. ఇంతటి క్రమ పద్ధతిలో ఈ పోటీలు జరగడం ఇదే ప్రథమం. జయప్రదంగా సాగిన ఈ పోటీలలో బాలుర పాఠశాలలు 26, బాలికల పాఠశాలలు 12 పాల్గొన్నాయి. ఈ ఛాంపియన్ షిప్ పోటీలలో అనేక రాష్ట్ర స్థాయి ప్రమాణాలనూ, అఖిల భారత ప్రమాణాలను కూడా అధిగమించడం జరిగింది. 100 మీటర్ల హర్డల్స్ పందెంలో సెయింట్ పీటర్స్ హైస్కూలు విద్యార్థి ఎం. ఎస్. ఆల్బర్ట్ జాతీయ ప్రమాణాన్ని అధిగమించాడు. ద్వితీయుడుగా నెగ్గిన సెయింట్ మేరీస్ హైస్కూలు విద్యార్థి పి. జ్ఞానేశ్వర్ జాతీయ ప్రమాణానికి సమానంగా వచ్చాడు. లిటిల్ ఫ్లవర్ హైస్కూలుకు చెందిన ఇతేషాముద్దీన్ 100 మీటర్ల పరుగు పందెంలో జాతీయ ప్రమాణాన్ని దాటాడు. జాతీయ ప్రమాణం 12.4 సెకన్లు కాగా 12.2 సెకన్లలోనే ఆయన ఈ పోటీని పూర్తి చేశాడు. ఇదే పాఠశాలకు



*దక్షిణ కేంద్ర రైల్వే స్పోర్ట్స్ అసోసియేషన్ వాలీబాల్ టీము*

చెందిన మహేశ్వర్ అఖిల భారత రికార్డుకు సమానంగా వచ్చాడు. మినర్వా హైస్కూలు విద్యార్థిని వరలక్ష్మి, గుండును 6.88 మీటర్ల దూరం విసిరింది. ఈ దూరం జాతీయ ప్రమాణం కంటే 0.9 మీటర్లు ఎక్కువ.

లాలాగూడలోని రైల్వే బాయిస్ పాఠశాల జట్టు మొత్తం 130 పాయింట్లు తెచ్చుకొని టీమ్ ఛాంపియన్ షిప్‌ను గెలుచుకున్నది. బాలికల టీమ్ ఛాంపియన్ షిప్ 76 పాయింట్లు పొందిన రైల్వే మిక్స్‌డ్ మిడిల్ స్కూల్ జట్టుకు లభించింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి హరికిషన్ టోక్యోలో జరిగిన ప్రపంచ విశ్వవిద్యాలయ క్రీడోత్సవాలలో భారత విశ్వవిద్యాలయాలకు ప్రాతినిధ్యం వహించిన విషయాన్ని ఈ సందర్భంలో పేర్కొనడం అప్రస్తుతం కాదు. ఈ ఉత్సవాలలో పాల్గొన్న మరొక రాష్ట్ర క్రీడాకారుడు శివప్రకాశ్ మిశ్రా. ఇతను కూడా ఉస్మానియా విద్యార్థియే. ఈ ప్రసిద్ధ టెన్నిస్ ఆటగాడు పాకిస్తాన్‌కు చెందిన ఖ్వాజీని ఓడించాడు. డబుల్స్‌లో సి. జె. కె. భూపతి (మద్రాసు)తో కలిసి ఆడి థాయిలాండ్ ఆటగాళ్ళు హెంగ్రాస్మ, సిరిక్ యాలను ఓడించారు. దేశంలోని ప్రసిద్ధ టెన్నిస్ ఆటగాళ్లయిన ఆర్. కృష్ణన్, జైదీప్ ముఖర్జీ, ప్రేమ్‌జిత్‌లాల్‌ల కోవకు చెందినవాడు మిశ్రా.

ప్రజాభిమానాన్ని ఎక్కువగా చూరగొన్న ఇతర క్రీడలు ఫుట్‌బాల్, క్రికెట్. కొలంబోలో జరిగిన పెంటాంగ్యులర్ పోటీలలో రాష్ట్ర జట్టు బాగా విఫలాలు పొందవలసి వచ్చింది. కలకత్తాలో జరిగిన ఐ. ఎఫ్. ఏ. షీల్డ్ పోటీలో పాల్గొన్న జట్టు కూడా ప్రతిభతో ఆడలేక పోయింది. రాష్ట్ర ఫుట్‌బాల్ జట్టులో బాగా మార్పులు చేయవలసిన అవసరం వున్నట్లు కనిపిస్తున్నది.

అంతర్విశ్వ విద్యాలయాల దక్షిణ మండలం ఫుట్‌బాల్ ఛాంపియన్లయిన ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ఈ సంవత్సరం ఆ ఆధిక్యాన్ని కోల్పోయారు. ఫైనల్స్‌లో బెంగుళూరు ఉస్మానియాను ఒక గోలుతో ఓడించింది.

హైద్రాబాదు ఎప్పుడూ ప్రసిద్ధ క్రికెట్ కేంద్రంగా పరిగణించ బడుతున్నది. హైద్రాబాదు జట్టు 1937లో రాంజీ ట్రోఫీ గెలుచుకున్నది. మరో రెండు పర్యాయాలు ఫైనల్స్‌లో పాల్గొన్నది. అయితే క్రిందటి సంవత్సరం హైద్రాబాదు జట్టు దక్షిణ మండలం పోటీలలో మద్రాసు, మైసూరు, కేరళలతో ఓడిపోయింది. ఈ సంవత్సరం హైద్రాబాదు జట్టు బాగా ఆడుతున్నది. అయితే దక్షిణ మండలం ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకునే అవకాశాలు అంతగా లేవు. ఈ యేడాది ఆబిద్‌అలీ ఆటలో మంచి సామర్థ్యం కనబరుస్తూ ఉత్తమ ఆల్‌రౌండర్‌గా రాణిస్తున్నాడు. మైసూరుపై హైద్రాబాదుకు మొదటి ఇన్నింగ్స్ ఆధిక్యం లభించడానికి ఆతని బౌలింగ్ ప్రముఖంగా తోడ్పడింది.

ఆంధ్ర క్రికెట్ జట్టు హైద్రాబాదుతో బాగా ఆడలేక పోయింది. మహేంద్ర కుమార్, భావన్న, శ్యామ్, రామ్‌ప్రసాద్‌లు ఆంధ్ర జట్టులో పాల్గొనే అవకాశం వున్నందువల్ల ముమ్ముందు జరిగే పోటీలలో ఈ జట్టు సమర్థంగా ఆడవచ్చు.

దక్షిణ మండలం జట్టుకు ఎన్నిక చేసిన 14 మందిలో రాష్ట్ర ఆటగాళ్ళు అయిదుగురు వున్నారు. ఆస్ట్రేలియాలో పర్యటించడానికై భారత జట్టును ఎన్నిక చేసే సందర్భంగా నిర్వహించబడే శిక్షణ శిబిరంలో కూడా వీరు పాల్గొంటారు. ఆ ఆటగాళ్ళు వీరు: పటౌడీ, జయసింహ, అబ్బాస్‌అలీ బేగ్, ఆబిద్ అలీ, గోవిందరాజ్ – వీరందరూ హైద్రాబాద్ వారే. దక్షిణ మండలం జట్టుకు జయసింహ కెప్టెన్‌గా నామినేటు చేయబడగా, ఆస్ట్రేలియాతో ఆడే భారత జట్టుకు సారథ్యం వహించడానికి పటౌడీ ఏకగ్రీవంగా ఎన్నిక చేయబడినాడు. ప్రతిభావంతుడైన యువ ఆటగాడు వహీద్‌యార్‌ఖాన్‌కు దక్షిణ మండలం జట్టులో స్థానం లభించక పోవడం విచారకరం.

సీనియర్ ఆటగాళ్ళు విఫలులు కాగా హైద్రాబాదు జూనియర్ ఆటగాళ్లు పి. రామచంద్రరావు స్మారక షీల్డును మద్రాసు, మైసూరు జట్లను ఓడించి నిలబెట్టుకున్నారు. అంతర్ సంఘాల జూనియర్ టోర్నమెంటులో జయంతీలాల్, ఎ. ఐ. ఎ. హుసేన్, ఎం. సింగ్, కె. నయీముద్దీన్‌లు మంచి ఆట ప్రదర్శించారు.

హైద్రాబాద్ జట్టు పది వికెట్లతో సికింద్రాబాద్ జట్టును ఓడించి జోనల్ ఛాంపియన్‌షిప్‌ను పొందింది. సికింద్రాబాదు జట్టు రెండవ ఇన్నింగ్స్‌లో కూడా 118 పరుగులు మాత్రమే చేయగలిగింది. హైద్రాబాదు మొదటి ఇన్నింగ్స్‌లో 240 పరుగులు చేయగా రెండవ ఇన్నింగ్స్‌లో నష్టం లేకుండా 19 పరుగులు చేసింది. అందరికంటే ఎక్కువ పరుగులు సాధించిన వహీద్ యార్‌ఖాన్ 67 పరుగులు చేశాడు.

ఇటీవలి సంవత్సరాలలో టేబిల్ టెన్నిస్‌లో హైద్రాబాదుకు చెందిన వర్ధమాన క్రీడాకారులు మంచి పురోభివృద్ధిని కనబరుస్తున్నారు. వీరు జూనియర్ టీమ్ ఛాంపియన్‌షిప్‌ను కైవసం చేసుకున్నాడు. వీరిలో ఉద్దండుడైన ఎన్. వి. అశోక్ ఈ సంవత్సరం ప్రతిభావంతమైన ఆట ప్రదర్శిస్తున్నాడు. సీజన్ ప్రారంభంలోనే రాష్ట్ర ఛాంపియన్ మీర్ కాసిమ్ అలీని ఓడించాడు. అశోక్ ఈ యేడాది మరో రెండు పెద్ద టైటిల్స్‌ను కూడా గెలుచుకున్నాడు. స్పోర్ట్స్ జర్నలిస్టుల సంఘం బహూకరించిన డి. హెచ్. కేశవరావు ట్రోఫీని, ఆల్ సెయింట్స్ హైస్కూల్ బహిరంగ టోర్నమెంటు బిరుదాన్నీ ఆయన పొందాడు.

బెంగుళూరులో జరిగిన దక్షిణ మండలం ఛాంపియన్‌షిప్స్ కడపటి పోటీలో జాతీయ ఛాంపియన్ ఎఫ్. ఆర్. ఖోడాల్‌జీని ఓడించి మీర్ కాసిమ్ అలీ సంచలనం కలిగించాడు. అయితే ఆయన తరువాత బొంబాయిలో జరిగిన ఆటలో ఒక స్థానిక యువ ఆటగానితో ఓడిపోయాడు.

ఉస్మానియా జట్టు దక్షిణ మండల అంతర్విశ్వవిద్యాలయ టేబిల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను సాధించింది. అయితే అఖిల భారత ఛాంపియన్ షిప్ ఫైనల్స్‌లో ఢిల్లీతో 4–5 స్కోరుతో ఓడిపోయింది.

ఈ మధ్యకాలంలో మంచి పురోభివృద్ధి సాధించిన మరొక ఆట వాలీబాల్. రెండు సంవత్సరాల క్రితం హైద్రాబాదు, జాతీయ

ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకున్నది. అనేక సంవత్సరాలుగా ఓటమి ఎరుగని ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టు గత యేడాది అక్టోబరులో జరిగిన లీగ్ ఛాంపియన్ షిప్స్‌లో దక్షిణ కేంద్ర రైల్వే స్పోర్ట్స్ అసోసియేషన్ జట్టుతో ఓడిపోవలసి వచ్చింది.

హాకీ సీజన్ కూడా ప్రారంభమైంది. ఈ ఆటలో సైనిక జట్టది పై చేయిగా వుంటున్నది. ప్రిన్స్ ముకర్రంజా మజీదీ టోర్నమెంటులో ఆరిలరీ సెంటర్ ఏ. ఓ. సి. సెంటర్‌ను ఒకే ఒక గోల్‌తో ఓడించింది. గెలుపు చేకూర్చిన ఆ గోల్‌ను సెంటర్ ఫార్వర్డ్ మాన్ సింగ్ ప్రతిభావంతంగా కొట్టాడు. అయితే ఏ. ఓ. సి. సెంటర్ జట్టు దక్షిణ కేంద్ర రైల్వే స్పోర్ట్స్ అసోసియేషన్ జట్టును ఓడించి హెన్రీ పాల్ స్మారక టోర్నమెంటులో గెలుపొందింది. ఈ మ్యాచ్‌లో జరిగిన ఒకే ఒక గోల్‌ను ఔట్ సైడ్ రైట్ బర్లా చేశాడు.

కార్మిక సంక్షేమ శాఖ అంతర్ ఫ్యాక్టరీ టేబిల్ టెన్నిస్ టోర్నమెంటును నిర్వహించి కార్మికులు, శ్రామికులు కూడా క్రీడలలో, ఆటలలో ప్రతిభావంతంగా లాభసాటిగా పాల్గొన గలరనే విషయాన్ని నిరూపించింది. సింగిల్స్ పోటీలకు 40 వరకూ, డబుల్స్ పోటీలకు 30 వరకూ ఎంట్రీలు వచ్చాయి నగరంలోని భారీ విద్యుత్ పరికరాల కర్మాగారంలోనూ సింథటిక్ డ్రగ్స్ ఫ్యాక్టరీలోనూ పని చేస్తున్న కొంతమంది రష్యా, జెకొస్లోవాకియా దేశస్థులు ఈ టోర్నమెంటులో పాల్గొని దీనికి ఘన విజయాన్ని చేకూర్చారు. సింథటిక్ డ్రగ్స్‌కు చెందిన వి. పి. కాలే తుంగభద్ర ఇండస్ట్రీస్‌కు ప్రాతినిధ్యం వహించిన బి. జగదీశ్వరరావును ఓడించి సింగిల్స్ బిరుదాన్ని పొందాడు. ఉషా వర్క్స్ ప్రతినిధులు చందానా, అనిల్ షహీలు డబుల్స్ ఫైనల్స్‌లో గెలుపొందారు. ఈ పోటీలో వీరి ప్రత్యర్థులు రాజు, ఛార్లెస్‌లు. (కోరమండల్ ఫెర్టిలైజర్స్). జనసంబంధ, కార్మిక శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ విజేతలకు బహుమతులు అందజేశారు. ఇంత చక్కగా టోర్నమెంటును నిర్వహించినందుకు కార్మిక సంక్షేమ శాఖను మంత్రి ప్రశంసించారు. ఫ్యాక్టరీలలో పనిచేసే శ్రామికుల ప్రయోజనార్థం ఇటువంటి టోర్నమెంట్లను ఇతోధికంగా నిర్వహించాలని శ్రీ లక్ష్మణ్ అన్నారు.

# యాత్రలు

## కాశ్మీరుకు ప్రత్యేకరైలు

రాష్ట్ర జనసంబంధశాఖ, 1967 అక్టోబరులో కాశ్మీరు యాత్ర నిమిత్తం ప్రత్యేక రైలును ఏర్పాటు చేసింది. యాత్రికులు మధ్యలో ఆగ్రా, ఢిల్లీ, చండీఘర్, భాక్రా నంగల్, లూధియానాలనుకూడ సందర్శించారు. రైలుచార్జీలు భోజనవసతి సౌకర్యాలు, దర్శనీయ స్థలాలకు రవాణా ఖర్చులు కలుపుకుని మనిషికి రు 400/- ల చొప్పున ఖర్చు అయింది.

## అంతర్జాతీయ యాత్రిక సంవత్సరం

అన్ని దేశాలప్రజలలో పరస్పర అవగాహనను పెంపొందించడానికి 1967 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ యాత్రికుల సంవత్సరంగా నిర్వహించాలని ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ నిర్ణయించింది. ఐక్యరాజ్యసమితిలోని యితర సభ్యరాజ్యాలతో పాటు భారతదేశం యీ ఉత్సవాలను నిర్వహిస్తున్నది. "యాత్ర, శాంతికి దోహదం చేస్తుంద"నేది అంతర్జాతీయ యాత్రిక సంవత్సర సందర్భంలో అనుసరించ వలిసిన నినాదం.

వివిధ రాష్ట్రాలలో ప్రాంతీయ పండుగలతో పాటు యాత్రికుల వారోత్సవాలను నిర్వహించాలని ప్రతిపాదించారు. దీనివల్ల సంవత్సరమంతా భారతదేశమంతటా జరిగే వివిధ సంఘటనలు యాత్రికులను మంత్ర ముగ్ధులను చేస్తాయి.

ప్రప్రథమంగా మద్రాసు రాష్ట్రం, 1967 జనవరి 19 నుండి 26 వరకు యాత్రికుల వారోత్సవాలను నిర్వహించింది. సంక్రాంతి పండుగతోపాటు యీవారోత్సవాన్ని నిర్వహించింది. దర్శనీయస్థలాలకు ప్రత్యేక యాత్రలు ఏర్పాటు చేయబడ్డాయి.

మైసూరులో అక్టోబరులో దసరా పండుగతోపాటు యీ వారోత్సవాన్ని నిర్వహించారు. మహారాష్ట్రలో నవంబరులో దీపావళి పండుగతో యీ వారోత్సవాన్ని నిర్వహించారు.

డిసెంబరులో గోవాను సందర్శించే యాత్రికులను క్రిస్‌మస్ పండుగలు ఆకర్షిస్తాయి.

వివిధదేశాలకు చెందిన ప్రజలు విభిన్న సంస్కృతులను, సంప్రదాయాలను అవగాహన చేసుకుని, వాటివిలువలను గుర్తించి తద్వారా ప్రపంచంలో శాంతిని పటిష్ఠం చేసేందుకు యీ అంతర్జాతీయ యాత్రికుల వార్షికోత్సవం దోహదం చేస్తుంది.

## రాష్ట్రపతి సందేశం

"యాత్ర శాంతికి దోహదం చేస్తుంద" నే లక్ష్యంతో 1967 ను అంతర్జాతీయ యాత్రిక సంవత్సరంగా నిర్వహించాలని ఐ. రా. స. నిర్ణయించడం సముచితమైన విషయం ప్రపంచంలోని ప్రజల మధ్య పరస్పర అవగాహన, శాంతి మున్నెన్నడు లేనంతగా నేడు చాలా అవసరం. పరస్పర అవగాహన ద్వారా మాత్ర మే శాంతి ఏర్పడుతుంది. దీని సాధనకు యాత్ర ప్రధానమైన మార్గం"

# చిత్రసీమ

## ఉత్తమ తెలుగు చిత్రాలకు రాష్ట్ర బహుమతులు

రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధికి ప్రోత్సహించడానికి ఉన్నత సాంకేతిక ప్రమాణాలలో కళాత్మకమైన, ప్రబోధాత్మకమైన చిత్రాలను నిర్మించడానికి 1965 నుండి ప్రతి సంవత్సరం దిగువతెల్పిన వివరాలకు చెందిన ఉత్తమ చిత్రాలకు రాష్ట్రప్రభుత్వ బహుమతులు యిస్తున్నది. (1) కథా చిత్రాలు, (2) డాక్యుమెంటరీ చిత్రాలు (3) బాలల చిత్రాలు (4) విద్యా విషయిక చిత్రాలు.

భారత దేశంలో ఎక్కడైన సరే నిర్మించబడిన తెలుగు కథా చిత్రాలకు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నిర్మించబడిన డాక్యుమెంటరీ చిత్రాలు, విద్యా విషయిక, బాలల చిత్రాలకు యీ బహుమతులు యిస్తారు.

ఉత్తమ చిత్రాలకు యిచ్చే బహుమతులకు సంబంధించిన నియమ నిబంధనలను 1965 జనవరి 21వ తేదీ లగ జి. ఓ. ఎం. ఎస్, నెం. 42 సాధారణ పరిపాలన (సమాచార, పౌర సంబంధం) శాఖ ఉత్తర్వులో పేర్కొన్నారు.

## బాలల చలన చిత్రసంఘం

బాలల చలన చిత్రసంఘాన్ని ఏర్పాటు చేయాలని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది, జనసంబంధ శాఖ బాలల చిత్రాలను నిర్మించి బాలలకు ఉచితంగా ప్రదర్శిస్తుంది. బాలల చలన చిత్ర కేంద్రాలవంటి సంస్థలకు ఉచితంగా సరఫరా చేస్తుంది.

# కేంద్రం ప్రకటించిన 1967-68 ప్లానులో ఆంధ్రులకు జరిగిన అన్యాయం

—వావిలాల గోపాలకృష్ణయ్య

ఆంధ్రప్రదేశ్ 1967_68 బడ్జటు 27_7_1967 తోపూర్తి అయింది. అభివృద్ధికార్యక్రమాలకు అనుదిన కార్యక్రమాలకు అనుదిన వ్యయానికి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ అస్తువిస్తూగా వుంది. అందుకని అన్నిశాఖల్లో వ్యయంలో తగ్గింపులు_ఉద్యోగస్తులలోతగ్గింపులు - చేస్తున్నామని ఆంధ్రప్రభుత్వం తేల్చిచెప్పింది.

అందుకు నాల్గవ పంచవర్షప్రణాళిక సాంవత్సరిక ప్లానులో రూ74 కోట్లకు అంచనాలు వేశాం అని అది కేంద్రం అంగీకారం పొందాక అదే, నికరంగా తేల్చిన ప్లాను అని ఆంధ్రప్లానింగు మంత్రి తేల్చి చెప్పారు. 26_7_67 అంటే, ఒకరోజు ముందు కేంద్రప్రభుత్వం 1967_68 సంవత్సరపు వార్షిక ప్లానును ప్రకటించింది. రెంటికి పొంతన కుదరడంలేదు. అంటే ఈ పై చెప్పిన ప్లానుకూడా అమలు జరిగే ఆశలేదని తేలిపోతున్నది. అంతేకాదు ఈ వేసిన కేంద్ర వార్షిక ప్లాను కూడా ఇంకా 60 కోట్ల లోటువుందని అది పూడకపోతే ఇంకా తగ్గే ప్రమాదం వుందని కూడా కేంద్ర ప్లానింగుమంత్రి హెచ్చరిక చేశారు.

మన ప్రభుత్వం వేసిన అంచనాలు - కేంద్ర ప్రభుత్వం వేసిన అంచనాలు యీ క్రింది విధంగా వున్నాయి. నాలవ ప్లానులో 622 కోట్ల రూపాయల అంచనా ప్లాను ఆంధ్రప్రదేశ్‌కు వేయబడిందన్నారు. మొదటి సంవత్సరం (1966_67) 94 కోట్లు ప్లానులో ఖర్చయిందన్నారు. ఇక 1967_68 లో 75 కోట్ల వరకు వేశారు. అదే మా నికరం కేటాయింపు అన్నారు.

కేంద్రం ప్రకటించిన 1967_68 వార్షిక ప్లానులో రూ 74 కోట్లకు బదులు రూ69 కోట్లు మాత్రమే కేటాయించారు. మన ప్రభుత్వం మార్చి (1967) లో నాల్గు నెలల బడ్జటు తాత్కాలిక కేటాయింపులో రూ70 కోట్లు అని ప్రకటించారు. అయితే దానిని పెంచి జూన్ నెలలో యీ 68 కోట్లకు మార్చారు. ఈ రెండు వివరాలు వీటితోబాటు 1967_68 వార్షిక ప్లానులో కేంద్రం చేసిన కేటాయింపులు పోల్చుకొని చూచుకుందాం. అవి యివి —

1967_68 ప్లాను (లక్షల రూపాయలలో)

| పద్దు | తాత్కాలిక బడ్జెటు | నికర బడ్జెటు | కేంద్ర ప్లాను |
|---|---|---|---|
| 1. వ్యవసాయం | 1089 | 1221 | 1330 |
| 2. సహకారం | 223 | 223 | 223 |
| 3. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 4565 | 4765 | 4114 |
| 4. పరిశ్రమలు_గనులు | 218 | 222 | 207 |
| 5. రవాణా_రహదార్లు | 229 | 223 | 207 |
| 6. సాంఘిక సేవలు | 694 | 822 | 813 |
| 7. అదీ_ఇదీ | 7 | 7 | 4 |
| మొత్తం లక్షల రూ. లలో | 7026 | 7486 | 6893 |

అంటే మన ప్రభుత్వం వేసిన అంచనాలల్లో వ్యవసాయ కార్యక్రమాలలో వారు పెంచారు. సహకారం, సాముదాయకాభివృద్ధి (సి. డి) ని అట్లే వుంచారు. నీటిపారుదల విద్యుచ్ఛక్తి పద్దులలో 47 కోట్లను 41 కోట్లు చేశారు. పరిశ్రమల్లో 15 లక్షలు, రహదార్లలో 16 లక్షలు, సాంఘిక సేవల్లో 3 లక్షలు తగ్గించారు. తగ్గించడంకన్నా పద్దుల తగ్గింపు గమనించ వలసివుంది. చిన్న వాటిని వదిలి వేశారు. ముఖ్యంగా నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖలలో తగ్గింపు చేశారు.

ఇదే విధానం భారతదేశంలో అన్ని రాష్ట్రాలలోను అవలంబించి వుంటే దేశానికంతటికి సంబంధించినది కావున ఏమి చేయగలమని వదిలివేసి వుండేవారమే. కాని అట్లా జరగలేదు. మైనరు ఇరిగేషను క్రింద యిచ్చిన 556 లక్షలు వ్యవసాయ పద్దు క్రింద అన్నిరాష్ట్రాలకు వలె మనకు కట్టివేశారు. పెద్ద చిన్న ప్రాజెక్టులు, నీటిపారుదల స్కీములు, దానికి 66_67 లో 21 కోట్ల అంచనా వేస్తే 22 కోట్ల వ్యయం అయిందని ఆంధ్రప్రభుత్వం అంకెలు చెబుతున్నవి. అంటే 1967_68 కి 17 మాత్రమే కేటాయించారని కేంద్రం. ఒక్క నాగార్జున సాగర్‌కు 20 కోట్లు కావాలి కదా. ఇది చిన్నచూపు కాదా.

ఇక విద్యుచ్ఛక్తిలో 1966_67 లో 39 కోట్లు వ్యయం చేస్తే 1967_68 కి 23 కోట్లు మాత్రమే యిచ్చారు. విద్యుచ్ఛక్తిలో ఇతర రాష్ట్రాలకు యిచ్చిన వాటాను మనకేటాయింపుకు ఉన్న తేడాలు యీ క్రింది అంకెలు గమనిస్తే బోధపడుతవి.

## విద్యుచ్ఛక్తి కేటాయింపులు

(కోట్ల రూపాయలలో)

| రాష్ట్రం | 1966_67 | 1967_68 (ఉత్పత్తికి) | గ్రామీణ విద్యుద్దీకరణకు |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 39.37 | 23.84 | 3.00 |
| అస్సాం | 5.84 | 7.00 | 0.60 |
| బీహార్ | 25.91 | 22.31 | 6.50 |
| గుజరాత్ | 10.65 | 14.57 | 3.60 |
| కాశ్మీర్ | 4.88 | 4.85 | 0.45 |
| కేరళ | 15.20 | 12.85 | 0.45 |
| మధ్యప్రదేశ్ | 19.13 | 17.50 | 2.17 |
| మద్రాసు | 26.74 | 29.10 | 6.00 |
| మహారాష్ట్రం | 32.52 | 35.68 | 7.20 |
| మైసూరు | 11.02 | 18 05 | 0.88 |
| ఒరిస్సా | 15.11 | 9.78 | 3.50 |
| పంజాబు | 9.16 | 18.70 | 1.50 |
| హరియానా | | 9.59 | 1.50 |
| రాజస్థాన్ | 13.38 | 14.94 | 1.75 |
| ఉత్తరప్రదేశ్ | 57.87 | 57.50 | 7.50 |
| పశ్చిమబెంగాల్ | 9.05 | 10.00 | 2.00 |
| నాగాలాండ్ | 0.57 | 0.78 | 0.06 |
| మొత్తం | 314.36 | 307.45 | 53.01 |

ఇందులో మద్రాసు, మహారాష్ట్ర, మైసూరు, ఉత్తర ప్రదేశ్‌లలో ఇప్పటికే విద్యుచ్ఛక్తి అభివృద్ధికరంగా వుంది. అందుకు సంతోషించవలసిందే. వారికి ఇంకా అభివృద్ధికి అదనంగా నిధులు కల్పించారు మంచిదే. మైసూరు, మహారాష్ట్ర ప్రభుత్వాలు విద్యుచ్ఛక్తిలో ఇంత అగ్రగామిగావుండి దాని లాభాలు గ్రహించగలిగినవారు పొరుగు రాష్ట్రం అయిన ఆంధ్ర ప్రదేశ్ ధాన్యం పండించుటకు నాగార్జునసాగర్; విద్యుచ్ఛక్తి ఉత్పాదన చేయుటకు శ్రీశైలం ప్రాజెక్టు ఆదిగాగల ప్రాజెక్టులు కట్టుకుంటుంటే ఎందుకు అడ్డు తగులుతున్నారో అర్థంకావడం లేదు. అంతకన్నా అర్థంకానిది కేంద్రం యీ అడ్డంకులు నివారించలేకపోగా వారికి లొంగిపోతున్నారనే భావన కలిగించడం బాధాకరంగా వుంది. వారితోబాటు ఇతర ప్రాంతాల విద్యుద్దీకరణనుకూడా అవకాశం కలిగించడం కేంద్రం బాధ్యత. న్యాయం అని అడుగుతున్నాం. ఈ రాష్ట్ర విస్తరణకు, గ్రామీణ విస్తరణకు కూడా మొత్తాలు అధికంగా కేటాయించారు. ఆయా ప్రాంతాల్లో విద్యుత్పత్తి 1966_67 వరకు జరిగినదీ, ఎన్ని గ్రామాలకు విస్తరించి, ఎన్ని పంపుసెట్లు పెట్టుకున్నదీ యీ క్రింద అంకెలు విశదీకరించ గలవు. గమనించండి —

## విద్యుచ్ఛక్తి (1966_67 చివరవరకు)

| రాష్ట్రం | మెగావాట్లు | గ్రామాలు | పంపుసెట్లు |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 427 | 5,961 | 73,971 |
| అస్సాం | 161 | 99 | 15 |
| బీహార్ | 147 | 5,688 | 24,672 |
| గుజరాత్ | 676 | 2,320 | 28,465 |
| కాశ్మీర్ | 36 | 756 | 65 |
| కేరళ | 365 | 1,805 | 8,688 |
| మధ్యప్రదేశ్ | 377 | 1,359 | 7,348 |
| మద్రాసు | 1,381 | 10,387 | 2,90,505 |
| మహారాష్ట్ర | 1,155 | 6,419 | 65,670 |
| మైసూరు | 461 | 5,002 | 51,721 |
| ఒరిస్సా | 318 | 649 | 893 |
| పంజాబు, హరియానా | 919 | 5,340 | 52,862 |
| రాజస్థాన్ | 307 | 1,745 | 10,965 |
| ఉత్తరప్రదేశ్ | 925 | 9,883 | 32,541 |
| పశ్చిమ బెంగాల్ | 1,207 | 1,480 | 799 |
| దామోదర్ వేలీ | 914 | — | — |
| నాగాలాండ్ | — | 13 | — |
| రాష్ట్రాలు మొత్తం | 10,106 | 58,896 | 6,52,288 |

ఈ అంకెలు గమనించినపుడు విద్యుద్దీకరణలో వెనుకబడిన ప్రాంతాలకు, రాష్ట్రాలకు ప్రాధాన్యం యివ్వడం సబబు. ఇటు ఇండియాలో 59 వేలు విద్యుద్దీకరణ గమనిస్తే ఇంతవరకు యీ అంకెలవల్ల ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి వాడకంలో అట్టడుగున వుందనేదే కాకుండా అవకాశాలలో కూడా అట్టడగునవుంది. మద్రాసు రాష్ట్రం 58 వేల గ్రామాలలో 10 వేల గ్రామాలున్నవి. ఇక పంపుసెట్లలో ఆరున్నర లక్షల్లో 290 వేలు దాదాపు సగం

పైగా మద్రాసులో వున్నవి. ఉత్పత్తిలో 10 వేల కిలో వాట్లలో 1381 కిలో వాట్లు ఉత్పత్తి జరుగుతున్నది. ఈ సంవత్సరంకూడా ప్లానులో ఆంధ్రకు 23 కోట్లు అయితే మద్రాసుకు 29 కోట్లు కేటాయించారు. మైసూరుకు 18 కోట్లు, మహారాష్ట్రకు 35 కోట్లు, ఉత్తర ప్రదేశ్‌కు 58 కోట్లు కేటాయించారు. అల్లే అభివృద్ధికై శ్రీశైలం ప్రాజెక్టులో పలె-అప్పర్ సీలేరు ప్రాజెక్టుల పని పూర్తి అగుటకు ఆంధ్రప్రదేశ్‌కు కూడా యివ్వడం న్యాయంకాదా? ప్లానింగు కమీషనుకు కేంద్ర ప్రభుత్వానికిన్ని వారికిచ్చినందుకు అందరికి సంతోషమే.

అయితే బాధపడేది అందుకు కాదు. తాము సాధించినట్టి విజయాలు సాధించవలెనని తోడి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ శ్రీశైలం ప్రాజెక్టు కట్టుకుందామంటె మైసూరు, మహారాష్ట్రలు అడ్డుతగలడం_కేంద్రం ఆ ఆసరా చూచుకొని మూకీభావం వహించడం సహించరానిదిగావుంది.

ఇక 1967_68 లో ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల గురించి యోచించితే గనుల అభివృద్ధికి 11 లక్షలు, చిన్న పెద్ద గ్రామ పరిశ్రమలకు 196 లక్షలు కేటాయించుతూ మద్రాసులో కేంద్ర ప్రాజెక్టులు అటుంచండి ఇందులోనే 615 లక్షలు మైసూరుకు 302 మహారాష్ట్రకు, 318 ఒరిస్సాకు గనుల పరిశీలనకు 225 మిగతా పరిశ్రమలకు 285, పంజాబుకు 210, ఉత్తరప్రదేశ్‌కు 684, పశ్చిమ బెంగాలుకు 474, అస్సాంకు 180, బీహారుకు 300, గుజరాత్‌కు 510, కేరళకు 344 కేటాయించారు. విశాఖలో నిర్మిస్తామన్న జింక్‌స్మెల్టర్‌కు ధనం కేటాయించనేలేదు. ఎరువుల ఫ్యాక్టరీ ఆంధ్రలో ప్రైవేటు వ్యక్తులకు యిచ్చాం అన్నారు. మద్రాసులో ప్రభుత్వ రంగంలో 765 లక్షలు, కొచ్చిన్‌లో 700 మరొకటి 215 లక్షలు కేటాయించారు. ఉన్న చేనేత పరిశ్రమ అయినా ఉత్పత్తి అమ్ముడుపోక చేయుటకు మరో పనిలేక సంక్షోభంలో పడిపోయింది. దానికి మార్గాంతరంగాని, సహాయంగాని ఆలోచన కలిగినట్లులేదు. విశాఖ పడవల రేవుకు అంటూ 1966_67లో 100లక్షలు కేటాయించి గతసంవత్సరం మొదటలో 75 లక్షలు చేశారు. ఈ 67_68 లో విశాఖ నౌకా కేంద్రానికి డ్రైడాకు యార్డుకు రెంటికి కలిపేం అంటూ 110 లక్షలు హిందూస్థాన్ షిప్ యార్డుకు సబ్సిడీ అంటూ 170 లక్షలు కేటాయించారు. ఈ రెంటికి 1966_67లో 270 లక్షలు ఇచ్చివుండగా 1967_68లో డ్రైడాకు యార్డుతోసహా కలపి అంటూ 210 లక్షలు కేటాయించారు.

మొత్తంగా పరిశీలన చేస్తే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆశించినంతగ కూడా 1967_68 సాంవత్సరిక ప్లానుకు కేటాయింపులు జరగలేదు. ఉక్కు ఫ్యాక్టరీ ప్రసక్తేలేదు. పారిశ్రామిక ప్రాజెక్టులకేమి, నీటిపారుదల ప్రాజెక్టులకేమి విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులకేమి కేంద్రం కే యింపులు ఆంధ్రప్రదేశ్ పురోగమనానికన్న తిరోగమనంలో పడడానికే ఉపయోగపడేటట్లు కనిపించుతుంది. మన ప్రభుత్వం యిచ్చిన కేటాయింపులు కూడా తగ్గిపోయినవి. ఆంధ్ర ప్రదేశ్ అంటే ఏ మాత్రం వాత్సల్యంలేని విధంగా చిన్న చూపు చూస్తూండడమేకాదు అసలు ఇదొక రాష్ట్రమా అని తలుస్తున్నట్లు ప్రస్ఫుటం అవుతున్నది. ఈ సంవత్సరానికిబడ్జటు అంతా అయిన తర్వాత యీ ప్లాను కేటాయింపులు రావడం ప్రజా ప్రతినిధులు తమ అభిప్రాయాలు చెప్ప వీలులేకుండా పోయింది. అందుచే ఆంధ్ర ప్రజానీకం అప్రమత్తులై అటు నాగార్జునసాగర్ ప్రాజెక్టుక్రింద కనీసం 20 లక్షలు ఎకరాలు సాగుకు తేగల విధంగా, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులలో శ్రీశైలం, ఎగువ, దిగువ, దిగువ సీలేరులు సాధించేందుకు; డ్రైడాకుయార్డు, జింక్‌స్మెల్టరు మున్నగు ముఖ్యమైన పరిశ్రమలు సాధించేంతవరకు నిదుర పోకుండా జాగరితమై మెలగాలి. లేకపోతే ఆంధ్ర భవిష్యత్తు అంధకారమే. అందుచేత ఆంధ్ర ప్రజానీకం కదిలి ఆంధ్ర అభిప్రాయానికి దీక్ష పూనుతారని ఆశిస్తాను.

---

## షాద్‌నగర్‌లో వాటరింగ్ స్టేషన్

షాద్‌నగర్ హైదరాబాదు-కర్నూలు రైలుమార్గంలో వున్న ముఖ్య తాలూకా పట్టణం. మూడు తాలూకాలకు ఇది ప్రధాన వర్తక కేంద్రం. ఈ రైలుమార్గంగుండా ప్రొద్దుటి పూట రెండు ప్యాసెంజరు రైళ్ళు, రాత్రిపూట ఒక ఎక్స్‌ప్రెస్ రైలు నడుస్తాయి. ఎక్స్‌ప్రెస్ నీరు తీసుకోవడానికి సమీపంలోని తిమ్మాపూర్ స్టేషనులో ఆగుతుంది. మూడు తాలూకాల ప్రజల ప్రయోజనందృష్ట్యా షాద్‌నగర్‌నే వాటరింగ్ స్టేషను చెయ్యాలి.

షాద్‌నగర్ — వై. రామారావు

## గుంటూరు రైలుప్రయాణీకులకు కావలసిన సదుపాయాలు

గుంటూరుకు అవసరమైన రైలు సౌకర్యాలను గురించి అధికార్లకు అనేక పర్యాయాలు విన్నవించుకొనడం జరిగింది. గుంటూరు ప్రాముఖ్యాన్ని గురించిగానీ, యాత్రాస్థలం, పారిశ్రామిక కేంద్రమైన మంగళగిరి అవసరాలను గురించిగానీ వారికి తెలియకుండా వుండదు. మద్రాసు-ఢిల్లీ, మద్రాసు-హౌరాల మధ్య నడిచే ఎక్స్‌ప్రెస్ రైళ్ళలో ఒకదానిని గుంటూరు మార్గంగా మళ్ళించాలి. ఈ మళ్ళింపువల్ల పెరిగే దూరం ఏమంత ఎక్కువ వుండదు.

గుంటూరు—హైదరాబాదుల మధ్య నేరుగా వెళ్ళే బోగీలు గమ్యాన్ని చేరుకోవడానికి ఇప్పుడు 14 లేక 15గంటల సమయం పట్టుతున్నది. ఈ ప్రయాణాన్ని వేగవంతంచేయాలి. విజయవాడ - హైదరాబాదుల మధ్య నడిచే ఎక్స్‌ప్రెస్

రైళ్ళన్నీ రాత్రిపూటనే ప్రయాణం చేస్తాయి. కాబట్టి ప్రొద్దటి పూట వెళ్ళే ప్యాసింజరు రైలును వేగంగా పోనివ్వాలి. అంతే గాక ఈ ప్యాసింజరు విజయవాడనుంచి కాక గుంటూరునుంచి బయలుదేరాలి. అచ్చటితో ఆగిపోవాలి. దీనివల్ల గుంటూరు, మంగళగిరిల ప్రయాణీకులకు సౌకర్యంగా వుంటుంది. విజయవాడ ప్రయాణీకులకు కూడా అసౌకర్యమేమీ కలుగదు.

ఈ సూచనలను అమలుపరిచినట్లయితే గుంటూరు, మంగళగిరిల ప్రయాణీకులకేకాక నరసారావుపేట, మాచర్ల వైపునుంచిగల రెండు మీటర్ గేజి మార్గాలలోని ప్రయాణీకులకుకూడా సౌకర్యంగా వుంటుంది.

కొత్తరైళ్ళ బోగీలలోను, బ్రాంచిలైను రైళ్ళలోను రెండవతరగతి సదుపాయాలు కల్పించడానికై చేసుకుంటున్న విన్నపాలను రైల్వే అధికార్లు పెడచెవిన పెడుతున్నారు. తరగతుల సంఖ్యను తగ్గించవలసివస్తే మొదటి తరగతిని రద్దు చేయవలెవేకాని రెండవ తరగతిని రద్దుచేయడం భావ్యం కాదు.

గుంటూరు. —కె. నరసింగరావు

## అసభ్య చలనచిత్రాలు

భారతీయ చలన చిత్రాలలో అసభ్యకరమైన దృశ్యాల ప్రదర్శన ఎక్కువవుతున్నది. మన చలన చిత్రాలపై మంచి ప్రభావం వేయడంలో పత్రికలు ప్రముఖ పాత్రవహిస్తాయని నేను ఆశిస్తున్నాను.

హైదరాబాదు. —ఎం. జి. ప్రకాశరావు

# ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి

*ఆంధ్ర ప్రదేశ్ సంక్షేమనిధి అధ్యక్షులు : ఆరోగ్య, వైద్యశాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు విజ్ఞప్తి.*

ఆంధ్ర ప్రదేశ్ సంక్షేమనిధి **లక్ష్యమేమిటో, ఈ** నిధిని ఏ విధంగా సేకరిస్తున్నారో, సేవా కార్యక్రమాలతో దీనికి గల సంబంధం ఏమిటో మొదలైన వివరాలను మీ ముందుంచుతాను. ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి కార్య నిర్వాహక సంఘం అధ్యక్షుడిగా నేను ఈ వివరాలను మీ ముందుంచడం అవసరమని భావిస్తున్నాను. 1966 సం. పు రాఫిల్‌ను గురించి మీరు వినే వుంటారు. గత ఏడాది ఆఖరుతో యీ రాఫిల్ ముగిసింది. 1967వ సంవత్సరపు రాఫిల్ టిక్కెట్లను కూడా అమ్మకానికి విడుదల చేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని అనేక కేంద్రాలలో యీ టిక్కెట్లను అమ్మకానికి పెట్టారు. ఈ అమ్మకాలవల్ల సంక్షేమ నిధికి డబ్బు సమకూడుతుంది. సంక్షేమ కార్యక్రమాల నిర్వహణకు యీ నిధి తోడ్పడుతుంది.

## నిధి పుట్టు పూర్వోత్తరాలు

ఇప్పుడు ఈ నిధి పుట్టు పూర్వోత్తరాల్ని గూర్చి ప్రస్తావిస్తాను. ఈ నిధి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యొక్క అధ్వర్యం క్రింద వసూలు చేయడం, నిర్వహించడం, పంపిణీ చేయడం జరుగుతున్నది. ఒకొక్కటి రూపాయి ఖరీదుగల రాఫిల్ టిక్కెట్లను అమ్మి తద్వారా నిధిని సమాకూర్చేందుకు ప్రభుత్వ అధ్వర్యం క్రింద సేకరింపబడే నిధి ఆంధ్రప్రదేశ్‌లో యిదొక్కటే వుంది. టికెట్టు కొన్నవారికి వారి వారి అదృష్టాలను బట్టి లాటరీలో వారి నంబరు వస్తే పెద్ద పెద్ద మొత్తాలలో నగదు లభిస్తుంది. టిక్కెట్టు అమ్మకాలవల్ల వచ్చిన మొత్తంలో వాటి ముద్రణ ఖర్చు, నిర్వహణ వ్యయం మొదలైనవి తీసివేయగా మిగిలిన సొమ్మును ప్రజల సంక్షేమానికై వినియోగిస్తారు. సంఘంలో బీదవారికి, దుర్బలుల కొరకు నిర్వహింపబడే సంస్థలకు ఈ నిధిని ఉపయోగిస్తారు.

ఈ నిధి వెనకటి మద్రాసు రాష్ట్రంలో మొదట్లో నిర్వహింపబడింది. 1953లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత మద్రాసు రాష్ట్ర సంక్షేమ నిధి అని పిలవబడే యీ నిధి అప్పట్లో కేవలం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాలనుండి మాత్రమే సేకరించడం జరుగుతుండేది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుంచి ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి పేరుతో యిది అమలులోకి వచ్చింది. అప్పటినుంచి కూడా—అంటే మొదట్లో మద్రాసు రాష్ట్రంలోనూ, తర్వాత ఆంధ్ర రాష్ట్రంలోనూ, అటుపిమ్మట ఆంధ్రప్రదేశ్‌లోనూ యీ నిధి సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలలో అమోఘంగా తోడ్పడుతోంది.

ఈ నిధి రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాదులో వుంటుంది. దీనికి యిక్కడ ఒక స్వంతకార్యాలయం వుంది. రాష్ట్ర గవర్నరు దీనికి ముఖ్యపోషకులు. ముఖ్యమంత్రి పోషకులు. ఆరోగ్య మంత్రి అధ్యక్షులు. విద్యాశాఖా మంత్రి, సాంఘిక శాఖా మంత్రి, స్థానిక పరిపాలనా విషయాల మంత్రి సభ్యులు. ఈ నిధిని ఏర్పాటు చేసినప్పటినుంచి దినదిన ప్రవర్ధమానమౌతూ వస్తోంది. అనేక సాంఘిక సంక్షేమ ప్రాజెక్టులకు; సాంఘిక, సాంస్కృతిక, విద్యావిషయక సంస్థలకు: ఆసుపత్రుల్ని, ఆశ్రయ గృహాలను, సముద్ధరణ గృహాలను మొదలైన వాటిని నెలకొల్పే అనేక సంస్థలకు ఆర్థికంగా యిది సహాయపడుతూ వుంటుంది. ఇందుకుగాను రాఫిల్‌లను నిర్వహించడం జరుగుతోంది. నిధిసేకరణ నిమిత్తం రాఫిల్ టిక్కెట్లను అటు జిల్లాల స్థాయిలోనూ, యిటు రాష్ట్రస్థాయిలోనూ, అమ్ముతుంటారు. ఈ నిధి నిర్వహణలోగల ఆశయాలతో ఏకీభవించే రాష్ట్రంలోని సంక్షేమం సంస్థలన్నీ స్వచ్ఛందంగా ఈ టిక్కెట్ల అమ్మకంలో పాల్గొనవచ్చు. అమ్మకాలపై వచ్చిన మొత్తాన్ని పంచుకొనే విషయంలో ముందుగానే నిశ్చితమైన ఒప్పందం జరుగుతుంది. ఇందువల్ల ఈ సాంఘిక సంక్షేమ సంస్థలు తమ అవసరాల నిమిత్తం ఆర్థిక సహాయం చేయవలసిందని ప్రభుత్వం వద్దకుగాని, ప్రయివేటు సంస్థలవద్దకు గాని, వ్యక్తులవద్దకుగాని వెళ్ళక్కరలేకుండానే ఈ నిధి సేకరణలో తోడ్పడి తద్వారా తమ వంతు భాగాన్ని సంపాదించుకోవచ్చు, కలెక్టర్లు ఎక్స్-అఫీషియో ఛైర్మన్‌లుగాను, జిల్లా వైద్యాధికారులు ఎక్స్-అఫీషియో కార్యదర్శులుగాను యీ నిధి సేకరణ జిల్లాల్లో నిర్వహింపబడుతూ వుంటుంది, ఈ జిల్లా శాఖలు, సాంఘిక సంక్షేమ సంస్థలు రాఫిల్ టిక్కెట్ల అమ్మకాలను చేపట్టుతాయి. తమ తమ శక్త్యానుసారం, అవసరాలనుబట్టీ యివి ఏడాది పొడవునా ఆయా సంవత్సరపు రాఫిల్ టిక్కెట్లను అమ్ముతుంటాయి. అవి అమ్మిన అమ్మకాలనుబట్టి వాటికి నిధిలో కొంత భాగం లభిస్తుంది. టిక్కెట్ల అమ్మకాలలో 65 శాతంవరకు వాటికి లాభిస్తుంది. దీనికితోడు అవి అమ్మిన ప్రతి పది టిక్కెట్లకు ఒక రూపాయి విలువగల ఒక కాంప్లిమెంటరీ టిక్కెట్టుకూడా లభిస్తుంది.

## సత్కార్యానికి ప్రజల తోడ్పాటు :

రాఫిల్ టిక్కెట్టు కొన్న ప్రతివ్యక్తికీ ఒక సత్కార్యానికి తోడ్పడుతున్నానన్న సంతృప్తి మిగులుతుంది. పైపెచ్చు ఆఖర్లో కలిపే లాటరీలో అదృష్టవశాత్తు నంబరు తగిలితే పెద్ద మొత్తం

బహుమతికూడా లభించవచ్చు. 1966 డిశంబరు ఆఖరుతో ముగిసిన రాఫిల్‌లో బహుమతిదార్లకు యిచ్చిన మొత్తం రూ. 72,000లు.

ముద్రణ ఖర్చులు, నిర్వహణ వ్యయం మొదలైనవి, బహుమతిదార్లకు ఇచ్చిన మహుమతులు పోను మిగిలిన నిధి నుండి కార్య నిర్వహణ సంఘం నియమ నిబంధనల మేరకు లోబడి సాంఘిక సంక్షేమ సేవాసంస్థలకు విరాళాలను పంపిణీచేస్తారు.

## టి. బి. వార్డుకు విరాళం

1961-1966 మధ్యలో ఆరు రాఫిల్‌లను నిర్వహించడం జరిగింది. మొదటి అయిదు రాఫిల్‌లకు ఒక్కొకదానికి రూ 8 లక్షలు సేకరించాలని, ఆరవదానికి రూ 16 లక్షలు సేకరించాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ఈ ఆరురాఫిల్‌లకు మొత్తం అమ్మకాలు రూ 33,17,700. వీనిలో జిల్లా బ్రాంచీలకు వాటి వంతుగా $11\frac{1}{2}$ లక్షల రూపాయలు లభించాయి. సాంఘిక సంక్షేమ సంస్థలకు సుమారు $6\frac{1}{2}$ లక్షల రూపాయలు లభించాయి. జిల్లా బ్రాంచీలు తమకు లభించిన మొత్తంలో మళ్ళీ పెద్ద మొత్తాన్ని స్థానిక సంక్షేమసంస్థలకు విరాళంగా యిచ్చాయి. ఆ స్థానిక సంక్షేమ సంస్థలు రాఫిల్ టిక్కెట్ల అమ్మకంలో పాల్గొన్నందుచేత వాటికి కూడా యీ లాభాన్ని పంపిణీచేశాయి. విరాళాలలో ముఖ్యంగా చెప్పుకోదగినది — ఏలూరులోని గవర్నమెంట్ హెడ్‌క్వార్టర్స్ హాస్పిటలులో టి. బి. వార్డును నిర్మించేందుకై ఒక లక్ష రూపాయల్ని పశ్చిమ గోదావరి జిల్లాకు అందజేశారు. విశాఖపట్టణంలో రాణీ చంద్రమణిదేవి చిల్డ్రన్స్ హాస్పిటల్ — రిహేబిలిటేషన్ సెంటర్ నిర్మాణానికి రూ 1,50,000లు విరాళం యిచ్చారు.

ప్రజల సహకారం వల్లానూ. ఈ నిధిసేకరణలో అన్ని స్థాయిల్లోనూ అధికార, అనధికారులు — ముఖ్యంగా జిల్లాకమిటీలు యితర సంఘాలు యిచ్చిన సహాయం వల్లానూ—యీ నిధిసేకరణ విజయవంతం అవుతోంది. రాష్ట్రప్రభుత్వం ఈ విషయం గుర్తించింది. 1967 సం. పు రాఫిల్‌గాక 1969 వరకు మరో రెండు రాఫిల్‌లను నిర్వహించడానికి ఆమోదించింది.

ఈ నిధి నిర్వాణలో లాభాలు చేసుకొనే ఉద్దేశంలేదు. డబ్బు చేసుకునేందుకు ఈ రాఫిల్ నిర్వహింపబడుతున్నదని కాక ప్రజల సేవాదృష్టితో నిర్వహింపబడుతున్నదని గుర్తించబడుతోంది. ఏ వ్యక్తికైనా బహుమతి రాకపోయినా తను వుంటున్న ప్రాంతంగాని, తాలూకాగాని, జిల్లాగాని యీ విధివల్ల ప్రయోజనం పొందే అవకాశం వుందికదా. రాఫిల్ టికెట్లను అమ్మిన వ్యక్తులుగాని, సంస్థలుగాని ఆ టిక్కెట్ల అమ్మకానికి పడిన శ్రమకు తగు ప్రతిఫలంగా వారు అమ్మిన టిక్కెట్ల విలువలో 10 శాతం లభిస్తుంది కూడాను.

ఒక జిల్లాగాని, ప్రాంతంగాని అమ్మిన అమ్మకాలలో పెద్ద మొత్తం తిరిగి ఆ జిల్లాకే, ఆ ప్రాంతానికే లభించే రాఫిల్ యిదొక్కటే. ఆ మొత్తం తిరిగి అక్కడి సంక్షేమ కార్యక్రమాలకు వినియోగింపబడుతుంది.

## ఆదర్శ కృషి

ఇప్పుడు 1967 సం పు రాఫిల్ జరుగనున్నది. 1967 డిశంబరు 31వ తేదీతో యిది ముగుస్తుంది. 16 లక్షల రూపాయల నిధి సేకరించాలన్నది ఈ రాఫిల్ లక్ష్యం. లక్ష రూపాయల మేరకు బహుమతులు వున్నాయి. ఈ నిధి తగినంతగా సేకరించాలంటే రాఫిల్ టిక్కెట్ల అమ్మకం విరివిగా జరగాలి. ఇందుకు ప్రజలు, సాంఘిక సంక్షేమం తాలూకు జిల్లా కమిటీల సహకారం అవసరం. వర్తమాన పరిస్థితుల్లో ఆర్థిక మాంద్యం కారణంగానూ, ధరల పెరుగుదలకారణంగాను; కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆర్థిక పరంగా తీసుకున్న వివిధ కట్టుదిట్టమైన చర్యలదృష్ట్యానూ లోగటవలె యిప్పుడు సాంఘిక సంక్షేమ ప్రాజెక్టులకు ఆర్థిక సహాయాన్ని ప్రభుత్వం అందజేయలేకపోవచ్చు. అందుచేత ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి రాఫిల్ వంటి అనధికార ఏజన్సీలు ప్రారంభించిన సహాయక కార్యక్రమాలకు, నిధిసేకరణ కృషికి యితోధికంగా మనం సహాయపడవలసివుంది. అటువంటి వాటికి మనం ప్రోత్సాహాన్ని యిస్తూ వుండాలి. ఆర్థిక క్లిష్టపరిస్థితి నెలకొనివున్నంత కాలం యిటువంటి వాటివల్ల సాంఘిక ప్రయోజనం మరింత కలిగేటట్టు వాటికి తోడ్పడాలి. ఆంధ్రప్రదేశ్ అంతటా ఈ రాఫిల్ టిక్కెట్లను విరివిగా అమ్మి, తద్వారా నిధిసేకరణకు తోడ్పడవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈ నిధి సేకరణలో గతంలో ప్రజలనుంచి లభించిన తోడ్పాటు, ప్రోత్సాహం యిప్పుడు కూడా లభించగలవని ఈ నిధి సేకరణను విజయవంతం చేయగలరని ఆశిస్తున్నాను.

---

కొద్దిమంది భారతీయులకు ప్రభుత్వోద్యోగాలు చేకూర్చటంతో కోట్లకొలదీ నిరుద్యోగులుగా ఉన్న భారతీయుల సమస్య పరిష్కృతంకాదు. ప్రతివ్యక్తికీ ప్రభుత్వోద్యోగం చూపించటం ప్రభుత్వానికి అసాధ్యమైన పని. అర్హతలు లేనివారికి ఉద్యోగాలు యిస్తే దేశం పాడైపోతుంది. ఏదో వృత్తిలో ఉన్నవాళ్లందరూ తమ వృత్తులను సవ్యంగా చేసుకోవాలి. చేసిన పనిమీదనే ఉత్పత్తి ఆధారపడుతుంది కనుక, ఒక దేశ సౌభాగ్యం దానికి గల ఉత్పత్తి శక్తిమీద, సంపదను సవ్యంగా విభజించటంమీద ఆధారపడిఉంటుంది. అందుకు మనకు అడ్డుగా ఉన్నవాటిని మనము తొలిగించుకోవాలి.

— జవహర్‌లాల్ నెహ్రూ

---

సీరియల్:

# తిరస్కృతి

వాసిరెడ్డి సీతాదేవి



ముగ్గు పూర్తికాగానే సరళ నిల్చుంది. మెడచుట్టూ ఉన్న జడను తిప్పి వెనక్కు వేసుకుంది. మొహంమీద పడుతున్న ముంగురులను కుడిచేత్తో పైకి నెట్టుకుంది. లంగా కుచ్చిళ్లను లాగివదిలింది క్రిందకు. నడుము చుట్టీఉన్న ఓణీ పమిటను తీసుకో బోతూ ఏదో అలికిడయినట్టుంది తలెత్తి చూసింది—నాజూగ్గా, అధునాతన వేషంలో, పొడవుగా, చేతిలో సూట్ కేసుతో, సినిమాల్లోని హీరోలా నిల్చొనివున్న యువకుణ్ణి గాభరాగా ఆ పెద్ద కళ్లను ఇంకొంచెం పెద్దవిచేస్తూ వింతగా చూసింది.

"ఎంత పెద్దదానివయ్యావె సరళా?" అన్నాడు సూర్యం మధుర స్వప్నంచూస్తూ కలవరించినట్లు.

"అరే! చిన్నబావ!" హృదయం పలికింది. పెదవులు కదల్లేదు. అమాయకంగా, అందంగా ఉండే ఆకళ్లను వెడల్పు చేసుకుంటూ చూసింది సరళ.

"ఎంత అందంగా ఉన్నావు సరళా?"

అకస్మాత్తుగా వీణమీద చెయ్యి పడినట్లు ఆమె శరీరం మధుర కంపనతో నిండి పోయింది. ఒక్క సారిగా లోపలకు పరుగు తీసింది.

సూర్యనారాయణకు మూడు రోజుల క్రితం చూసిన దేవదాసు సినిమా గుర్తువచ్చింది. దేవదాసు చాలా కాలానికి పట్నం నుంచి తిరిగి వస్తాడు. పార్వతిని చూట్టానికి వస్తాడు. ఆ సమయంలో పార్వతి సంధ్య దీపం వెలిగిస్తూ ఉంటుంది. యువతిగా పార్వతిని చూసి ఆశ్చర్య పోతాడు. "ఎంత పెద్దదానివయావు పారూ!" అంటాడు. ఆమాటతో ఆమెలో చిత్రమైన అనుభూతి కలుగు తుంది. సిగ్గూ, ఆనందం......ఇంకా ఏదో చెప్పనలవికాని అనుభవం......లోపలకు పరుగెత్తి పోతుంది. శరత్ బాబు మానవుని హృదయంలోని సున్నిత భాగాలను ఎంత తరచి చూశాడు! మానవ ప్రకృతిని ఎంత లోతుగా పోయి అర్థం చేసుకున్నాడు! అందు వల్లనే శరత్ అశేష ప్రజానీకానికి అంత దగ్గిర వాడయాడు. ఆ సన్నివేశానికి బిమల్‌రాయ్ ఎంత చక్కని రూపకల్పన చేశాడో! సరిగ్గా పార్వతిలో కలిగిన సంచలనాన్నే తను ఈ నాడు సరళలో చూశాడు. తన నోటినుంచి అకస్మాత్తుగా సరిగా దేవదాసు అన్నమాటలే వెలువడ్డాయి. దీనినే జీవిత సత్యం అంటారేమో! జీవిత సత్యాన్ని ప్రతి బింబించే సాహిత్యమే శాశ్వతంగా నిలవగలుగు తుంది! తొలి యవ్వనంలో కాలుపెట్టిన ఆడపిల్ల సృతిచేసి పెట్టిన వీణలాటిది. చిన్నగా గోరు తగిలినా చాలు వీణ తంత్రిలలో మధుర కంపనం బయలు దేరు తుంది!

"అదేవిటిరా అబ్బాయ్! అట్లా గుమ్మంలోనే నిలబడి పోయావ్?" సంభ్రమాశ్చర్యాలతో తల్లి శాంతమ్మ ప్రశ్నించింది కొడుకు కేసి నడిచివస్తూ.

"ఓహో దొరగారా? ఇల్లు మర్చి పోయాడు లాగుంది. లేక పోతే ఈ ఊరు విశాఖ పట్నమంత బాగాలేదు కాబట్టి మన కళ్లబడకుండానే తిరిగి వెళదామని వస్తున్నాడేమో!" అంటూ వాకిట్లోకి వచ్చాడు తండ్రి లంక పొగాకు చుట్ట చుట్టుకుంటూ.

"చాల్లెద్దురూ మీ ఎత్తి పొడుపు మాటలూ మీరూను. బిడ్డ వాకిట్లోకి వచ్చాడో లేదో మొదలు పెట్టారు," భర్తను మెత్తగా మందలించింది శాంతమ్మ. చంద్రయ్య నవ్వుకుంటూ పశువుల పాక వైపు వెళ్లాడు.

"రారా అబ్బాయ్! ఎంత చిక్కిపోయావు!" అంటూ సూర్యం చేతిలో సూట్ కేసును అందుకుంది శాంతమ్మ.

"ఎవరో అమ్మాయి...బలే ఉందిలే...వాకిట్లో ముగ్గు వేస్తూ నన్ను చూసి తుర్రున తూనీగలాగ ఇంట్లోకి పారిపోయిందమ్మా. ఆ అమ్మాయి ఎవరబ్బా అని ఆలోచిస్తూ అలాగే నిలబడి పోయాను," సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్లు అన్నాడు సూర్యం తల్లి వెనకే నడుస్తూ.

## జరిగిన కథ

సూర్యం, అన్నయ్య పెళ్ళికని స్వగ్రామం వస్తున్నాడు. పెళ్ళికూతురు సరళ. చిన్నప్పుడు తనతో చనువుగా తిరిగిన సరళ, అన్నయ్యను పెళ్ళి చేసుకుంటున్నదంటే సూర్యానికి మనసంతా అదోలావుంది. బండిలోవస్తూ అతను గడిచిన రోజుల్ని జ్ఞప్తికి తెచ్చు కుంటున్నాడు.

---

"అదేవిటిరా చోద్యం, మన సరళను గుర్తు పట్టలేదా? నిన్నుచూసి అది పారిపోవటం ఏమిటి? పెద్దదవు తుందికదూ సిగ్గు ఎక్కువయింది. మీ నాన్నతో మాట్లాడాలన్నా సిగ్గేదానికి." అంది శాంతమ్మ చిరునవ్వు మొహం పెట్టి.

"సరళా! బావకు కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు పట్టు తురా!" అంటూ కేక వేసింది శాంతమ్మ.

సూర్యం కళ్ళు అదుర్దాగా గుమ్మంవైపుకు తిరిగాయి. చిన్నగా ఏదో మధుర ధ్వని దగ్గరౌతుంది. అలాంటి శబ్దం వినటం సూర్యానికి కొత్తకాదు. సరళ కాళ్ళకు పెట్టుకున్న కడ్డీల పట్టాగొలుసుల శబ్దం అంది. ఈ మధ్య కాలేజీ స్టూడెంట్సూ, ఉద్యోగాలు చేసే ఆడపిల్లలుకూడా ఇల్లాంటివి పెడుతున్నారు. కాని వారి వేషానికీ, ఆ గొలుసులూ, వాటి తాలూకు శబ్దం, అతకనట్లు ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. ఎత్తు మడమల జోడువేసి కాళ్ళకు పట్టాగొలుసులు పెడతారు. ఆ నడకకూ, ఆ గొలుసుల శబ్దానికీ ఎక్కడా సామ్యం ఉండదు. శబ్దం ఆగిపోయింది. సూర్యం ఆలోచనలనుంచి బయటపడ్డాడు. ఎదురుగా వాకిట్లో చేతిలో నీటి చెంబుతో నిల్చొనివుంది సరళ. తలవంచి నేల వైపుకు చూస్తుంది.

"ఏమిటే మరీ ఆ సిగ్గు బావదగ్గర? నిన్న మొన్నటిదాకా కొట్టుకొని పితూరీలు చెప్పుకుంటుంటే వినలేక చచ్చిపోయే దాన్ని" అంది శాంతమ్మ, పెట్టె గదిలో పెట్టి బయటకువచ్చి.

"విశాఖపట్నం వెళ్ళేముందురోజు చేతిమీద ఎలా గిచ్చిందో చూడమ్మా! ఆ మచ్చ ఇంకా ఉంది." తల్లివైపు చేతిని చూస్తూ సరళవైపు కొంటెగా చూశాడు. సరళ కళ్ళ కొనలనుంచి కొరకొర చూసింది.

శాంతమ్మ ముసిముసిగా నవ్వుకుంటూ లోపలకు వెళ్ళిపోయింది. సరళ చెంబుడునీళ్ళు ముందుకువేసి చెంబు క్రిందపెట్టి తుర్రున పారిపోబోయింది. ఆ పొడవాటి జడ తాలూకు జడగంటలు సూర్యం చేతికి చిక్కాయి. సరళ అమాంతం సూర్యంమీద పడిపోయింది. సూర్యం చేతులనుంచి విడిపించుకుంటూ "అత్తయ్యా!" అంటూ కేకపెట్టింది. సూర్యం సరళను వదిలేశాడు. సరళ పారిపోయి వంటింట్లో దూరింది. సూర్యం కాళ్ళు కడుక్కోకుండానే వంటింటి గుమ్మంలోకి వచ్చాడు.

"అదేంటిరా కాళ్ళ బూట్లన్నా విప్పకుండా వంటింట్లోకి వస్తున్నావు?" అంది శాంతమ్మ.

"అన్నయ్య ఏడమ్మా?" గుమ్మంలోనే ఆగిపోయి ప్రశ్నించాడు సూర్యం.

"ఊరిబయటకు షికారు వెళ్ళాడు." అంది శాంతమ్మ.

"షికారా? ఇప్పుడేం షికారమ్మా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సూర్యం.

"అదేంటో నాకేం తెలుసురా. ఐదుగంటలకు లేస్తాడు. స్నానం వగైరా ముగించుకుని, తన రంగులూ, కుంచెలూ పట్టుకొని సూర్యోదయం కాకుండానే ఊరిబయటకు కొండల వైపుకు వెళతాడు. బాగా బారెడు పొద్దెక్కాక కాని రాడు. మళ్ళీ సాయంకాలం ఆరుగంటలకు వెళ్ళి ఏ ఎనిమిది గంటలకో కాని రాడు. ఇంట్లో ఉన్నప్పుడయినా ఏమయినా మాటా పలుకా? తన పుస్తకాలేమో తనేమో! తప్పితే బొమ్మలు వేసుకుంటూ కూర్చొని చుట్టూ ప్రపంచాన్నే మర్చిపోతాడుగా" శాంతమ్మ స్వరంలోని బాధను సూర్యం అర్థంచేసుకోకపోలేదు.

"అదా విషయం. కళాకారుడు గదూ? ప్రకృతి సౌందర్యాన్ని తిలకించటానికి వెళుతుంటాడన్న మాట! అన్నయ్య పిచ్చి నాకూ అర్థంకాదు. రోజూచూసే పరిసరాలూ, అదే సూర్యోదయం. ఏం కొత్త అందాలు కనిపిస్తాయో గంటలకొలదీ చూస్తూ కూర్చోవటానికి" అన్నాడు తేలిగ్గా సూర్యం.

చూసేకళ్ళూ, గ్రహించే హృదయం ఉండాలేగాని ప్రకృతిలో అనుక్షణం ఏవో కొత్తఅందాలూ, అనుభవాలూ కనిపిస్తాయని సూర్యం ఎప్పుడూ తన స్నేహితులతో అంటూంటాడు. వచ్చిన చిక్కల్లా అన్నయ్యలోని ఆ సౌందర్య పిపాసనూ, కళా హృదయాన్నీ, సరళ అధికంగా గౌరవిస్తుంది. అది తనుకు తలచుకుంటే వళ్ళు మండిపోతుంది.

సరళ సూర్యం మాటలకు మొహం చిట్లించింది. చురచుర చూసింది. ఆ చూపు "నువ్వు మారలేదు బావా!" అన్నట్టుంది. గతుక్కుమన్నాడు సూర్యం. కళ్ళతో క్షమించమన్నట్లు అర్థించాడు. సరళ పెదవులపై చిరునవ్వుచూసి సూర్యం మనస్సు మళ్ళీ తేలికయింది.

"నువ్వు చాలా పొడుగయావు బావా?" అంది సరళ స్నానంచేసి వచ్చిన సూర్యానికి తుండు అందిస్తూ.

"కాక, నీ పెద్దబావలా పొట్టిగా ఉంటాననుకున్నావా?"

సరళ పక పక నవ్వింది. సూర్యం అర్థం కానట్లు సరళ మొహంలోకి చూశాడు.

"బలే బావవే? పెద్దబావ నువ్వుచూసినప్పుడు ఉన్నట్లే ఉన్నాడనుకుంటున్నావేం? నువ్వూ, నేను పెరిగినప్పుడు బావ ఎందుకు పెరగడు? నీకంటె ఓ బెత్తెడు ఎత్తుగానే ఉంటాడు. ఎంత చక్కగా ఉన్నాడనుకున్నావ్, ఇప్పుడు పెద్దబావ?" కొంటెగా చూసింది సరళ.

సూర్యం "ఊఁ" అని మాత్రం అనగలిగాడు. ఇంత మాత్రానికే ముఖం ముడుచుకున్న సూర్యాన్ని చూస్తుంటే సరళకు నవ్వు వచ్చింది

"నువ్వేం మారలేదు బావా?" అంది సరళ. సూర్యం జవాబివ్వకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు. (సశేషం)

# 'మనోరమ'లో ఒకరోజు

## హైదరాబాదు యాత్రికులకు 'మనోరమ' లో
## ఒకరోజు మరపురాని అనుభూతి

అది వారిని

గోల్కొండ కోట
చార్మినార్
పబ్లిక్ గార్డెన్స్

ఉస్మాన్‌సాగర్
సాలార్జంగ్ మ్యూజియం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

*

మొదలయిన స్థలాలకు తీసుకొని వెళ్తుంది

శుక్రవారం మినహా ప్రతిరోజూ పర్యటించవచ్చు

## సాలార్జంగ్ మ్యూజియం

ప్రవేశ రుసుముతో సహా

**రూ. 8-00 మాత్రమే**

రిజర్వేషన్లు చేయించుకోవలసిన స్థలము-మనోరమ బయలుదేరు స్థలము

**రాష్ట్ర జన సంబంధ శాఖ**

గాంధీభవనం ఎదుట, హైదరాబాదు.

**ఫోన్ నం. 43281 మరియు 43282**

# జిల్లాలనుంచి

## తూర్పు గోదావరి

*మూడు కొత్త భవనాలు*

అంబాజీపేటలో జిల్లా పరిషత్తు హైస్కూల్ తాలూకు మూడు కొత్త భవనాలకు సెప్టెంబరు 10వ తేదీన జిల్లా పరిషత్తు అధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు.

*వసెక్టమీ శస్త్ర చికిత్సలు*

పిఠాపురం పంచాయతీ సమితికి చెందిన ఉప్పాడ, కొత్తపల్లి గ్రామాలలో సెప్టెంబరు 8వ తేదీ నుండి నాలుగు రోజుల పాటు జరిగిన వసెక్టమీ శస్త్ర చికిత్సా శిబిరంలో 160 మందికిపైగా వసెక్టమీ ఆపరేషన్లు జరిపారు. తూర్పు గోదావరి జిల్లాలోని కుటుంబనియంత్రణ తాలూకు సంచారక వైద్యాధికారి అధ్వర్యంలోనూ, విరవ, రాచపల్లి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలోని వైద్యాధికారుల అధ్వర్యంలోనూ యీ శస్త్ర చికిత్సలు జరిగాయి.

## గుంటూరు

*పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రానికి ప్రారంభోత్సవం*

రాష్ట్ర గవర్నరూ, ఆంధ్ర విశ్వవిద్యాలయ అధ్యక్షులూ అయిన శ్రీ పట్టం ఎ థానుపిళ్ళె అక్టోబరు 6వ తేదీన గుంటూరులో పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. గత ముప్పయి అయిదేళ్లుగా వాల్తేరు పోస్టుగ్రాడ్యుయేటు, రిసర్చి కోర్సులకు కేంద్రంగా వుంటూ వస్తున్నది. అయితే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రిసర్చి తరగతులకు దరఖాస్తు చేసే వారి సంఖ్య క్రమక్రమంగా పెరుగుతుండడం వల్ల చతుర్థ ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో కొత్తగా మూడు పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రాలను నెలకొల్పాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఒక్కొక్కటి ఒక్కొక్క విశ్వవిద్యాలయ పరిధిలోని ప్రాంతాలలో నెలకొల్ప బడతాయి. గుంటూరు పట్టణంలోనూ, దాని పరిసర ప్రాంతాలలోనూ విశేషంగా కళాశాలలు వుండడంచేతా, గుంటూరు అన్ని ప్రాంతాలకు అనువుగా మధ్యలో వుండడంచేతా ఇక్కడ అలాంటి కేంద్రాన్ని నెలకొల్పాలని ఉద్దేశించారు. తదనుగుణంగా గతఅక్టోబరు నెలలో దీనికి ప్రారంభోత్సవం జరిగింది.

## హైదరాబాదు

*కోళ్ళ పరిశోధక సదస్సు*

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం అక్టోబరు 5వ తేదీ నుంచి 7వ తేదీ వరకు మూడు రోజులపాటు కోళ్ళ పరిశోధక సదస్సు ఒకదానిని ఏర్పాటు చేసింది. జన సంబంధ, శాఖా మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ఈ సదస్సుకు ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఒ. పుల్లారెడ్డి అధ్యక్షత వహించారు.

దేశంలోని వివిధ ప్రాంతాలలోగల కోళ్ళ విషయాల పరిశోధకులందరూ ఒక చోట సమావేశం కావడానికి ఈ సదస్సు తోడ్పడింది. కోళ్ళ పెంపకానికి సంబంధించిన వివిధ విషయాలను, శాస్త్రీయ సమాచారాన్ని ఒకరి నుంచి మరొకరు తెలుసుకోవడానికి దోహదం చేసింది. కోళ్ళ పెంపకందారులను, కోళ్ళ ఆహారాన్ని తయారు చేసే ఉత్పత్తిదార్ల ప్రతినిధులను, మందుల కంపెనీల ప్రతినిధులను కూడా ఈ సదస్సుకు ఆహ్వానించారు.

*వసెక్టమీ శస్త్ర చికిత్సల నిర్వహణలో కొత్త ప్రమాణం*

మేడ్చల్ పంచాయతీ సమితికి చెందిన షామీర్‌పేట గ్రామంలో ఏర్పాటుచేసిన కుటుంబ నియంత్రణ శిబిరం సెప్టెంబరు 25వ తేదీన వసెక్టమీ శస్త్ర చికిత్సలు జరిపించడంలో ఒక కొత్త అఖిల భారత ప్రమాణాన్ని నెలకొల్పింది. ఆ రోజున అక్కడ 323 వసెక్టమీ శస్త్ర చికిత్సలను జరిపారు ఇంతవరకు అఖిల భారత ప్రమాణం 310 మాత్రమే. కేరళ రాష్ట్రం ఈ ప్రమాణాన్ని స్థాపించింది.

*కమ్యూనిటీ హాలుకు శంకుస్థాపన*

హైదరాబాదులోని ధూల్‌పేటలో సెప్టెంబరు 18వ తేదీన లోక్‌సభ స్పీకర్ శ్రీ ఎన్. సంజీవరెడ్డి పురపాలక సంఘానికి సంబంధించిన 30వ కమ్యూనిటీ హాలుకు శంకుస్థాపన చేశారు ఈ హాలు నిర్మాణానికి రూ. 50,000 లు ఖర్చు అవుతుంది.

*రాజేంద్రనగర్‌లో టెలిఫోన్ ఎక్స్చేంజి*

డబ్బు లేదని ప్రజలు దిగులు పడనవసరంలేదనీ, అసహనాన్ని ప్రదర్శించ నక్కరలేదనీ, ఇంతకు పూర్వంకన్న మన పరిస్థితి మెరుగ్గానే వున్నదనీ శ్రీ డి. పుల్లారెడ్డి అన్నారు. రాజేంద్ర నగర్‌లో సెప్టెంబరు 16న కొత్త టెలిఫోన్ ఎక్స్చేంజికి ప్రారంభోత్సవంచేస్తూ కొంత మంది భారత దేశ స్వరూపాన్ని తప్పుగా ప్రపంచానికి చూపిస్తున్నారనీ, తమ బాధల్నీ, ఓటమినీ గోరంతల్ని కొండంతలుచేసి ప్రపంచం ముందు వుంచుతున్నారనీ యిది చాలా బాధాకరమైన విషయమనీ అన్నారు ఆయన. మనం వేస్తున్న ప్రణాళికలు విజయవంతం కాలేదన్న విమర్శ అర్థరహితమైందని తెలియజేశారు.

## కరీంనగర్

*జిల్లా పరిషత్తు హైస్కూల్ నూతన భవనం*

పంచాయతీరాజ్ మంత్రి శ్రీ తోట రామస్వామి సెప్టెంబరు 27వ తేదీన ధర్మపురిలో కొత్తగా నిర్మించిన జిల్లా పరిషత్తు హైస్కూలు భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

*వయోజన విద్య*

పైలట్ పథకం క్రింద జగిత్యాల సమితిలో 1966_67 లో సుమారు 109 వయోజన విద్యాకేంద్రాలను ప్రారంభించారు. ఈ కేంద్రాలలో 1373 మంది పురుషులను, 16 మంది స్త్రీలకు విద్య నేర్పారు.

*పెద్దపల్లి సమితి కేటాయింపులు*

స్థానిక ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి మందులు కొనే నిమిత్తం రూ 2800 లు కేటాయిస్తూ పెద్దపల్లి పంచాయతీ సమితి స్థాయీ సంఘం ఏడవ సమావేశంలో నిశ్చయించింది. ఈ సమావేశం సెప్టెంబరు 19 న జరిగింది. సమితిలోని చిన్న సేద్యపు నీటి వనరులను బాగుచేసే నిమిత్తం రూ 12,520 లను కూడా ఈ సంఘం మంజూరు చేసింది.

## ఖమ్మం

*సేద్యపునీటి బావులకై కేటాయింపు*

ఖమ్మంజిల్లా పరిషత్తు స్థాయీ సంఘం సెప్టెంబరు 14 న సమావేశమై కొత్తగూడెం, ఎల్లందు, తిరుమలాయపాలెం, కల్లూరు, ఖమ్మం, మధిర_ఈ ఆరు గిరిజనేతర పంచాయతీ సమితులలోనూ 'ఋణం_సబ్సిడీ' సహాయక పథకం క్రింద 275 సేద్యపునీటి బావులను త్రవ్వే నిమిత్తం రూ 2,75,000 లను కేటాయించింది.

## మహబూబ్ నగర్

*ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్స్ఛేంజికి ప్రారంభోత్సవం*

కేంద్రపార్లమెంటరీ వ్యవహారాల డిప్యూటీ మంత్రి శ్రీ జె. బి. ముత్యాలరావు నాగరకర్నూలులో సెప్టెంబరు 25 న 25 లైన్ల ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్స్ఛేంజికి ప్రారంభోత్సవం చేశారు.

## నిజామాబాదు

*పాఠశాలకు కొత్త భవనం*

నిజామాబాదుకు నాలుగు మైళ్ళ దూరంలోగల ధర్మారంలో జిల్లా పరిషత్తు హైస్కూలు నూతన భవనానికి జిల్లా కలెక్టరు టి. ఎల్. శంకర్ ప్రారంభోత్సవం చేశారు. భవన నిర్మాణం పూర్తికావడానికి సహకరించిన గ్రామ ప్రజలను ఆయన కొనియాడారు. ఈ భవనం నిర్మించడానికి రూ 80,000 లు ఖర్చయ్యింది.

## శ్రీకాకుళం

*భూములేని వారికి పట్టాలు*

శ్రీకాకుళం తాలూకాలోని బొడ్డపాడు గ్రామంలో భూములేని పేదలకు జిల్లా కలెక్టరు సెప్టెంబరు 10వ తేదీన పట్టాలను పంచిపెట్టారు. సుమారు 40 ఎకరాలను 20 మందికి పంచి యిచ్చారు.

## విశాఖ

*గని కార్మికులకు 'సెలవు శిబిరం'*

ఆంధ్రప్రదేశ్‌లోని గని కార్మికుల నిమిత్తం కేంద్ర కార్మిక మంత్రిత్వ శాఖ తాలూకు గని కార్మికుల సంక్షేమ సంస్థ విశాఖ పట్టణంలో 'సెలవు శిబిరాన్ని' ఒకదానిని నెలకొల్పింది.

*వియ్యంపేటలో కుటుంబ నియంత్రణ కార్యక్రమం*

వియ్యంపేట పంచాయతీ సమితిలో కుటుంబనియంత్రణ కార్యక్రమాలను తీవ్రతరం చేశా. ఇక్కడ సెప్టెంబరు నెలలో 129 మంది పురుషులు వసెక్టమీ శస్త్రచికిత్సలు చేయించుకున్నారు. 49 మంది స్త్రీలకు లూపులను అమర్చారు.

## పశ్చిమ గోదావరి

*పరిషత్తు రోడ్ల మరమ్మతు*

పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తుస్థాయీ సంఘం పరిషత్తు, రోడ్ల ప్రత్యేక మరమ్మతులకు గాను రూ 13.29 లక్షలను, పాఠశాలభవనాల మరమ్మతులకు గాను రూ 1,48,500 లను మంజూరు చేసింది. మహిళా సంక్షేమ కార్యక్రమాలకూ, బాల సంక్షేమ కార్యక్రమాలకు రూ 69,450 లను 16 పంచాయతీ సమితులకు పంపిణీచేసేందుకు కూడా యీ స్థాయీసంఘం అంగీకరించింది.

*గ్రంథాలయానికి స్థలం*

లోకల్ లైబ్రరీ అథారిటీకి సంబంధించిన బ్రాంచి లైబ్రరీ భవనం నిమిత్తం 400 చ. గ. లను విరాళంగా యివ్వడానికి తాడేపల్లి పురపాలక సంఘం ఆగస్టు 30 వ తేదీన తీర్మానించి ది. పురపాలక సంఘం స్థలాన్నిగాని యిస్తే ప్రస్తుతం వున్న గ్రంథాలయాన్ని రూ 42,000 ల ఖర్చుతో అభివృద్ధి పరచడానికి లోకల్ లైబ్రరీ అథారిటీ అంగీకరించింది.

*లాల్ బహదూర్ శాస్త్రి విగ్రహ ప్రతిష్ఠాపన*

భీమవరంలోని డి. ఎన్. ఆర్. కళాశాల ఆవరణలో ఆగస్టు 28 న విద్యాశాఖా మంత్రి శ్రీ టి. వి. రాఘవులు స్వర్గీయ లాల్ బహదూర్ శాస్త్రి విగ్రహాన్ని ఆవిష్కరించారు.

# పత్రికా ప్రపంచం



భారత రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుసేన్, హైదరాబాదులో సెప్టెంబరు మొదటి తేదీన అఖిల భారత వార్తాపత్రికల మహాసభ 19వ సమావేశాన్ని ప్రారంభించారు.

మన సమాజంలోని బాగా చదువుకున్న వర్గాలకూ సంపన్న వర్గాలకూ ఆంగ్ల భాషాపత్రికలు అందుబాటులో వుండగలవనడంలో సందేహంలేదు. అయితే జనసామాన్యానికి సమాచారం అందించే ప్రధాన సాధనంగా దేశభాషా పత్రికలే వుండాలని రాష్ట్రపతి ఈ సందర్భంలో ప్రసంగిస్తూ అన్నారు. దేశంలో ప్రజాస్వామ్య విజయానికి మూలాధారమైన పరిణతి పొందిన ప్రజాభిప్రాయాన్ని శక్తివంతమూ, స్వతంత్రమూ, ఆరోగ్యప్రదమైన భారతీయ భాషా పత్రికలద్వారా చక్కగా పెంపొందించ వచ్చునని రాష్ట్రపతి పేర్కొన్నారు.

మనదేశంలో పత్రికలు రాజకీయ విషయాలకు ప్రాధాన్యం ఇస్తున్నాయని చెబుతూ ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఆర్థిక విషయాలకూ, శాస్త్రీయ అంశాలకూ పత్రికలు ప్రాముఖ్యం ఇవ్వాలనీ, ఇందువల్ల అనేక విధాల లాభిస్తుందని డాక్టర్ జాకిర్ హుసేన్ ఉద్ఘాటించారు. ఆర్థికాభివృద్ధివిషయాలకు వార్తాపత్రికలు కేటాయిస్తున్న స్థలం మూడుశాతంకంటెకూడా తక్కువగా వుంటున్నట్లు అంచనా వేశారనీ, ఇది విచిత్రంగా కనిపిస్తున్నదనీ, మన భావి అభివృద్ధిలో జాతీయ ప్రణాళికలకుగల ప్రాముఖ్యతకు ఈ పరిస్థితి భిన్నమైనదనీ రాష్ట్రపతి అన్నారు.

ఈ రోజుల్లో తలెత్తుతున్న ప్రాంతీయ విభేదాలు, భాషా విభేదాల విషయమై ప్రస్తావించి, ప్రజాభిప్రాయాన్ని ఏర్పరచడంలో ప్రధాన పాత్ర వహిస్తున్న దిన పత్రికలు, ఈ అవాంఛనీయమైన ధోరణులను అరికట్టడంలో ఎంతవరకు తోడ్పడ గలవు అని రాష్ట్రపతి అడిగారు.

వివిధ ప్రాంతాలలో అభివృద్ధి సమానంగా జరగవలసిన అవసరం వుంది. అంత మాత్రాన వార్తాపత్రికలు ప్రతి అంశాన్నీ అంతర్ రాష్ట్ర వివాదంగా, పక్షపాత చర్యగా పరిగణించవలసిందేనా? "ప్రభుత్వాలకు రెండు భిన్నాభిప్రాయాలు వుండి ప్రాధాన్యం ఇవ్వడంలో భేద చూపబడిన సందర్భంలో కూడా దానిని రెండు స్వతంత్ర రాష్ట్రాల మధ్య ఏర్పడిన వివాదంగా రెండు స్వతంత్ర ప్రాంతాల ప్రజల మధ్య చెలరేగిన కలహంగా చిత్రించ వచ్చునా"యని ఆయన అన్నారు.

ముఖ్యంగా దేశం ఆర్థికంగా క్లిష్టపరిస్థితి ఎదుర్కొంటున్నది. దీని దృష్ట్యా భారతీయ పత్రికలు గ్రామీణ ప్రాంతాలను అలంబనగా చేసుకొనవలసిన ఆవశ్యకత వున్నదని రాష్ట్రపతి చెప్పారు. జనాభా తీవ్రస్థాయిన పెరుగుతున్నది. ఈ పెరుగుదలను అరికట్టడానికి కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని జాతీయ ఉద్యమంగా సాగించాలి. ఈ ఉద్యమ నిర్వహణలోకూడా పత్రికలు ప్రముఖపాత్ర వహించాలని ఆయన పేర్కొన్నారు.

## విమర్శలు:

ప్రజాస్వామిక సమాజంలో ప్రభుత్వాన్ని విమర్శించడం అనివార్యం. విభిన్న అభిప్రాయాలను ప్రకటించవచ్చు. ఇది వాంఛనీయమే కాని ద్వేషపూరితంగా వ్రాయడం ఎలా సమర్థనీయమని ఆయన ఆశ్చర్యం వెలిబుచ్చారు. విమర్శించేటప్పుడు లోపాలతో పాటుగా విజయాలనుకూడా పరిగణనలోనికితీసుకోవాలి. అప్పుడే అది సరిఅయిన విమర్శ అవుతుందని ఆయనఅన్నారు

## భాషా పత్రికలు :

స్వాతంత్ర్యం తరువాత భారతీయ భాషా పత్రికలు బాగా బలపడ్డాయనీ, ఇది గణనీయమైన అంశమని రాష్ట్రపతి చెప్పారు. హిందీలోనూ, ప్రాంతీయ భాషలలోనూ వెలువడుతున్న వార్తా పత్రికలూ, ఇతర పత్రికలూ సంఖ్యాబలంచేతనేగాక వాటికిగల ప్రభావం వల్లకూడా ప్రాధాన్యం వహిస్తున్నాయి. దిన పత్రికలు ఇతర పత్రికలన్నింటిలోనూ భారతీయ భాషలో వెలువడుతున్న రెండు పత్రికలకు అత్యధిక సర్క్యులేషను వుండడం ముదావహం. దేశీయభాషాలలో వెలువడుతున్న కొన్ని సాహిత్య పత్రికలు ఉన్నత ప్రమాణంలోవున్నాయి. ఇదంతా ఒక ''శుభసూచన'' అని ఆయన అన్నారు.

భారతీయ పత్రికారచయితలకు తమ గురుతరమైన బాధ్యతలను గురించి తెలుసు. శాంతి సమయంలోనేగాక అత్యవసర పరిస్థితులలో కూడా వారు సమర్థవంతంగా వ్యవహరించారు. కొన్ని పర్యాయాలు ప్రాంతీయ, జాతీయ సమస్యలు తలెత్తాయి. అప్పుడు కలహాలు ద్వేషాలు చెలరేగే పరిస్థితులు ఏర్పడ్డాయి. స్వల్ప సంఘటనలు సైతం పెద్ద సంఘర్షణలుగా పెరిగిపోయేటట్లు కనిపించాయి. "ఇటువంటి సందర్భాలలోనే మనం ప్రతి అంశాన్ని సంకుచిత ప్రాంతీయ దృక్పథంతోకాక జాతీయ దృక్పథంతో వీక్షించాలి" అన్నారు రాష్ట్రపతి.

దేశం, ప్రగతి పథంలో పురోగమించడంలోనూ, ఆర్థికాభివృద్ధిని సాధించడంలోనూ ఎదుర్కొంటున్న సమస్యలపట్ల నిష్పాక్షికమైన, సహేతుకమైన వైఖరిని ప్రదర్శించవలసిన అవసరాన్ని రాష్ట్రపతి నొక్కిచెప్పారు.

ప్రెస్ కౌన్సిలు విషయమై ప్రస్తావించి, పత్రికాస్వాతంత్ర్యాన్ని పరిరక్షించడం, ఉన్నతవృత్తి ప్రమాణాలననుసరించి వార్తాపత్రికల కొరకు, పత్రికారచయితల కొరకు ప్రవర్తనా నియమావళిని రూపొందించడం ప్రెస్ కౌన్సిలు ధ్యేయమని రాష్ట్రపతి తెలిపారు.

ప్రజాసక్తి గల వార్తలను అందించడంలోనూ ప్రచారంలోనూ ప్రతిబంధకాలు కలుగకుండా చూడడం, సాంకేతిక పరిశోధనను పెంపొందించడం పత్రికారచనా రంగంలో శిక్షణకు విద్యాబోధనకు సదుపాయాలు కల్పించడం కూడ ప్రెస్‌కౌన్సిలు చేయవలసిన పనులే. ఇంతేగాక అది వార్తాపత్రికల యాజమాన్యం విషయంలో కేంద్రీకరణ, లేక గుత్తాపత్యం పెరగడానికి దోహదం చేసే పరిస్థితులను పరిశీలించి వాటి నివారణోపాయాలను కూడా సూచించవలసి వుంటుంది.

రేడియో, టెలివిజను వంటి అనేక వార్తాప్రచార సాధనాలు అభివృద్ధి చెందినప్పటికీ సమాచారాన్ని అందివ్వడంలోనూ వ్యాపింపజేయడంలోనూ వార్తాపత్రికలు ప్రాముఖ్యం వహిస్తూనే వున్నాయి. ముఖ్యంగా చారిత్రకమైన కారణాలవల్ల భారతీయ వార్తాపత్రికలు స్వభావంలోనూ, దృక్పథంలోనూ చాలా వరకు నగర జన్యమైనవిగా వుంటున్నాయి. అనేక పత్రికలు పట్టణాలనుంచి వెలువడుతున్నాయి. సాధారణంగా రాజధానీ నగరాలనుంచి వెలువడే పత్రికలకు విస్తృతంగా సర్క్యులేషను వుంటున్నది. వరదలు, క్షామాలను గురించిన వార్తలు తప్ప గ్రామీణ జీవనానికికానీ, సమస్యలకుకానీ వార్తాపత్రికలలో లభించవలసినదానికంటే తక్కువ స్థానం లభిస్తున్నది. భారతీయ పత్రికలు మున్నెన్నడూ లేనంతగా తమ దృష్టిని గ్రామాలపట్ల కేంద్రీకరించవలసిన సమయం ఆసన్నమైనదని రాష్ట్రపతి ఉద్ఘాటించారు.

కుటుంబనియంత్రణ వంటి అత్యవసర సమస్యలకు తమ పత్రికలలో తగు స్థానం ఇచ్చి వచ్చే కొన్ని సంవత్సరాల కాలంలో భారత దేశాన్ని పటిష్ఠం చేసే సమిష్టి కృషిలో తోడ్పడవలసిందిగా పత్రికా సంపాదకులకు విజ్ఞప్తి చేస్తూ రాష్ట్రపతి తమ ప్రసంగం ముగించారు.

## కార్యదీక్ష అవసరం :

"మిలాప్" దిన పత్రిక సంపాదకులు శ్రీ రణబీర్ సింగ్ అధ్యక్షోపన్యాసం చేస్తూ వార్తా పత్రికల సంపాదకులు స్వాతంత్ర్యానంతరం తమ పాత్రను చక్కగా నిర్వహించి వున్నట్లయితే ఈ నాడు దేశంలోని ఆర్థిక, రాజకీయ పరిస్థితులు చాలా చక్కగా వుండి వుండేవని అన్నారు.

వార్తాపత్రికా సంపాదకులు స్వాతంత్ర్యానికి పూర్వం ప్రదర్శించిన ఉత్సాహ అభినివేశాలను ఇప్పుడు విడనాడినారని చెబుతూ జాతి శ్రేయస్సు దృష్ట్యా ఈ నాడు కూడా వారు అదే విధమైన ఉత్సాహం కార్యదీక్ష వహించవలసిన ఆవశ్యకతవున్నదనీ దీనిని వారందరూ గుర్తుంచుకోవాలనీ శ్రీ సింగ్ విజ్ఞప్తి చేశారు.

"మన దేశంలో కుల, మత, ప్రాంతీయ విభేదాలవల్ల తలెత్తిన దుష్టశక్తులను ఇప్పటికైనా మనం విజయవంతంగానే ఎదుర్కొనగలమని నేను విశ్వసిస్తున్నాను—అన్నారాయన.

పత్రికారచయితలు ప్రజల ప్రయోజనాలకొరకు పాటుపడాలనీ, అవకాశాలు తక్కువగా గల వర్గాలు, దళిత వర్గాల అభ్యున్నతికి కృషిచేయాలని సూచిస్తూ శ్రీ రణబీర్ సింగ్ తమ అధ్యక్షోపన్యాసం ముగించారు.

జనసంబంధ, శ్రామిక మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ ఈ సందర్భంలో ప్రసంగిస్తూ, పత్రికల అభివృద్ధికి తోడ్పడడానికి, పత్రికల వారి సంక్షేమానికి కృషిచేయడానికై ఒక స్థాయీసంఘం నియమించే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నదని తెలియ జేశారు.

వచ్చే మూడునెలలలో అన్ని తరగతులకు చెందిన పత్రికా రచయితలతో ఒక సభ జరపడానికి తలపెట్టబడిందని మంత్రి పేర్కొన్నారు. పటిష్ఠమైన మార్గాలలో పత్రికలను అభివృద్ధి పరచడానికి అవసరమైన చర్యలను ఈ సభ ప్రభుత్వానికీ, పత్రికల వారికీ సూచించ వచ్చునని అయన అన్నారు.

గ్రామీణ ప్రాంతాలలో వార్తాపత్రికల సర్క్యులేషను పెంపొందడానికి వీలుగా గ్రామాలలో పాఠకుల సంఘాలు, గోష్ఠులు నిర్వహించబడాలని రాష్ట్ర ప్రభుత్వం అభిలషించిందని శ్రీ లక్ష్మణ్ చెప్పారు. "పత్రికా స్వాతంత్ర్యాన్ని గౌరవిస్తూ, వార్తాపత్రికల ప్రమాణాన్ని, స్వభావాన్ని నిర్ధారించడంలో ప్రభుత్వం, ప్రజాభిప్రాయాన్ని పరిగణనలోనికి తీసుకుంటుందని మంత్రిగారు అన్నారు

## గ్రామీణ వార్తలకు ప్రాధాన్యం :

పత్రికలలో గ్రామీణ వార్తలు తగినంతగా ప్రచురింపబడ పోవడాన్ని గురించి మంత్రి శ్రీ లక్ష్మణ్ మాట్లాడారు. అన్నిరకాల వార్తాపత్రికలు, ఇతర పత్రికలలో అయిదుశాతం స్థలంలోమాత్రమే గ్రామవార్తలు ప్రచురింపబడుతున్నాయి. అయితే ఆయా దేశీ భాషలలో వెలువడుతున్న పత్రికల సర్క్యులేషను పెరుగుతుండడంపట్ల మంత్రి హర్షం వెలిబుచ్చారు.

దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పటిష్టంగా కొనసాగడానికై పత్రికలు ప్రజాభిప్రాయ ప్రకటనకు శక్తివంతమైన సాధనంగా రూపొందాలి. భారతీయ పత్రికలు మొత్తంమీద ఉన్నత నైతిక ప్రమాణాలను కాపాడుతున్నాయని ఆయన అన్నారు.

పత్రికా స్వాతంత్ర్యాన్ని శాసనబద్ధం చేసినంతమాత్రాన చాలదు. పత్రికలుకూడా స్వార్థ, సంకుచిత ప్రయోజనాలకు అతీతంగా వుండాలి. యాజమాన్యంలో గుత్తాధిపత్య ధోరణులు ప్రబలడం భావప్రకటనా స్వాతంత్ర్యం విఘాతానికి దారితీసిందని మంత్రి అన్నారు. పత్రికా స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడానికి నిరంతర జాగరూకత అవసరం. 1966వ సంవత్సరంలో, ఉమ్మడి యాజమాన్యం క్రిందగల ఎనిమిది యూనిట్లు, అన్ని దినపత్రికలకు గల మొత్తం సర్క్యులేషనులో 42 శాతం సర్క్యులేషను కలిగివున్నాయి. 5.3 శాతం జాయింట్ స్టాకు కంపెనీల యజమానులు దేశంలోని అన్ని వార్తాపత్రికల సర్క్యులేషనులో 39.2 శాతం సర్క్యులేషను కలిగివున్నారు ఈ సమస్యలు ఇంకా పెరుగుతున్నాయని మంత్రి తెలియజేశారు.

వార్తాపత్రికలను ప్రోత్సహించడానికి రాష్ట్రప్రభుత్వం ఎల్లప్పుడూ కృషి చేస్తుందని జనసంబంధశాఖ మంత్రి అన్నారు.

పత్రికల అభివృద్ధికి తోడ్పడడానికై ప్రభుత్వం గైకొన్న చర్యలను ప్రస్తావిస్తూ, స్వతంత్ర ప్రతిపత్తితో ఆరోగ్యప్రదమైన సంప్రదాయాలతో పత్రికలు అభివృద్ధిచెందడాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నిస్తుందని శ్రీ లక్ష్మణ్ తెలిపారు.

## విజయవాడలో జర్నలిస్టుల సమావేశం :

జన సంబంధ శాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అక్టోబరు 8 న విజయవాడలో వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ వార్షిక సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంలో ఆయన ప్రసంగిస్తూ మన దేశానికి స్వతంత్ర ప్రతిపత్తిగల పత్రికల అవసరం ఎంతైనా ఉందని అన్నారు. ఇటువంటి పత్రికలకు ప్రోత్సాహం కలిగించడానికి రాష్ట్ర ప్రభుత్వం సాధ్యమైనంత వరకు కృషి చేస్తున్నదని ఆయన అభిభాషించారు. పత్రికలు, దానికి సంబంధించిన పనివారల ప్రయోజనాలను సంరక్షించడంలో యూనియన్ చేస్తున్న కృషిని మంత్రి ప్రశంసించారు. పత్రికల పనివారలకు ప్రత్యేకమైన యంత్రాంగంతో కార్మికశాఖను ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని గూర్చి ఆయన ప్రస్తావించారు.

"మనం అనుభవిస్తున్న ప్రజాస్వామ్య స్వాతంత్ర్య వాతావరణంలో దాదాపు అన్ని రంగాలలోను అనేకమంది సార్వజనిక ప్రయోజనాల పేరుతో వాటిని దుర్వినియోగంచేస్తూ స్వ ప్రయోజనాలను సాధించడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే పత్రికా ప్రపంచమంతా అదే దృష్టితో ఉన్నదనడం చాలాతప్పు. అందులో అభూతకల్పనలతో చవుకబారు జర్నలిజంకూడ ఉన్నది. దానిని ఏ విధంగాను ప్రోత్సహించరాదు కొన్ని పత్రికలలో ప్రచురించబడే అసభ్యకరమైన విషయాలవంటి అనేకమైన తీవ్ర సమస్యలను కూడ ఆలోచించాలి. ప్రజాప్రయోజనాల దృష్ట్యా అటువంటి పత్రికలకు అడ్వర్టైజుమెంట్లు యిచ్చి ప్రోత్సహించరాదని నా స్వంత అభిప్రాయం. పత్రికా స్వాతంత్ర్యం ముసుగులో యీ స్వేచ్ఛను అవహేళన చేయనివ్వరాదు. ఇటువంటి వాటిని అరికట్టడానికి ప్రాసిక్యూషన్ ఒక్కటే మార్గంకాదు. యేవిధంగానైనా దీనిని అరికట్టాలి.

"వార్తలు ప్రచురించడంలోకూడ నిజాన్ని మభ్యపరచడంగానీ, ప్రజల ప్రయోజనాలకు ముఖ్యమైన అంశాలను తగ్గించడంగానీ, తీసివేయడంగానీ జరుగుతున్నదనే విషయాన్ని పత్రికలను శ్రద్ధగా పరిశీలించే నిష్పాక్షికులకు తెలుస్తుంది. ఈ ధోరణి పత్రికా ప్రపంచానికి ద్రోహం చేయడమే అవుతుంది. అనేక పత్రికలలో విదేశ వార్తలకు చెడువార్తలకు ప్రాముఖ్యం యివ్వడం జరుగుతున్నది నిర్మాణాత్మకమైన అభిప్రాయాలను చాలా తక్కువగా ప్రచురిస్తున్నారు. ఇతరులపై ఆరోపణలు చేయడానికి ముందు పత్రికా ప్రపంచం తన యింటిని తాను చక్కదిద్దుకోవాలి" అని ఆయన అన్నారు.



# గోసంవర్ధన వారోత్సవాలు

—పి. తిమ్మారెడ్డి

మన దేశం వ్యావసాయిక దేశం. మన జాతీయ ఆదాయానికి, ఆర్థిక సుస్థిరత్వానికీ వ్యవసాయం వెన్నెముక. అలాగే వ్యవసాయాభివృద్ధికి పశు సంపద జీవగర్ర. వ్యవసాయంలో యంత్ర పరికరాలను ఎంత ప్రవేశపెట్టినా, ఇంకా కొన్ని తరాల వరకు గోవును, గో సంతతిని వ్యవసాయం నుండి వ్వరూ వేరుచేయలేరు.

యుగయుగాల నుంచి గోవును మానవజాతి పెంపుడు తల్లిగా గుర్తించి ఆరాధించింది. చరిత్ర కందని తరాలనుంచి కూడా గోవుకు మన జాతి సంస్కృతీ సంప్రదాయాలలో, ఆర్థిక, సాంఘిక, నైతిక వ్యవస్థలో చాల విశిష్టమైన స్థానం ఇవ్వబడింది. 'నంది' నాగరికతా చిహ్నంగా హరప్పా మొహంజదారో చరిత్రలో కనిపిస్తుంది.

వ్యవసాయ రంగంలో పొలందున్నడానికి, మోట తోలడానికి, బండ్లు లాగడానికి, కళ్ళం నూర్చడానికి, గానుగ త్రిప్పడానికి, గ్రామీణ రవాణా సౌకర్యాలకు మనం పశు సంతతి మీదనే ఆధారపడుతున్నాం. మనుషులకు పనికిరాని గడ్డి-గాదం తిని ఆవులు పుష్టికరమైన పాలు ఇస్తున్నాయి. ఆవుపాలు చంటి పిల్లలకు, పెద్దలకు, రోగిష్టులకు కూడా అమృతాహారం. శాకాహారులకు శరీర పుష్టికి కావలసిన జంతు సంబంధమైన మాంసకృత్తులు ఈ పాలద్వారానే లభిస్తున్నాయి. ఇట్లా అనేక విధాలుగా సహాయపడుతూ, మనకు లాభకారిగా ఉన్న గోవు సంతతికి, మన కృతజ్ఞతాభావాన్ని వెల్లడించడానికి—వాటిపై మన బాధ్యతను గుర్తుచేయడానికి ప్రతి సంవత్సరము గోసంవర్ధన వారోత్సవాలు జరుగుతున్నాయి. కేంద్రీయ గోసంవర్ధన సంస్థ 1952 వ సంవత్సరం నుంచి, రాష్ట్ర ప్రభుత్వాలు—అనధికార సంస్థల సహకారంతో ఈ వారోత్సవాలను జరిపిస్తున్నది.

మన దేశంలో ఒకప్పుడు పాలు సెలయేర్లుగా ప్రవహించాయని అంటారు. కాని ఇప్పుడు పూర్వ ఔన్నత్యాన్ని చెప్పుకుని సంతోషించడానికి వీలులేదు.

ప్రస్తుత పరిస్థితులలో విపరీతంగా పెరుగుతున్న జనాభాకు సరిపడినంత ఆహారోత్పత్తి లేకపోవడం చేత ఆహార సమస్య ఏర్పడుతున్నది. దీనికితోడు ఒకవైపు శత్రుమూకలు పొంచి చూస్తున్నాయి. ప్రకృతి వైపరీత్యంవల్ల—వరదల వల్ల అక్కడక్కడా పంటనష్టం, క్షామం కలుగుతున్నది. ఇట్లాంటి పరిస్థితులలో, మనం ఆహారోత్పత్తిలో స్వయం సమృద్ధి సాధించలేకపోతే, మనదేశం ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా, నైతికంగా పతనం పొందే ప్రమాదం ఉన్నది. కనుక అధికాహారోత్పత్తిలో పశుసంపద ప్రాధాన్యమును—అభివృద్ధిని మరిచిపోవడానికి వీలులేదు.

గోసంవర్ధన వారోత్సవాల ముఖ్యోద్దేశం— గోసంతతి, మనజాతి సౌభాగ్యానికి, వ్యవసాయ రంగంలో పాలు, వెన్న నెయ్యిలాంటి అనుబంధ ఆహార పదార్థాల ఉత్పత్తిలోనూ ఎలాంటి ముఖ్యపాత్ర వహిస్తున్నాయో మనకు మళ్ళీ జ్ఞాపకం చేయడమే. అయితే పశుసంపద నుండి లాభం పొందాలంటే మొదట—వాటిని లాభకరమైనవిగా పరిగణించాలి. ఇవి మనకు భారం అనే భావం విడనాడాలి. పశుసంపద సర్వతోముఖాభివృద్ధికి అనువైన వాతావరణాన్ని సృష్టించాలి. పశుజాతి వృద్ధికార్యక్రమాలలో నూతన శాస్త్రీయ దృక్పథం అలవరచుకోవాలి. గోగణాభివృద్ధికి మంచి వాతావరణం కల్పించడానికి ఈ వారోత్సవాల సందర్భంలో చాలా కార్యక్రమాలు రూపొందించ



బడుతున్నాయి. పశుగణాభి వృద్ధికి — (1) మేలుజాతి విత్తనపు ఆబోతులను సరఫరాచేయడం- ( ) నాసిరకం ఆబోతుల విత్తు కొట్టించడం- (ii) పనికిరాని పశువులను గోసదనాలకు పంపించడం- (ii) ఎక్కువ దిగుబడినిచ్చే మంచిరకం గడ్డి విత్తనాలు మొక్కలు సరఫరాచేసి, పశుగ్రాసం అభివృద్ధికి కృషిచేయడం లాంటి ఉద్యమాలు నిర్వహించడం-జరుగుతుంది.

(2) పశుప్రదర్శనాలు, దూడల ప్రదర్శనాలు, పాల పోటీలు నిర్వహించి ఉత్తమమైన వాటికి బహుమతులు పంచి పెట్టడం జరుగుతుంది.

(3) పశు సంవర్ధక శాఖ కార్యక్రమాలు, పశువులదాణా పాడిపరిశ్రమకు కావలసిన పరికరాలు, గడ్డి పెంచేవిధానం, పచ్చ గడ్డిని పాతరవేసి నిలువచేసేపద్ధతి, పరిశుద్ధమైనపాలు ఉత్పత్తి చేసే పద్ధతులు వగైరా ప్రదర్శనల ద్వారా బోధింపబడుతాయి.

(4) పశుగణాభివృద్ధి: (i) ఉత్తమ పశుపోషణ (ii) పశూత్పత్తి (iii) పుష్టికరమైన మేతకు సంబంధించిన పద్ధతులు ప్రచారం చేయబడుతాయి.

(5) పశువులలో అంటువ్యాధుల నిరోధానికి ఉద్యమం నిర్వహించడం జరుగుతుంది.

(6) ముఖ్యంగా పశుగ్రాసపు కొరతను నివారించడానికి "యేపెచెట్టు," "అవిశె" లాంటి పశుగ్రాసపు చెట్లను విరివిగా పెంచాలి.

మనదేశంలో గోసంరక్షణ- పశుగణాభివృద్ధికి సంబంధించిన సమస్యలు చాలాఉన్నాయి.

మనకు మంచి పశువుల సంఖ్య చాలఉన్నది. కాని నిరుపయోగమైన, కుంటి, గ్రుడ్డి, పనికిరాని గొడ్డుటావులు కూడా చాల ఉన్నాయి. ఇట్లాంటి పనికిరాని పశువులు, పాడి పశువులతో దాణా, మేతలో పోటీపడుతున్నాయి ఇవి రైతులకు భారంగా కూడా ఉన్నాయి. వీటిని తీసివేయడం గడ్డు సమస్య పశువుల దాణా, గడ్డిపసరుల కొరత కూడా చాలఉన్నది జనాభా, పశువుల సంఖ్య విపరీతంగా వృద్ధి అవుతున్నది. దీనివల్ల అందుబాటులో ఉన్నభూమి మీద పంటకు ఒత్తిడి ఎక్కువ అయింది దీనికి తోడు సంప్రదాయికంగా ఉంటున్న పచ్చికబయళ్ళ కంచెల విస్తీర్ణం తగ్గిపోతున్నది గ్రామాలలో ఉత్పత్తి అయిన పాలకు సక్రమమైన క్రయ విక్రయ వసతులులేవు.

అదీగాక ఆధునిక శాస్త్రీయ పద్ధతులలో ఇదివరకు పశూత్పత్తి-పోషణ-పుష్టికరమైన మేతలోపం వల్ల పశుసంతతి క్షీణించింది. అందుకే ఒక ఆవు సంవత్సరపు సరాసరి పాలదిగుబడి సుమారు 400 పౌనులు మాత్రమే ఉన్నది. తలసరిపాల వాడకం రోజు 5 ఔన్సుల కంటె ఎక్కువగా ఉండటంలేదు. ఆరోగ్య శాస్త్రంరీత్యా కనీసం 10 ఔన్సుల పాలు కావాలి మనకు.

మనదేశంలో ఎక్కువ పాలు ఇచ్చే జాతి పశువులు లేవని కాదు. మంచి ఒంగోలు ఆవు 40 పౌనులకుపైగా ఇవ్వగలదు. కేవలం పుష్టికరమైన మేత ద్వారానే నూటికి 50-60 వంతుల పాల ఉత్పత్తి ఎక్కువ చేయవచ్చు. పాల కొరకు గేదెలను పెంచడం వల్ల ఆవుల పట్ల పూర్తిగా నిర్లక్ష్యం చేయబడింది.

కామధేనువుగా పూజించిన గోమాతను మనం నిర్లక్ష్యం చేయడం చేతనే ఈ అతివృష్టి-అనావృష్టి క్షామం ఏర్పడుతున్నదే మోననిపిస్తున్నది నాకు

పూర్వ ఔన్నత్యాన్ని కోల్పోయిన గో జాతికి పునరావాసం కల్పించడం ద్వారానే మనం గోసంవర్ధన సప్తాహాన్ని జయప్రదం చేయాలి.

మన రాష్ట్రంలో పశు సంరక్షణకూ, పశు గణాభివృద్ధికీ ప్రభుత్వం చాల పథకాలు అమలుపరచింది

పశువైద్య కేంద్రాలు, కీలక గ్రామ కేంద్రాలు, కృత్రిమగర్భోత్పత్తి కేంద్రాలు, వీర్య సేకరణ కేంద్రాలు పశు సంవర్ధక కేంద్రాలు స్థాపించబడ్డాయి. ఉత్తమజాతి ఆబోతులు, కొన్ని విరాళంగా, మరికొన్ని సగం ధర మీద రైతులకు సరఫరా చేయబడ్డాయి. వాటిపోషణకై ప్రీమియం మంజూరి చేయబడింది పశుగ్రాసం అభివృద్ధికి గడ్డి విత్తనాలు, మొక్కలు సబ్సిడీరూపంగా సరఫరా చేయబడ్డాయి పశుగ్రాసం ప్రయోగక్షేత్రాలు-గడ్డిమొక్కల పంపిణీ కేంద్రాలు స్థాపించబడ్డాయి. పశువులకు పుష్టికరమైన పోషక ఆహారం సరఫరా చేయడానికి మిశ్రమ ఆహార ఫేక్టరీలు స్థాపించబడ్డాయి పశుగ్రాసం బ్యాంకులు స్థాపించ బడ్డాయి. అనధికార సంస్థలు స్థాపించిన గోశాలలకు డబ్బు సహాయం చేయబడింది. ప్రతి సంవత్సరం పశు ప్రదర్శనలు, పాల పోటీలు నిర్వహించి బహుమతులు పంచి రైతులను ప్రోత్సహిస్తున్నది ప్రభుత్వం.

ఇట్లా ఎన్ని విధాలుగా పశు గణాభివృద్ధికి కృషిచేయాలో అన్ని విధాలుగా ప్రభుత్వం కృషిచేస్తూనే ఉన్నది అయితే ఈ అభివృద్ధి కార్యకలాపాలలో గ్రామీణ ప్రజలు తోరవతో పాల్గొన్నప్పుడే పథకాలు జయప్రదం అవుతాయి.

మన రాష్ట్రంలో పూర్వం-ఇప్పుడూ కూడా గోకులాష్టమి పశువుల పండుగలు (సంక్రాంతికి) జరుపడంలో కారణం లేకపోలేదు. గ్రామ ప్రజలు ఒకచోట చేరి పశు సంరక్షణ-పశు గణాభివృద్ధికి తీసుకోవలసిన చర్యలు చర్చించడానికి-శ్రద్ధచూపడానికి ఈ పశువుల పండుగలు అనూచానంగా వస్తున్నాయి

ఈ సంవత్సరం 2వ నవంబరు నుండి 9వ నవంబరు వరకు ఈ "గోసంవర్ధన సప్తాహం" జరుపబడుతున్నది. ఈ వారం రోజులు, మన రాష్ట్రంలోని, అన్ని జిల్లాలలో అన్ని గ్రామాలలో-రైతు సోదరులు, గోసంవర్ధన వారోత్సవాలు ఉత్సాహంతో జరిపి గోగణాభివృద్ధికి కృషిచేస్తారని ఆశిస్తున్నాను.

"గోసేవ యే-దేశ సేవ" "గో సంరక్షణ-దేశ రక్షణ" గా భావించాలి "మంచి పశువులు-అధికాహారం" అన్నదే మన నినాదం.



PUBLISHED BY THE DIRECTOR, JANA SAMBANDHA SAKHA, A.P. HYDERABAD, PRINTED BY THE DIRECTOR, OF PRINTING AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD.

